# హైందవధర్మామృతము




"జయ జయ జగదంబ శివే,
జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే ।
జయ జయ మహేశదయితే,
జయ జయ చిద్గగనకౌముదీధారే ॥"

భారతీయవిద్యానికేతన్.

పంచమపుష్పము
హైందవధర్మామృతము.

## ఈరచయితయొక్క రచనలు.

1. కాళిదాసహృదయము. (తెనుగువచనవిమర్శగ్రంథము)
2. భక్తపోతన - మహాభాగవతరచన. ”
3. “కాళిదాసకావ్యసౌరభమ్” (నాగరీలిపి)
4. ‘పండితరాజ జగన్నాథమహాకవిః’ ”

(ఈనాలుగు గ్రంథములకు చెందిన విశేషవివరణలు,
గ్రంథముచివరగల “అనుబంధము”లో చూడనగును.)


గ్రంథప్రాప్తిస్థానము :

ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి,
భారతీయవిద్యానికేతన్,
ముంగండ
(వయా) అంబాజీపేట.
పి. గన్నవరంమండలం.
తూర్పుగోదావరిజిల్లా. (ఏ. పి.)
పిన్ 533224





“జయ జయ జగదంబ శివే,
జయ జయ కామాక్షి జయ జయాద్రిసుతే ।
జయ జయ మహేశదయితే,
జయ జయ చిద్గగనకౌముదీధారే ॥”

# హైందవధర్మామృతము.




రచన : ప్రచురణ :

ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి,

"విద్వాన్, వేదవిద్యావిశారద, ప్రామాణికవిమర్శకాగ్రేసర"

ప్రథమముద్రణ : 1987

ప్రతులు: 1000

మూల్యమ్ : రు 25-00 లు.

(పోస్టేజి అదనము)



---

ముద్రణ:- శ్రీవిజయలక్ష్మీపవర్ ప్రెస్, భట్నవిల్లి.
ఫోన్ : 342 అమలాపురం (తూ॥ గో॥ జి॥).
ప్రో:- బులుసు వీరభద్రం & సత్యనారాయణ.

# గ్రంథగత విషయసూచిక.

## 2. సంస్కృతి ప్రకరణము.





## 3. సాంఘికప్రకరణము



## 4. సంస్కారప్రకరణము

సంపూర్ణం.

# ముందు మాట.


**Prof. Boddupalli Purushottam,**
National Lecturer,
Rtd. Head of the Dept. of TELUGU,
Nagarjuna University.


GUNTUR
30-8-87

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రిమహోదయులు జగమెఱిగిన బ్రాహ్మణోత్తములు. వారి హృదయం భారతీయవిద్యానికేతనం. వారు పండితరాజపీఠాధిపతులు; అధీతిబోధాచరణ ప్రచారణ పచేళిమ ప్రజ్ఞాధురంధరులు; వేదవేదాంగకోవిదులు; కాళిదాసకవితా సౌందర్యఆవిష్కర్తలు; సంస్కృతాంధ్రభాగవతపారాయణులు; భాగవతజీవనులు; భాగవతపరీక్షావిజేతలు; సంస్కృతాంధ్రభాషానిష్ణాతులు; బహుగ్రంథకర్తలు; బహుగ్రంథమకరంద రసాస్వాదనతుందిలమానసులు.

అటువంటి మహనీయులు నేటియువతరాన్ని ధర్మనిష్ఠాగరిష్ఠుల్ని చేయాలనే ఆగ్రహంతో ఈవయస్సులోను, మనస్సును నిగ్రహించుకోలేక- "హైందవధర్మామృతము" అనే సద్గ్రంథాన్ని రచించారు. అందుకు ఆంధ్రజాతి వారి కెంతో ఋణపడింది. ఆఋణం తీర్చాలంటే, ప్రతియువజనుడు దాన్ని పఠించి, అందులోని అమృతబిందువుల్ని ఆస్వాదించి, అమృతపుత్రులు కావటం ఒక్కటే మార్గం. ఏ ఒక్కడైనా అట్లాంటి

అమృతత్వాన్ని సాధిస్తే శాస్త్రిమహోదయుల ఆత్మకు ఉపశమనం కల్గుతుంది. గ్రంథప్రచురణ అయాసక్లేశం అపనయింపబడుతుంది.

సహస్రమాసపుణ్యజీవనులు కానున్న శ్రీ శాస్త్రివర్యులకు వైదికలౌకికసంస్కృతవాఙ్మయాలు కంఠస్థం. ఆయుర్వేదాది శాస్త్రాలతో గాఢపరిచయం. ఇక వారి సంతతి ఆధునిక విజ్ఞానశాస్త్రాలసారమతులు. మన ప్రాచీనులప్రతిపాదనల్ని వారితో చర్చించి, అవి ఆధునికశాస్త్రసమ్మతాలని గ్రహించి, అటువంటివాటి నన్నిటిని సంగ్రహించి పరమప్రామాణికంగా ఈ "హైందవధర్మామృత" కలశాన్ని సంసిద్ధం చేశారు.

పూర్వులరచనలేకాక, ఆధునికుల రచనలనుండికూడా ఆయా ప్రకరణాల్లో అనేకాంశా లుద్ధరించారు. అటువంటి ఆధునికుల్లో శ్రీ శాస్త్రిగారుకూడా ఒకరే కదా!

'ధర్మ' మంటే ఏమిటి? 'సంస్కృతి' అంటే ఏమిటి? పుట్టుకతో పశువైన మనిషి, వివిధ సంస్కారోపేతుడై, సంస్కృతిమంతుడై ధర్మాచరణంచేత తాను మానవుడై, మాధవత్వాన్ని ఏరీతిగా పొందగలడో ఈగ్రంథం నిరూపిస్తుంది.

అధర్మప్రవణమై, హింసాయుతమై, అవినీతి కాలవాలమై అధఃపతితమౌతున్న ఆర్షజాతి తిరిగి తనపూర్వాన్నత్య



శిఖరాల్ని చేరుకోవాలని శ్రీ శాస్త్రిమాన్యుల మహాశయం. వారిహృదయం జాతిసముద్ధరణాని కెంతగా పరితపిస్తున్నదో ఈగ్రంథాన్ని ఆసక్తితో పఠిస్తే తెలుస్తుంది.

దేశవిదేశాల్లో ఉన్న యువతరం ఈగ్రంథాన్ని పఠించి, కనీసం మానసికంగానైనా మన ధర్మంపట్ల, సంస్కృతిపట్ల గౌరవభావాన్ని సంపాదించుకొని, "అయ్యో, మనధర్మానికి దూరుణ్ణైనానే" అని ఆర్తిగొంటే తప్పక మరుజన్మలోనైనా అటువంటి అర్హుడౌతాడు. ఆవిధమైన ఆర్షజన్మను భగవానుడు నాకు మునుముందుగా ప్రసాదించాలని, తరువాత అందరికిని అందించాలని ఆశిస్తున్నాను. ఆ ఆశతోనే ఈ ముందుమాట నందిస్తున్నాను.

బి. పురుషోత్తం.



# లోకకళ్యాణ సాహితీవేదిక.

## నా మనవి.

భావిభారతపౌరులకు మంగళాశంసనములు :

మానవులకు తమ పూర్వజన్మలోని శుభాఽశుభ సంస్కారాలే తమతరువాతి జన్మలో శుభాఽశుభఫలములను చేకూరుస్తూంటాయి. ఈవిధానమునే, "భారతీయ కర్మ సిద్ధాంతం" అంటారు. కనుక శుభఫలమును కోరేవారందరు పుణ్యకరభావనలతో కూడిన పుణ్యక్రియలనే ఆచరించటం అత్యావశ్యకమైనది. ప్రస్తుతగ్రంథంలో ఈవిషయం 107-112 పేజీలలో విశదీకృత మయింది. కనుక అందరు తమసుఖ శాంత్యాదుల లాభానికైనా వారి ప్రతీజన్మలో సత్కర్మలను ఆచరించితీరాలన్నదే ఈ అమృతగ్రంథంయొక్క అభిమతం.

—: ప్రస్తుతగ్రంథావిర్భావకారణం :—

ఏవేవో సంస్కృతరచనలు గావిస్తూ చాలారోజులు గడపటం జరిగింది. ఈకారణంగా- "ఆత్మీయులైన ఆంధ్రబాల బాలికలకు మన హైందవధర్మాలను గూర్చి తియ్యని తెనుగు భాషలో ఇంతవరకు తెలుపలేకపోయానే" అనే ఆవేదన నన్నీ గ్రంథరచనకు ప్రేరేపించింది. 'మంచిమార్పు' అనేది బాల బాలికలనుంచే ప్రారంభం కావాలికనుక. ఇట్టిప్రేరేపణచేతనే



శ్రుతిస్మృతివాక్యాదుల వివరణ అంతా ఆంధ్రవ్యావహారిక భాషలోనే చేయవలసివచ్చింది.

—: ప్రస్తుతగ్రంథగతశీర్షికాప్రణాళికలోని ఆంతర్యం :—

మొదటిశీర్షిక :— "మనకు కనిపించే ఈ ప్రపంచమంతా నిజానికి పరమేశ్వరుని 8 స్వరూపాలలో ఇమిడిఉంది- కనుక ప్రపంచమంతా పరమేశ్వరుని స్వరూపమే" అనే పరమేశ్వర భావన బాలబాలికల లేతమనస్సులలో హత్తుకోవాలనే భావంతోనే "పరమేశ్వరుని ఎనిమిది స్వరూపాలు" అనే ఆద్యశీర్షికతో గ్రంథప్రారంభంచేశాను. ఇందలిశీర్షికల ప్రణాళికలోని ప్రయోజనాలన్నీ ఇట్లే ఉంటాయని పాఠకోత్తములకు నామనవి.

ఇక "సప్తధాతువులు", "యజ్ఞానికీ, వర్షపాతానికీ గల సంబంధం", "మహేశ్వరుని శివతత్త్వం" వంటి శీర్షికలప్రణాళికవలన- "భారతీయుల నిత్యజీవితమంతా, పవిత్రవేద సంస్కృతితో ముడిపడిఉంది." అనే పవిత్రభావన బాలురలో ఏర్పడుతుంది.

ఇక ధర్మ, అధర్మములను శ్రుతిస్మృతిప్రమాణాలతో వివరించటంవలన- "మానవుల జీవితశ్రేయస్సులన్నీ తమతమ ధర్మాచరణం మీదనే ఆధారపడిఉన్నాయి" అనే స్థిరభావన వారిభావాలలో ప్రవేశించి, అది, వారిజన్మాంతరములలో కూడా వారికి శ్రేయస్సాధక మౌతుంది.

ఇక యజ్ఞాదులనుగూర్చిన వివరణవలన, దేశం సుభిక్షంగా ఉండాలంటే, శాస్త్రీయంగా నిర్వహింపబడిన యజ్ఞక్రియాచరణం అనేది అనివార్యమనే విషయం విశదమౌతుంది. దీనితో మన హైందవధర్మాలయెడ ఇప్పటివారికి ఆదరగౌరవా లేర్పడతాయి.

ఇక ఇప్పటిబాలురు అచిరభావిలో ఉత్తమపౌరులుగా మారి మాతృదేశసేవకు పాత్రులగుటకు పరమసాధనములైన- నైతిక, ధార్మిక, త్యాగ, సచ్ఛీలాది భావనలను ఉపదేశించగల ఉత్తమసూత్రాలను సులభతాత్పర్యములతో ఈధర్మప్రకరణం చివర పొందుపరచినాను. ఈవిధమైన ప్రణాళికవలన బాలురలో కల్గిన ఔదార్యంతోబాటు "వసుధైకకుటుంబక భావన" ఏర్పడుతుంది.

ఇక రెండవదైన "సంస్కృతిప్రకరణం"లో- ప్రపంచసంస్కృతులన్నింటికి జ్ఞానభిక్ష పెట్టగల మన పవిత్రభారతీయ సంస్కృతి, ప్రపంచప్రజలకు ఐహికంగాను, ఆముష్మికంగాను సర్వవిధశ్రేయస్సులను సమకూరుస్తూ, మానవులను మాధవులుగా మలచడానికి సర్వసమర్థమై ఉన్నదని బాలురు గ్రహించాలి. కనుక మనసంస్కృతి వివిధదృక్కోణాలతో వీక్షించి విశదీకరింపబడినది.

మూడవదైన సాంఘికప్రకరణం పరిమాణంలో చిన్నదైనా అందు, భారతరాజ్యాంగవ్యవస్థ సర్వజనసుఖావహంగా



ఉండటానికి తగిన శాస్త్రీయనిబంధనలు, సూత్రాలు సూచించబడినాయి.

ఇక నాల్గవదైన సంస్కారప్రకరణంలో- మానవుల జీవితాలు పుట్టుకతోనే దోషదూషితాలుగా ఉంటాయనీ, ఆదోషాలు తొలగడానికీ, క్రొత్తశక్తులు మానవులలో ప్రవేశించి వారిజీవితాలునూత్నవికాసాలతో విరాజిల్లడానికీ, ఉత్తమసంతానమును దంపతులకు ప్రసాదించడంద్వారా సామాజిక కళ్యాణమును చేకూర్చడానికీ, మన సంస్కారాలు సర్వసమర్థములై ఉన్నాయని, అనేక శాస్త్రీయ నిదర్శనములతోను, లౌకికోదాహరణములతోను నిర్దేశించబడింది. దేశం పుష్టిమంతంగానూ, వీర్యవంతంగానూ, కీర్తిమంతంగానూ, ఉండాలంటే- "సంస్కారాలు శాస్త్రీయంగా నిర్వహింపబడా"లని అనేక శ్రుతి, స్మృతిప్రమాణాలతో ఇందు నిరూపించబడింది.

ఇట్టి గ్రంథముపై తమ అమూల్యాభిప్రాయము లొసంగి గ్రంథప్రయోజనాలను ప్రకాశింపజేసిన- సహృదయ శిరోమణులు- విద్వత్పండితవరేణ్యులకు నా కృతజ్ఞతాంజలు లర్పించెదను. "అట్టి ఆవిద్వదగ్రగణ్యులకు ఆవిశ్వేశ్వరుడు, సర్వాభ్యుదయములను సమకూర్చుగాక" అని ఆదేవుని అర్థించుచున్నాను.

ఇక ఈగ్రంథమును శ్రద్ధతో చక్కగా ముద్రించి ఇచ్చిన 'ప్రఖ్యాత' శ్రీవిజయలక్ష్మీపవర్ ప్రెస్ యజమానులకు హార్దికాభినందనము లందించుచున్నాను.

జీవితశ్రేయస్సంపాదనదీక్షాదీక్షితమైన ఈ గ్రంథము యొక్క పఠనంవలన పాఠకోత్తములు సర్వవిధశ్రేయస్సులను సమకూర్చుకొందురుగాక అని హార్దికముగా ఆశించెదను.

ఇట్లు,
విద్వజ్జన విధేయుడు:
ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి.





గ్రంథరచయిత, వారి ధర్మపత్ని.

**Dr. K. Mahadeva Sastry,**
Retired Professor of Telugu,
Sri Krishnadevaraya University,
ANANTAPUR.

**Madras,**
10-10-1987.

Sri K. Suryanarayana Sastri is a vedic scholar and litterateur well known for his researches in sanskrit and Telugu literature. He has done a great service by publishing this work - the product of his mature experience and wisdom and it deserves to be read by parents, teachers, educationists, all those who are concerned with the wellbeing of the younger generation.

HAINDAVA DHARMAAMRTAMU is a treatise on the fundamentals of Hindu social philosophy and culture, specially written for the younger generation. It explains the nature of the world and the possibilities of all round progress of man.

According to Hinduism Dharma should be the regulative principle of our life. Dharma signifies the whole duty of man for attaining happiness and the force that sustains. Even our individual and social customs have their basis in Dharma.

Another characteristic of Hindu culture is the emphasis on spirituality and lofty ideals leading to happiness of all the whole universe as one family.

Some of the facets of our culture are explained here, such as the significance of the Yajnas and the rites connected with the Gods and *pitrus*. At a higher level the method for uplifting oneself in the mundane world is by consecrating all works unto the Lord :

*Yad - yat karma karomi tat tad akhilam Sambho tav - aaraadhanam.* Starting with the food that we eat we must offer everything in a mood of prayer to the Lord. This deep spiritual basis of our life is exemplified not only in the works of great writers like Kalidasa but also in the lines of poets nearer to us - Potana, Peddana and Tyagaraja. They lived a life of harmony with nature and human nature.

Hinduism prescribes on its members a number of rites and ceremonies called *Samskaras.* They cover the entire life span from conception to the grave. The object of the *samskaaraas* is to purify the individual and draw out the latent powers in him. Of the 16 *samskaaraas vivaaha* is the most significant because married life enables one to find fulfilment both here and the worlds hereafter. The sections on the significance of the mantras in the marriage, and *brahmacharya* the descipline to be observed by a *brahmachaari* are as simple and impressive as they are important.

One last point that must impress anyone interested in Indian culture is the emphasis the author places on Sanskrit as the language of Indian culture. One recalls here the observation made by Louis Renou of France that the misfortune of India is that even the education authorities do not know Sanskrit.

(Sd) K. Mahadeva Sastry.

—

# పండితాభిప్రాయములు.

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు
శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యేత్యాది
సమస్తబిరుదావళీవిరాజమాన శ్రీపుష్పగిరి — అమలాపురం
పీఠాధీశ్వరులు శ్రీమదభినవోద్దండ — 6-10-1987
శ్రీవిద్యానృసింహభారతీస్వామి:వారు

అస్మదత్యంతప్రియశిష్యులు శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారికి ఆశీఃపరంపరాపూర్వకముగా వ్రాయించి పంపు నారాయణస్మరణపత్రిక.

మీచే రచింపబడిన 'హైందవధర్మామృతం' అను గ్రంథము మాకందినది. దానిని కొంతపరిశీలించితిమి. ధర్మము పూర్తిగా అడుగంటు నున్న ఈరోజులలో యిట్టి ధర్మప్రేరకము లగు గ్రంథములు వెలువడుట శుభావహ మని మా తలంపు.

నిజముగా హైందవధర్మము అమృతప్రాయమే యైనను ఆధునికులు తద్ధర్మమును విస్మరించుట కొంతవిచారహేతువుగ నున్నది. ఈ'హైందవధర్మము' అను అమృత మీగ్రంథమందు నిక్షిప్తమై యున్నదని మాకుఁ దోచును. ఇది సర్వమానవజీవితములపై తనప్రభావమును చూపి, ఆనందమయజీవితమునకుఁ దగిన రాచబాటను చూపగలదు.

ఈగ్రంథమున శాస్త్రిగారు చేసిన ప్రకరణవిభాగము మిక్కిలిరమణీయకమై వలసినవిషయములను సులభగ్రాహ్యముం జేయుచున్నది.

అందు మొదటిది ధర్మప్రకరణము. దీనిలో ప్రపంచము పరమేశ్వరమయము. 'ఆర్షజీవనవిధానమును అలవరుచుకొనవలె నన్న ప్రథమతః ధర్మమే ఆచరణీయం' అను విషయమును ధర్మాచరణముద్వారా చిత్తశుద్ధి, తద్ద్వారా యింద్రియనిగ్రహము అనువిషయము లీప్రకరణమున వివరించబడినవి. ఏతద్విషయ ప్రోద్బలకముగా అచ్చటచ్చట నుదహరింపబడిన గీతా-ఉపనిషత్-వేదార్థాదులు మిక్కిలి ప్రశంసాపాత్రములు.

రెండవది సంస్కృతిప్రకరణము. 'సంస్కృతభాష మృతభాషయను అభిప్రాయము భారతీయులదేగాని,విదేశీయులది కాదు. ఇది మనదౌర్భాగ్యము.' "సంస్కృతము తల్లి సర్వభాషలకును" అనుసూక్తిని వివరిస్తూ సంస్కృతభాషాపదములు కొన్ని రూపాంతరమును పొంది, నేడు ఆంగ్లభాషలో ఎట్లునిలిచినవో! వివరించుచూ, శాస్త్రిగారు చూపిన___

'సాయకీలః- సైకిల్; ఫలావరః- ఫ్లవర్; కలాకః- క్లాక్' అను పదములు వారి భాషాశాస్త్రవైదుష్యమున కుదాహరణములు. భారతీయసంస్కృతిలో భక్తి మొదలు- పరమసమాధిస్థితి వరకు భౌతికఆధ్యాత్మికవిషయములపై విషయవిపులీకరణము మిక్కిలి రమణీయమై యున్నది.

మూడవది సాంఘికప్రకరణము. దీనిలో లౌకికవిషయా



వృత్తిలో మానవు డెట్లుధర్మబద్ధుడై యుండవలెనో సూచింపబడి యున్నది.

నాల్గవది సంస్కారప్రకరణము. జన్మప్రభృతి జరుగుచున్న సంస్కారవిశేషము లన్నియు భావిజీవితమానందమయ మొనర్చుకొనుట కుపయోగపడునవే! అనువిషయము సోపపత్తికముగ ఇందు వివరింపబడి యున్నది. సదాచారసంపద హైందవధర్మభాండారనిక్షిప్తముగ నున్న దనుట నిశ్చయపరుపబడియున్నది.

పంచదశకర్మలు, వానిస్వరూప-ప్రయోజనముతో విభాగమున విపులీకరింపబడియున్నది. కావున శ్రేయస్కాము లందరును ఈవిభాగమును శ్రద్ధతో పఠింతురుగాత మని మా యాశయము.

మొత్తముమీద ఈగ్రంథరచన, ఇందలి విభాగసరళి శాస్త్రిగారికూలంకషపాండిత్యాన్ని చాటుచున్నది. ఈగ్రంథము పిన్నపెద్దల తేడాలేక యెల్లరును, పఠింపతగినది. శాస్త్రిగారు ఈవిషయమున జేసిన పరిశ్రమ మిక్కిలి ప్రశంసాపాత్రము. శాస్త్రిగా రిట్టిధార్మికగ్రంథముల నింకను కొన్నింటిని వ్రాసి, మానవసంఘౌన్నత్యమునకుతోడ్పడుదురుగావుతమని,అట్టిశక్తిని శ్రీశారదాచంద్రమౌళీశ్వరులు ప్రసాదింతురుగావుత మనియు ఆశించుచున్నాము.

"ధర్మో రక్షతి రక్షితః"

శ్రీవిద్యానృసింహభారతీస్వామినః

——

'వేదమీమాంసాసార్వభౌమ,
సాఙ్గవేదార్థసమ్రాట్,
శాస్త్రరత్నాకర'
రేమెళ్ల సూర్యప్రకాశశాస్త్రి,
రిటైర్డ్ ప్రిన్సిపాల్,
శ్రీగౌతమీవిద్యాపీఠము.

సీతంపేట,
రాజమండ్రి,
22-9-1987.

సుప్రసిద్ధమైన శ్రీజగన్నాథపండితరాయకుటుంబమునకుచెందిన వారిస్వగ్రామమైన కోనసీమాంతర్గతమైన ముంగండ అనుపేరుతో ప్రస్తుతము వ్యవహరింపబడుచున్న మునిఖండమను గ్రామవాస్తవ్యులు, వేదమును, సంస్కృతాంధ్రములను సంప్రదాయసిద్ధముగా అధ్యయనముచేయుటయేగాక చక్కని విమర్శకులుగా, సంస్కృతాంధ్రములలో గ్రంథరచయితలుగా ప్రసిద్ధిచెందిన, నాకు చిరకాలపరిచితులు అయిన శ్రీఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారు ప్రస్తుతకాలమున మనభారతీయుల యొక్క భారతీయత లుప్త మగుచున్నదనే తపనతో సామాన్య మానవునికికూడా అర్థమగు శైలిలో- (1) ధర్మప్రకరణము, (2) సంస్కృతిప్రకరణము, (3) సాంఘికప్రకరణము, (4) సంస్కారప్రకరణము- అను శీర్షికలలో "హైందవధర్మామృత" మను పుస్తకమును రచించి చూడవలసినదిగా నావద్దకు తెచ్చియిచ్చిరి.

దీనినామూలాగ్రముగా చదివితిని. (1) ధర్మప్రకరణము అనుపేరుతో ధర్మశబ్దమునకు వ్యాకరణశాస్త్రానుసారముగా,



న్యాయ-మీమాంసాదిదర్శనములయొక్క సిద్ధాన్తానుసారముగా అర్థవిశేషమును ప్రదర్శించి, వేదమందలి "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" అను శ్రుతి బోధించినరీతిలో ధర్మ మెట్లు సమస్తజగత్తునకు ఆధారభూత మగునో లౌకికవైదికయుపపత్తులతో నిరూపించిరి.

మరియు, ఉదకములు, అగ్ని మొదలగు ఈశ్వరమూర్తుల నారాధించుటవలన కలుగు ప్రయోజన మేమిటో స్పష్టముగా సప్రమాణముగా నిరూపించుచు, కొన్ని ముఖ్యసూత్రము లు అను పేరుతో భారతాదులయందు, ధర్మశాస్త్రమునందు, ఆయుర్వేదము మున్నగువాటియందు ప్రకరణములుగా ఉన్నవాటిని, నిత్య జీవితమును మలచుకొని ప్రమాదరహితముగా జీవయాత్రను సాగించుకొనుట కత్యంతోపయుక్తము లగువాటిని సుబోధకములుగా నిరూపించిరి.

ఉదాహరణకు కొంతమంది అదృష్టప్రయోజనము నంగీకరింపక పోవచ్చును. దృష్టప్రయోజనము అనగా ఆయుర్వృద్ధికారణములయిన ఆహారవిహారముల నెట్లు మసలవలెనో తెలియుటకు 'న నక్తం దధి భుంజీత.' రాత్రిభాగమున దధియుక్తమయిన భోజనము చేయకూడ దని తెలియక చాలా మంది అట్లే భుజింతురు.

పురుషునికంటె స్త్రీవయస్సు తక్కువగా దంపతులలో యుండవలెనని స్మృతులలో- "యవీయసీం లక్షణ్యాం స్త్రియ

ముద్వహేత్" అని యున్నను కొంతమంది నాగరికులు పురుషునికంటె స్త్రీవయస్సు అధికముగా యుండవలెనని పత్రికాముఖముగా ప్రకటించుచున్నతరుణములో వైద్యశాస్త్రప్రకారముకూడ స్త్రీ తక్కువవయస్సులో ఉండవలెననియు, అలా కానియెడల ఆయుర్దాయము క్షీణించుననియు సప్రమాణముగా శ్రీ శాస్త్రిగారు నిరూపించిరి. చాలాముఖ్యసూత్రములను నిత్యము అందరను పాటించవలసినవాటిని ఒకచోటుకు సంకలనంచేసిరి.

(2) సంస్కృతిప్రకరణ మనుపేరుతో సంస్కృతిశబ్దార్థము నిరూపించిరి. సంస్కృతము, సంస్కృతి, సంస్కారము, సంస్కరణము అను పలుశబ్దములుగలవుగాని ఇవన్నియు 'సమ్' పూర్వకకృఞ్ధాతువువలన నేర్పడినవే. సంస్కృతము అనునది భాషాపరముగా వాడబడుచున్నది. సంస్కృతి యనునది వక్తృవివక్షానుసారముగా యున్నది. శ్రీశాస్త్రిగారు వ్రాసినట్లు ఆచారవ్యవహారములు, ఉదాత్తాదిభావములు, సంప్రదాయములు మున్నగువానిసముదాయము సంస్కృతియనుట సమంజసముగానే యున్నది. సంస్కారము, అనగా లెస్సగా చేయునట్టి క్రియాకలాప మని షోడశసంస్కారములు అనువాటి యభిప్రాయముగా ఉన్నది.

సంస్కరణ అన్నపుడు ఇప్పటికాలము ననుసరించి కొన్నిధర్మములను, ఆచారవ్యవహారములను సంస్కరించుట



అవసర మందురు. ఇచ్చట వీరియభిప్రాయము లోగడ ఉన్నవాటిని మార్పుచేయుట అని యభిప్రాయము. సంస్కృతి అన్నది వేదసంస్కృతి, భారతీయ సంస్కృతి ఇత్యాదివ్యవహారము గలదు. ఇచ్చట వేదముచే ప్రతిపాదింపబడిన జ్ఞానవిశేషము. భారతీయసంస్కృతి అన్నపుడు వేదములోను, తన్మూలకమయిన పురాణాదులయందును ప్రతిపాదింపబడి భారతీయులకు ఆచారములో అనగా సంప్రదాయములో ఉన్నదానిని సంస్కృతి అని వాడుచున్నారు. ఏమయినను శ్రీశాస్త్రిగారు వివరించిన ఆచారాదిసముదాయము సంస్కృతియంతే ఇందన్నియు యిమిడియున్నవి.

ఈప్రకరణములో సంస్కృతభాష ఇతరభాషల కెట్లు మూల మగునో, సంస్కృతాంధ్ర దృశ్యశ్రవ్య ప్రబంధములలోను, ఆటపాటలలోనుకూడ ఆధ్యాత్మికతత్త్వ మెట్లు పెనవేసుకొనియున్నదో చక్కగా నిరూపించిరి.

యజ్ఞములు, మహాయజ్ఞములు మున్నగునవి లోకముల కెట్లుపయోగపడుచున్నవో శ్రీశాస్త్రిగారు వివరించిన తీరు చూచినవారికి, వీటివలన ఉపయోగము లేదనే వారిభావము పటాపంచలు కాగలదు.

(3) ఇక సాంఘికప్రకరణ మనుపేరుతో ప్రజారాజ్యపద్ధతి రాజ్యనిర్వహణము, దీని కుపయోగముగా ఆధ్యాత్మికబోధ రాజు చేయించవలెననియు, సాంఘికనైతికసూత్రము లనే

పేరుతో వాటివివరములనుకూడ యిచ్చిరి. ఈసంకలనములో కొన్నివిషయములు ముందువెనుకలుగాకూడ చేర్చినారని చెప్ప వచ్చును. ఈప్రకరణములో చూపిన నైతికసూత్రములు, ముఖ్యసూత్రములు అను శీర్షికలో చేర్చినను యుక్తమని పించును.

(4) సంస్కారప్రకరణము అనే పేరుతో వర్ణాశ్రమవిభాగపుర స్సరముగా ధర్మశాస్త్రమందు విధింపబడిన సంస్కారకర్మల స్వరూపలక్షణములు, వాటి అవశ్యకతయు నిరూపించిరి. ఈసంస్కారకర్మలు కొంతమందికి 16గాను, కొంతమందికి ఉప నయనము, వేదాధ్యయనము, వేదవ్రతములు లేనివారికి 10 సంస్కారములని చెప్పబడెను.

ఇందు కొన్ని ఆశ్రమప్రయుక్తసంస్కారములు, వర్ణ ప్రయుక్తసంస్కారములు, వర్ణాశ్రమప్రయుక్తసంస్కారములు, గుణనిమిత్తసంస్కారములు- అనగా పరిపాలనచేయు రాజునకు అభిషేక మనుసంస్కారము, కొన్నిదోషములను పోగొట్టునట్టి ప్రాయశ్చిత్తకర్మలు, నిమిత్తంవలన ఏర్పడిన సంస్కారకర్మ లని యందురు.

ఈసంస్కారకర్మలన్నింటికి ఉత్తమోత్తమమైన ప్రయోజ నము గలదు. వీటివలన మాతాపితరులయొక్క బీజగర్భ సముత్పన్నమయిన దోషములు, తాను జన్మాంతరమందు చేసు కొన్న దోషములను పోగొట్టుకొనుటకు, ఇందు కొన్నిసంస్కార



కర్మలు చేయవలసిన బాధ్యత తండ్రిది; చేసినందువలన ఫలము పుత్రులది; చేయకపోతే ప్రత్యవాయము తండ్రిదని నిర్ణయించిరి.

స్నాతకము లగాయతు సంస్కారకర్మలకు తానే కర్తగనుక తండ్రికి ప్రత్యవాయము లేదు. ఈసంస్కారకర్మలు అనునవి కూడా ధర్మప్రకరణములో చేర్చవచ్చును.

శ్రీశాస్త్రిగారు గ్రంథముయొక్క ఆదిలోను, మధ్యమధ్యను 'బాలబాలికలారా !' అని సంబోధించి వారు ఈగ్రంథమును చదువుటచే మనభావిభారతీయపౌరులు కాగల రనేభావమును సూచించిరిగాని దీనివలన ఉపయోగము పిన్నలకు, పెద్దలకు కూడా కాగలదని, చాలామందికి మనవాళ్ళకు భారతీయ సంప్రదాయములు తెలియనందున ఈపుస్తకము చాల ఉప యోగపడగలదని విశ్వసించుచు, ఇట్టి లోకోపకారకము లయిన గ్రంథములను రచించు సామర్థ్యమును, దీర్ఘాయుస్సును శ్రీశాస్త్రిగారికి శ్రీపరమేశ్వరుడు ప్రసాదించు గాక ! యని నా ఆశంసన.



శివాయ గురవే నమః

"న్యాయవ్యాకరణవిద్యాప్రవీణ"
విశ్వనాథ గోపాలకృష్ణశాస్త్రి, M.A.,
ప్రిన్సిపాల్- శ్రీ గౌతమీవిద్యాపీఠం,
S. G. V. P. K J. ఓరియంటల్
డిగ్రీకాలేజ్, రాజమండ్రి.

రాజమండ్రి - 5
10—10—87.

బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారు ముంగండగ్రామనివాసులు. సనాతనవైదికాచారపరాయణులైన పండితకుటుంబములోనివారు. వేదాధ్యయనముగావించి, ధర్మశాస్త్రాదిపరిశోధకులై నేటి భారతీయసమాజమును ఉద్ధరించు సత్సంకల్పముతో అనేకగ్రంథములను రచియించి లోకోపకారము గావించుచున్నారు.

వీరు వ్రాసిన "కాళిదాసహృదయము" శ్రీశాస్త్రిగారి అసాధారణవైదుష్యమును, సాహిత్యపారదృశ్వతను చాటుచున్నది. శ్రీమాన్ కాశీ కృష్ణాచార్యులవారు "కాళిదాసరహస్యసర్వస్వాభిజ్ఞ" బిరుదముతో వీరిని సత్కరించుట- పండితజనశ్లాఘనీయము.

వీరి 'భక్తపోతన-మహాభాగవతరచన' అను గ్రంథము ఆధ్యాత్మికతత్త్వావేదకమై, పోతనామాత్యుని భావములను విశదపరచు విమర్శగ్రంథము. వీరు పండితరాజజగన్నాథ మహాకవినిగూర్చి సంస్కృతభాషలోవ్రాసిన విమర్శగ్రంథము ప్రామాణికమైన చరిత్రగ్రంథము. అందు జగన్నాథపండిత



రాయల వైదుష్యము, అమోఘమైన కవితాపటిమ వర్ణింపబడుటయేగాక పండితరాయలపై ప్రచారములోనున్న అపవాదులకు సయుక్తికముగ సమాధానము చెప్పబడినది. ఆంధ్రదేశమునకు గర్వకారణమైన పండితరాయలపేరిట శ్రీ జగన్నాథపండితరాజపీఠమును స్థాపించి నిర్వహించుచున్నారు. వీరి సంప్రదాయానురక్తి, ధర్మశ్రద్ధ వీరిపాండిత్యమునకు వన్నె తెచ్చుచున్నవి.

జ్ఞాన, వయోవృద్ధులైన శ్రీ శాస్త్రిగారు నేటి బాలబాలికల భవితవ్యమును తీర్చిదిద్దవలె నని సంకల్పించి, 'మన హైందవసంప్రదాయమునందలి ముఖ్యమైన కొన్నివిషయములను పిల్లలకు అందుబాటులోనున్న వ్యావహారికభాషలో 'హైందవధర్మామృతము' అను ఈగ్రంథమునందు చక్కగ వివరించియున్నారు.

ఇందలి విషయములు వేద, శాస్త్ర, పురాణాదిప్రతిపాదకములు- శ్రౌత, స్మార్తాదికర్మలు- వాటి ప్రాముఖ్యము- మనోహరములైన దృష్టాంతములతో సులభశైలిలో విశదపరుపబడినవి.

ఈగ్రంథమున నాలుగుప్రకరణములు కలవు. (1) ధర్మప్రకరణము, (2) సంస్కృతిప్రకరణము, (3) సాంఘికప్రకరణము, (4) సంస్కారప్రకరణము.

ధర్మప్రకరణమున బహుశాస్త్రములలోని ధర్మలక్షణముల నుదహరించి, ధర్మస్వరూపము, యాగాదికర్మాచరణము యొక్క ఆవశ్యకత నిరూపింపబడినవి. ఇంద్రియనిగ్రహము అత్యంతప్రధాన మని వివరించుచు, నిగ్రహములేనిచో కలుగు అనర్థములను భుజంగ, మాతంగ, పతంగ, భృంగ, మీనాదుల పోలికతో (పే. 31) రమ్యముగ చూపియున్నారు.

ఈగ్రంథమునందు సమాజమునకు అత్యంతోపకారకములగు కొన్నిఅపూర్వవిషయములను 'మూలసూత్రములు-తాత్పర్యములు' అను శీర్షికతో (పే.36) సేకరించియున్నారు. ఇట్లే సాంఘికప్రకరణమునందు గూడ 'సాంఘికనైతికాదిసూత్రాలు' అను శీర్షికతో ఉదహరింపబడిన విషయములు మానవుని నిత్యజీవితాభ్యుదయమునకు మహోపకారము చేయగలవు.

భారతసంస్కృతికి మూలాధారమైన సంస్కృతభాష గొప్పతనాన్ని, అనేకఉదాహరణలతో, పాశ్చాత్యుల అభిప్రాయములతో 'సంస్కృతి-సంస్కృతము' అను ప్రకరణమునందు యుక్తియుక్తముగ తెలిపియున్నారు.

ఆధ్యాత్మికభావౌన్నత్యము, జ్యోతిషము-మంత్రవిద్య-యోగశాస్త్రము మున్నగు భారతీయవిద్యల గొప్పతనాన్ని



పరిచయం చేస్తూ, భోజనాదినిత్యక్రియలయందు గూడ ప్రాణాగ్నిహోత్రరూపమయిన యజ్ఞభావన కల్గి యుండవలెనని శాస్త్రీయముగ వివరించిరి.

ఈగ్రంథమునందు సందర్భోచితముగ ధర్మోపదేశముతోబాటు కాళిదాసాదిమహాకవుల ప్రౌఢప్రయోగవైఖరి, వ్యంగ్యవైభవాదినిరూపణలతో వర్ణింపబడినది.

సంస్కారప్రకరణమునందు, సంస్కారములను అనేకలౌకికఉదాహరణలతో వివరించుచు, మానవజీవితాభ్యున్నతికి, ఆదర్శజీవనమునకు సంస్కారముల ఆవశ్యకత ప్రదర్శింపబడినది.

బ్రహ్మచర్యము-బ్రహ్మచారివిధులు:— ఉపనయనసంస్కారవైశిష్ట్యము, అజినము, మేఖల మున్నగువాని ధరించుటలోని అంతరార్థము- వివాహసంస్కారవైశిష్ట్యము- విశేషించి "సప్తపది" ప్రాముఖ్యము- ఈగ్రంథమునందు సరళమైన భాషలో విమర్శింపబడినవి.

భారతీయధర్మములను తేటతెల్లముగ చూపు ఈ గ్రంథము నేటియువతరమునకు- బాలబాలికలకు అవశ్యపఠనీయము.

ధర్మప్రకరణమున బహుశాస్త్రములలోని ధర్మలక్షణముల నుదహరించి, ధర్మస్వరూపము, యాగాదికర్మాచరణము యొక్క ఆవశ్యకత నిరూపింపబడినవి. ఇంద్రియనిగ్రహము అత్యంతప్రధాన మని వివరించుచు, నిగ్రహములేనిచో కలుగు అనర్థములను భుజంగ, మాతంగ, పతంగ, భృంగ, మీనాదుల పోలికతో (పే. 31) రమ్యముగ చూపియున్నారు.

ఈగ్రంథమునందు సమాజమునకు అత్యంతోపకారకములగు కొన్నిఅపూర్వవిషయములను 'మూలసూత్రములు-తాత్పర్యములు' అను శీర్షికతో (పే.36) సేకరించియున్నారు. ఇట్లే సాంఘికప్రకరణమునందు గూడ 'సాంఘికనైతికాది సూత్రాలు' అను శీర్షికతో ఉదహరింపబడిన విషయములు మానవుని నిత్యజీవితాభ్యుదయమునకు మహోపకారము చేయగలవు.

భారతసంస్కృతికి మూలాధారమైన సంస్కృతభాష గొప్పతనాన్ని, అనేకఉదాహరణలతో, పాశ్చాత్యుల అభిప్రాయములతో 'సంస్కృతి-సంస్కృతము' అను ప్రకరణమునందు యుక్తియుక్తముగ తెలిపియున్నారు.

ఆధ్యాత్మికభావౌన్నత్యము, జ్యోతిషము-మంత్రవిద్య-యోగశాస్త్రము మున్నగు భారతీయవిద్యల గొప్పతనాన్ని



పరిచయం చేస్తూ, భోజనాదినిత్యక్రియలయందు గూడ ప్రాణాగ్నిహోత్రరూపమయిన యజ్ఞభావన కల్గి యుండవలెనని శాస్త్రీయముగ వివరించిరి.

ఈగ్రంథమునందు సందర్భోచితముగ ధర్మోపదేశముతో బాటు కాళిదాసాదిమహాకవుల ప్రౌఢప్రయోగవైఖరి, వ్యంగ్యవైభవాదినిరూపణాలతో వర్ణింపబడినది.

సంస్కారప్రకరణమునందు, సంస్కారములను అనేక లౌకికఉదాహరణలతో వివరించుచు, మానవజీవితాభ్యున్నతికి, ఆదర్శజీవనమునకు సంస్కారముల ఆవశ్యకత ప్రదర్శింపబడినది.

బ్రహ్మచర్యము-బ్రహ్మచారివిధులు:— ఉపనయనసంస్కారవైశిష్ట్యము, అజినము, మేఖల మున్నగువాని ధరించుటలోని అంతరార్థము- వివాహసంస్కారవైశిష్ట్యము- విశేషించి "సప్తపది" ప్రాముఖ్యము- ఈగ్రంథమునందు సరళమైన భాషలో విమర్శింపబడినవి.

భారతీయధర్మములను తేటతెల్లముగ చూపు ఈ గ్రంథము నేటియువతరమునకు- బాలబాలికలకు అవశ్యపఠనీయము.

పాశ్చాత్యవ్యామోహముతో మనజాతి ఔన్నత్యమును విస్మరించినవారికి కనువిప్పు కలిగించి, వారిని ధర్మానురక్తులుగా చేయుటకు ఈగ్రంథము తోడ్పడును. గ్రంథకర్తలు సర్వథా కృతకృత్యులు, అభినందనీయులు.

బహుశ్రుతులు, బహుగ్రంథకర్తలు నగు శ్రీ శాస్త్రి గారు ఇట్టి అమూల్యములగు గ్రంథములను ఇంకనూ రచియించి దేశసౌభాగ్యమును పెంచగలరని విశ్వసించుచూ దానికి వలయు శక్తిసంపద నీయవలసినదిగ సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
బుధజన విధేయుడు,
విశ్వనాథ గోపాలకృష్ణశాస్త్రి.



శ్రీగణేశ్వరాయ నమః
శ్రీ శ్రీనివాసాయ నమః

# హైందవధర్మామృతము.

## ధర్మ ప్రకరణము.

### పరమేశ్వరుని ఎనిమిదిస్వరూపాలు.

భావిభారతపౌరులైన బాలబాలికలారా!

అష్టైశ్వర్యసంపన్నుడైన పరమేశ్వరుడు 'అష్టమూర్తి' అనే సార్థకనామధేయం కలిగి ఉన్నాడు. ఆమహేశ్వరుడు తన యెనిమిదిస్వరూపాలతో ఈసర్వప్రపంచాన్ని వ్యాపించి ఉన్నాడు. అతడీచరాచరప్రపంచాన్ని ఎలా వ్యాపించి ఉన్నాడో ఇక సంగ్రహంగా తెలుసుకుందాం.

పరమేశ్వరుని మొదటి స్వరూపం ఉదకం. అది జీవుల నిత్యజీవితానికి జీవనాధారమై ఉంది. కనుకనే ఆజలానికి 'జీవనం' అనే మరోపేరు అమరనిఘంటువులో ఇలా ఉంది.

"పయః కీలాల మమృతం జీవనం భువనం వనం"

భూగోళం మొత్తంలో భూభాగంకంటే ఈజలభాగమే మూడురెట్లు అధికంగా ఉంది. ఇట్టి ఈజలం, బ్రహ్మయొక్క సృష్టిలో మొదటి సృష్టి ఐ ఉంది.

ఇక దేవుని రెండవస్వరూపం 'అగ్ని'. ఈ అగ్ని జీవుల శరీరంలో "జఠరాగ్ని" రూపంలో ఉండి, ఆజీవులు ఆరగించిన

ఆహారద్రవ్యాలన్నింటినీ నిత్యము అరిగిస్తూ ఉంటుంది. ఇట్లు జఠరాగ్నిచే జీర్ణమైన ఆహారద్రవ్యాలన్నీ మనశరీరంలో రక్తంగానూ, ఆరక్తమే క్రమంగా "సప్తధాతువులు" గానూ, ఆధాతువులే 'వీర్యం' గానూ మారి అవన్నీ మన శరీరంయొక్క పుష్టికీ, ఆరోగ్యానికీ మూలము లౌతున్నాయి. అసలు 'ధాతువు' అంటేనే 'మూలం' అని అర్థం.

## సప్తధాతువులు.

(1) జీర్ణరసం, (2) రక్తం, (3) మాంసం, (4) క్రొవ్వు, (5) ఎముకలు, (6) మజ్జ (ఎముకలయందున్న నేతివంటి పదార్థం), (7) శుక్రం (వీర్యం). ఈసప్తధాతువులనుగూర్చి "వాగ్భటుడు" అనే భారతీయఆయుర్వేదాచార్యుడు ఆయుర్వేదానికి చెందిన తనసంహితాగ్రంథంలో ఇలా చెప్పినాడు.

"ఓజ శ్చ తేజో ధాతూనాం శుక్రాంతానాం పరం స్మృతం ।
హృదయస్థ మపి వ్యాపి దేహస్థితినిబంధనమ్ ॥"
"యస్య ప్రవృద్ధౌ దేహస్య తుష్టిపుష్టిబలోదయాః ।
యన్నాశే నియతో నాశో యస్మింస్తిష్ఠతి జీవనమ్ ॥"
"నిష్పాద్యంతే యతో భావాః వివిధా దేహసంశ్రయాః ।
ఉత్సాహప్రతిభాధైర్యలావణ్యసుకుమారతాః ॥"
"రసాఽసృఙ్మాంసమేదోఽస్థిమజ్జాశుక్రాణి ధాతవః ।
ఏతే సప్త స్వయం స్థిత్వా దేహం దధతి యన్నృణామ్ ॥"

అనగా "మనశరీరంలో- ఓజస్సు లేక తేజస్సు అనబడే ఈశుక్రధాతు వుండుటచేతనే మననిత్యజీవితం ఆనందోత్సా



హాలతో సక్రమంగా సాగుతూంది. ఇది, సప్తధాతువులలో శ్రేష్ఠమైనదీ, ముఖ్యమయినదీ కూడాను. ఈధాతువు మానవుల హృదయభాగంలో ఉన్నా శరీరం అంతా వ్యాపించి జీవులు బ్రతికి ఉండుటకు మూలమౌతుంది. దీనివృద్ధిచేతనే మనశరీరాలకు తగినంత పుష్టి, తుష్టి, బలం, కాంతి, యవ్వనము, ఆనందం, ఉత్సాహం మొదలయిన ముఖ్యగుణాలు అబ్బుతున్నాయి. సర్వజీవుల ప్రాణధారణకు మూలమైన ఈ 'వీర్య' ధాతువు నశించినపుడే మనశరీరంకూడా నశిస్తుంది. ఈధాతువుయొక్క వృద్ధివలన మనమానసికభావాలుకూడా స్థిరసంకల్పంకల వౌతాయి. మనలోని బుద్ధి, ప్రతిభ, ధైర్యం, శరీరసౌందర్యం, సుకుమారత అనే ఇవన్నీకూడా ఈ 'వీర్య' ధాతువునే ఆశ్రయించుకొని ఉన్నాయి. కనుక ఈధాతుధారణమే మనశరీరధారణకు మూలమౌతుందని వాగ్భటుని మీది ఆయుర్వేదగ్రంథం తెలిపింది.

ఇది సప్తధాతువులనుగూర్చిన సారాంశం. ఈవిధంగా "బాలురభావిజీవితవికాసానికీ, వారిపూర్ణజీవితసిద్ధికీ కావలసిన సర్వవిధశక్తులు మనబాలురకు శాస్త్రోక్తమైన బ్రహ్మచర్యవ్రతనియమపాలనంవల్లనే లభిస్తున్నాయి" అనే ముఖ్యవిషయం మరవరానిది. ఈవ్రతనియమాలను పూర్తిగా పాటించడంచేతనే బ్రహ్మచారులయొక్క ఈసప్తధాతువులు క్రమపరిణతి చెంది, ఆపరిణతిచేతనే భావికాలంలో వారికి ఉత్తమసంతానం కలుగుతుంది. కనుకనే "బ్రహ్మ

చర్యాశ్రమము" అనేది బ్రాహ్మణక్షత్రియవైశ్య లనబడే మూడువర్ణములవారి పూర్ణజీవితసిద్ధికి మూలమై ఉన్నది. ఇదంతా జఠరాగ్నికి సంబంధించిన విశిష్టవిషయ వివరణమై ఉంది. ఈజఠరాగ్నియొక్క ప్రత్యేకతను ప్రకటిస్తూ శ్రీకృష్ణ పరమాత్మ, తను ప్రాణులశరీరములో, "వైశ్వానరాగ్ని" అనే పేరుతో ప్రవేశించి, జీవులు తిన్న ఆహారద్రవ్యాలను అహర్నిశలు అరిగిస్తూంటానని తనభగవద్గీతలో తెలిపినాడు.

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాఽపానసమాయుక్తం పచా మ్యన్నం చతుర్విధమ్ ॥"

(భగవద్గీత 15_14)

ఇక మహేశ్వరుని మూడవరూపం "భూమి". ఈభూమండలంమీదనే జీవులన్నీ పుట్టి పెరిగి ఈభూమిమీద పండిన ఆహారద్రవ్యాలతోనే అవన్నీ జీవించగలుగుతున్నాయి.

ఇక వాయువు, ఆకాశం అనేవికూడా దేవుని నాల్గవ, అయిదవ స్వరూపాలు. మనం మాటిమాటికీ గాలి పీల్చుకోనకుండాను, అవకాశప్రదేశంలో తిరగకుండాను ఒకరోజుకూడా ఉండలేం. కనుక ఈశ్వరుని ఈ రెండుస్వరూపాలూ కూడా సర్వప్రాణులకూ జీవనాధారాలై, అన్నివేళల్లోనూ అందరకూ అత్యవసరాలై ఉన్నాయి.

ఇక సూర్యచంద్రులు, దేవుని ఆరవ, ఏడవస్వరూపాలు. వీరిద్దరూ మనమనోబుద్ధులకు వలసినన్ని సంపూర్ణ వికాసాలను, శక్తులను కలుగచేస్తున్నారు. వీరి కాంతి, చెట్లుచేమలయొక్క, పశుపక్ష్యాదులయొక్క అనగా సర్వజీవులయొక్క- శరీరాభివృద్ధికి ఎంతో అవసరమౌతుంది. మనశరీరంలోని సూర్యచంద్రనాడులు, మనలో చురుకుదనాన్ని తెలివితేటలను వృద్ధి పొందిస్తాయి. ప్రకృతిశాస్త్రంలోని "ఆతపస్నానం" వంటి ప్రకృతిప్రక్రియలద్వారా సూర్యకాంతిని సేవించి తమరోగాలన్నింటినీ పోగొట్టుకున్నవా రెందరో ఉన్నారు. కనుక మానవులు తమకు ఏవిధమైన ఆరోగ్యం కావా లనుకున్నా సూర్యపరమాత్మనే ఆరాధించాలని-

"ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్ ..."

అనే స్మృతిసూక్తి చాటుతూంది. తైత్తిరీయోపనిషత్తులో ఉన్న "అరుణం" అనబడే మొదటి పన్నం, సూర్యపరమాత్మయొక్క ప్రత్యేకప్రభావాలనుగూర్చి ప్రకటిస్తూంది.

ఇక చంద్రుడు మనమనోబుద్ధుల నిర్మలత్వానికీ, మాతృభక్తికీ కారకుడై ఉన్నట్లు "ముహూర్తదర్పణ" గ్రంథంలో గ్రహముల కారకత్వనిఘంటువు తెలుపుతూంది. కనుక సూర్యచంద్రుల ఆరాధనకూడా అందరకూ ఆవశ్యకమౌతూంది.

ఇక పరమేశ్వరుని ఎనిమిదవస్వరూపం 'సోమయాజి'. అనగా యజ్ఞయాగాదులను శాస్త్రోక్తంగా చేయుటకు తగిన అర్హతలు కలవాడన్నమాట. ఇతడు వేదోక్తకర్మలు సకాలంలో చేయుటచేతనే భూలోకంలో సకాలవర్షాలు కురిసి సస్యసమృద్ధితో దేశం సుభిక్షంగా ఉంటుందనీ, కనుక ప్రజాభి

వృద్ధితో బాటు దేశాభివృద్ధికికూడా యజ్ఞాలే ఆధారాలనీ భగవద్గీత ఇలా స్పష్టంచేసింది.

"అన్నా ద్భవంతి భూతాని, పర్జన్యా దన్నసంభవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యః, యజ్ఞః కర్మసముద్భవః ॥"

(గీత- 3-14)

## యజ్ఞానికీ, వర్షపాతానికీ గల సంబంధము.

యజ్ఞాగ్నిలో హోమంచేసిన ఆజ్యపురోడాశాదులు హుతమై అవి పొగగా మారి అందుండి సూక్ష్మధూమకణాలు ఏర్పడుతాయి. వేసవిలో సూర్యకిరణములద్వారా ఆవిరి రూపంలో పైకి గొంపోబడిన సూక్ష్మజలకణాలతో ఈధూమ కణాలు కలిసి మేఘాలు ఏర్పడుతాయి. ప్రకృతిలో జరిగే ఈ పరిణామాన్నే భగవద్గీత - "యజ్ఞా ద్భవతి పర్జన్యః" యజ్ఞ (ధూమ)మునుండి మేఘం ఏర్పడునని సైన్సుకు అనుకూలముగానే చెప్పినది. ఇక అగ్నిలో వేల్చిన ఆహుతి క్రమంగా సూర్యమండలం చేరి అది ఆసూర్యునినుండి వర్షం కురిపిస్తుందనీ, ఆవర్షం సస్యప్రజాసమృద్ధులకు సాధనముగా ఉంటుందనీ మనుస్మృతి ఇలా చెప్పింది.

"అగ్నౌ ప్రాస్తాఽఽహుతి స్సమ్య, గాదిత్య ముపతిష్ఠతే ।
ఆదిత్యా జ్జాయతే వృష్టిః, వృష్టే రన్నం తతః ప్రజాః ॥"

(మనుస్మృతి 3-76)

శ్రీస్వామిప్రణవానంద "జ్ఞానదీపిక" అనే తమ, ఆంధ్రభాషామయగీతావ్యాఖ్యలో - మీది "యజ్ఞా ద్భవతి



పర్జన్యః...." అనే గీతావాక్యానికి వివరణ ఇలా వ్రాశారు. "... మేఘములు తయారగుటకు, అగ్నినుండి వెలువడు సూక్ష్మధూమకణములును, భూమిపైనుండి లేచిన ధూళి కణములును ఆధారములై ఉన్నవని భౌతికశాస్త్రజ్ఞులు నిర్ధారణచేసి యున్నారు. ప్రకృతియొక్క ఈనియమమును తెలిసికొనియే మనప్రాచీనార్యమహర్షులు, మేఘములకు ఆధారములైన ధూమకణములు శుద్ధమైనవిగాను, క్రిమిసంహారకమైనవిగాను, పుష్టికారకమైనవిగాను, రోగనాశకమైనవిగాను తయారగుటకు అగ్నికార్యమునందు విశేషనియమములను ఏర్పాటుచేసినారు. వానిప్రకారంగా ఆయాఋతువుల లోని భిన్నవాతావరణములకు అనుకూలములైన ఘృతాది పుష్టికారకములు, రోగనాశకములు, క్రిమిసంహారకములు ఐన ఓషధులను అగ్నికార్యమునందు హోమముచేయునట్లు వారు శాసించినారు." అందుచే, "యజ్ఞాగ్నివలన వర్షముకురియును" అనే మహర్షుల ఈమాట, చాదస్తపువాక్యముగాని, ప్రకృతిశాస్త్రవిరుద్ధవిషయముగాని కాక, వాస్తవమైనదిగనే యున్నది. ఇంతకూ చెప్పే దేమంటే, "సస్యసంవర్ధకాలైన సకాలవర్షాలకు, శాస్త్రీయయజ్ఞక్రియానిర్వహణమే శరణ్యమగుచున్నది." అని. నిత్యసత్యమైన ఈప్రకృతినియమాన్ని ఆధునికవైజ్ఞానికులుకూడా గ్రహించారు. కనుకనే వారు, సూక్ష్మాతిసూక్ష్మంగా తయారుచేసిన బొగ్గుకణాలను (ధూమకణాలకు బదులుగా) విమానాలపై ఆకాశంలోనికి తీసుకొని

పోయి, ఆవిరికణాలతో నిండి ఉన్న ఆకాశంలో అబొగ్గుకణాలను వెదజల్లి కావలసినచోట్ల వారు తాత్కాలికంగా కృత్రిమవర్షాన్ని కురిపిస్తున్నారు.

ఆధునికసైంటిస్టుల ఈప్రయోగప్రక్రియకు వేలాది సంవత్సరాలకు పూర్వమే మనమహర్షులు కనుగొన్న ఆప్రకృతి రహస్యవిజ్ఞానం మార్గదర్శకమైనట్లు ఈచర్చవలన స్పష్టమయింది.

మీాది 'చర్చావేదిక' మీాద తేలిన సారాంశమేమనగా- ఈశ్వరుని ఎనిమిదవస్వరూపమైన సోమయాజి శాస్త్రోక్త రీతిగా నిర్వహించిన తనయజ్ఞక్రియాచరణంతో సస్యాదుల అభివృద్ధికి చాలినంతగా సమృద్ధవర్షాలు కురిపించి దేశ సౌభాగ్యానికి సహకరిస్తూన్నట్లు తేలింది.

ఇక సమర్థుడై ఉండి కూడా యజ్ఞంచేయని సోమయాజి యొక్క అశ్రద్ధవల్లనే వానలు లేక దేశం కరువుకాటకాలకు గురియై, ప్రజలు ఆకలిబాధలలో చిక్కుకుంటారనికూడా ఒక యజుర్వేదమంత్రం ఇలా చాటిచెప్పింది.

"....యజ్ఞపతి మృషయ ఏనసాఽహాః; ప్రజా నిర్భక్తా అనుతప్య మానా మధవ్యౌ స్తోకా వపతౌ రరాధ...."

(కృష్ణయజుర్వేదమంత్రసంహిత 3-2)

అనగా మహర్షులు ఒకప్పుడు సమావేశమై- "దేశంలోని కరువుకాటకాలకు మూలకారణమేది" అని చర్చించి, సమర్థుడైన సోమయాజి, చైత్రవైశాఖాలలో చేయతగిన యాగాలను చేయక, తద్ద్వారా అతడు దేవతలవిషయంలో చేసిన అపరాధమే దేశంలోని కరువుకాటకాలకు కారణమని ఆచర్చలో తేల్చినారు.



## ప్రపంచంఅంతా పరమేశ్వరస్వరూపమే.

ఇట్లు ఉదకం మొదలుకొని సోమయాజివరకూగల ఎనిమిదిస్వరూపాలతో మహేశ్వరుడు ఈచరాచరప్రపంచం అంతా వ్యాపించి ప్రపంచస్వరూపం దాల్చి ఉన్నాడని శ్రుతి స్మృతిప్రమాణాలతో శాస్త్రీయంగా ఋజువయింది. కనుక ఈ ప్రపంచంఅంతా పరమేశ్వరుని ఎనిమిది స్వరూపాల స్వరూపమే అని నమ్మి ప్రపంచంఅంతటిలో పరమేశ్వరుని (శివుని) చూడ గల్గినవారిని ఆ "ఆదిదేవుడు" B అనుగ్రహిస్తాడని తేలింది. ఈవిశిష్టవిషయాలనే కాళిదాసమహాకవి, తన "మాళవికాగ్ని మిత్ర" నాటకనాందిలో చిత్రించినాడు.

## మహేశ్వరుని శివతత్త్వము.

శ్రీ సురేశ్వరాచార్యులవారు శివతత్త్వాన్ని గూర్చి తనవార్తికగ్రంథంలో చెప్పిన వాక్యాల భావ మిది.

"...జీవులతాలూకు పరిపక్వంచెందని కర్మలు, అవి పరిపక్వదశలోనికి వచ్చేవరకు ఆజీవులు, తమపూర్వజన్మలలో నేర్చిన- దురభ్యాసమూలకదుష్కర్మల వాసనలతో కూడు

---

B "ఆదిదేవో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః"

(అమరనిఘంటువు)

కొని 'మాయ'లో పడి ఉండును. అట్టి 'మాయ' తో కూడిన బ్రహ్మస్వరూపం, కెరటాలులేని మహాసముద్రంవలె నిశ్చలగంభీరముగా ఉండును. ఏవిధమైన వికారములు లేని ఇట్టి 'బ్రహ్మ' స్వరూపమే- "శివుడు" లేక "శివతత్త్వము" అనబడును.

ఈభావముకల శ్రీసురేశ్వరాచార్యులవారి మూల వాక్యాలివి —

"…. అపరిపక్వవాసనారూపకర్మాశ్రయమాయావచ్ఛిన్నం బ్రహ్మ యావత్పరిపాకం నిశ్చలసముద్రతరంగవ త్తిష్ఠతి। తచ్ఛివః"

మొట్టమొదట ఒకే ఒకరూపంలో ఉన్న ఇట్టి "శివతత్త్వము" తిరిగి సృష్టి ప్రారంభానికి సౌకర్యంగా ఉండుటకై "ఆదిదంపతులు"గా రెండురూపాలు పొందును. ఈదంపతులనే పార్వతీపరమేశ్వరులుగా కాళిదాసకవి తన 'రఘువంశ మహాకావ్యం'లో వర్ణించినాడు. వీరే ప్రకృతిపురుషులు. వీరి సమ్మేళనమే ప్రపంచసృష్టికి మూలమౌతుంది. కనుకనే, ఈ దంపతులు ప్రపంచంమొత్తానికే జననీజనకు లైనారు.

"జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ"

అని కాళిదాససూక్తి. "కవికులగురువు" అని ప్రపంచప్రశస్తిపొందిన కాళిదాసకవీంద్రుని కమనీయకవితావైభవంలోని గురుత్వమహత్వపటుత్వప్రాభవమును గూర్చి "కాళిదాసహృదయము" అనే నావిమర్శగ్రంథంలో వివరంగా విశదీకృతమయింది. ఈ నాతొలికృతి 1966 జూన్‌లో రాజమండ్రిలోని భారతీప్రెస్‌లో నాచే ప్రకాశితమైనది. (ప్రస్తుతము ఈగ్రంథం ఔట్ ఆఫ్ ప్రింట్)



## ధర్మప్రకరణము.

ధర్మశబ్దవ్యుత్పత్త్యర్థం —

"ధృఞ్ ధారణే" అనే ధాతువునుంచి ధర్మశబ్దం పుట్టింది. ధారణం అంటే మోయడం అని అర్థం. ఈఅర్థాన్నే ఇంకో రెండు వ్యుత్పత్త్యర్థాలు ఇలా ఋజువుచేస్తున్నాయి.

"ధరతీతి ధర్మః" "డుధాఞ్ ధారణపోషణయోః" ఇట్లు "ధారణపాలన" లక్షణాలు కలిగి, అటు అశేషభూమండలం యొక్క నిలుకడకు, ఇటు సర్వజీవరాసులయొక్క మనుగడకు మూలాధారమైనదే "ధర్మము" అనిపించుకొంటుంది. ఈ అర్థాలనే తైత్తిరీయోపనిషత్సూక్తి —

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"

అని సిద్ధాంతం చేసింది. అనగా, సమస్తప్రపంచం యొక్క నిలుకడకు 'ధర్మమే' మూలాధారముగా ఉంది. ఈ సువిశాలభూమండలం అంతా నిరాధారప్రదేశంలో తిరుగుతూందికదా ! కనుక క్రిందకు పడిపోకుండగా ఈప్రపంచానికంతటికీ 'ధర్మ' మనేదే ఆధారస్తంభంగా అమరి ఉందన్నమాట క్రింది మహాభారతసూక్తి కూడా ఈ అర్థాలనే అనువదిస్తూంది-

"ధారణా ద్ధర్మ ఇత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః ।
యత్స్యాత్ ధారణసంయుక్తః స ధర్మ ఇతి నిశ్చితః ॥"

'ధారణం' అనగా ప్రపంచాన్ని మోయడం అనే ముఖ్యలక్షణాన్ని బట్టే 'ధర్మ' శబ్దానికి ధర్మమనే పేరు సార్థకమయింది. కనుక ఈభూమండలంమీద ప్రజలందరినీ (సర్వజీవకోటినీ) మోస్తూన్న కారణంగా 'ధర్మము' అనే పేరు దీనికి సార్థకమయింది. సారాంశంగా ధర్మమనేది, సమస్తజీవకోటికి జీవనాధారమై ఉందని తేలింది.

ఇట్టి స్వధర్మాన్ని కాపాడినవారిని తిరిగి ఆ 'ధర్మం' కాపాడుతుందనీ, తమధర్మాన్ని పాడుచేసుకున్నవారిని తిరిగి అది నశింపజేస్తుందనీ, కనుక తనజీవితశ్రేయస్సు కోరుకొనే ఏఒక్కడూ తనధర్మాన్ని ఉపేక్షచేయక దాన్ని కాపాడుకొనుటకే దీక్షవహించవలసిఉందనీ ఒకమహాభారతసూక్తి ఇలా సుస్పష్టంచేసింది.

"ధర్మ ఏవ హతో హంతి, ధర్మో రక్షతి రక్షితః ।
తస్మా ద్ధర్మం న త్యజామి, మానో ధర్మో హతోఽవధీత్ ॥"

## కొన్ని ధర్మశబ్దనిర్వచనాలు.

జైమినిమహర్షికృతమైన 'పూర్వమీమాంసాశాస్త్రం' లోని మొదటి 'ధర్మ' నిర్వచనం "చోదనా లక్షణోఽర్థో ధర్మః" అనగా- వేదశాస్త్రాలలో ఆయాజాతులవారికి ముఖ్యకర్తవ్యక్రియలుగా చెప్పబడినవీ, ఈచెప్పబడిన పనులను ఆసక్తితో ఆచరించిన మానవాళికి సర్వవిధశ్రేయస్సులను సమకూర్చేవీ ఐన కర్మలసముదాయమునకే 'ధర్మము' అనేపేరు చెల్లుతుంది. అని జైమిని సూత్రంలోని భావం.



ఇక కణాదమహర్షి తనవైశేషికధర్మశాస్త్రగ్రంథంలో చెప్పిన ధర్మశబ్దనిర్వచనం ఇది-

"యతోఽభ్యుదయనిశ్రేయససిద్ధిః స ధర్మః"

అనగా- మానవులకు, పశుపక్ష్యాదిసర్వజీవులకు కూడా వారి ఇహపరలోకాలలో వారికి కావలసిన సర్వవిధసౌఖ్యాలను, శ్రేయస్సులను సిద్ధింపజేయగల్గిన శాస్త్రీయక్రియాసముదాయానికే- 'ధర్మము' అని పేరు.

ఈవిధంగా సర్వమానవజాతియొక్క జీవితసుఖశాంతులకు వారివారిస్వధర్మాచరణమే మూలమై ఉన్నట్లు ఇతరస్మృతివాక్యాలుకూడా తెలిపినవి. కనుక, ఇన్నివిధాలుగా అందరకు అఖిలాఽభ్యుదయసంధాయకమైన తమధర్మసంరక్షణకోసమని, అవసరమైతే మానవులు తమ అసువులనైనా అనుమానించక అర్పించవచ్చునుగాని తమధర్మాన్ని మాత్రం ఎట్టి క్లిష్టపరిస్థితిలోనూ వారు విడువరాదని భగవద్గీత, మానవలోకాన్ని ఇలా ప్రబోధించింది.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥"

(గీత-3-35)

అంటే- ఆకర్షణీయంగా ఉన్న పరధర్మాన్ని ఆసక్తితో ఆచరించడంకంటే ఆకర్షణీయంగా లేకున్నా తమ ధర్మాన్నే శ్రద్ధగా ఆచరించడం అనేది అందరకు అభ్యుదయ

ప్రదమే ఔతుంది. తమధర్మరక్షణకోసమై అవసరమైతే మానవులు తమప్రాణాలు అర్పించడంకూడా వారికి శ్రేయస్కరమే ఔతుంది.

ఉదాహరణగా — శ్రీరామచంద్రుడు తనరాజ్యధర్మరక్షణకోసమై ప్రాణాధికమైన తనసీతాదేవినీ, సామ్రాజ్యలక్ష్మినీకూడా విడిచినకారణంచేతనే ఆరాజచంద్రుడు —

'రామో విగ్రహవాన్ ధర్మః'

అనే ప్రపంచప్రశస్తికి ఉత్తమపాత్రుడైనాడుకదా! ఇట్లు స్వధర్మరక్షణకోసం ఇంతటిమహాత్యాగం చేసిన మహాపురుషోత్తముడు మరెక్కడా లేడు.

## రోజూ ధర్మాన్ని కూడబెట్టే విధానం.

"లోకంలో తేనెటీగలు ప్రతీరోజూ పువ్వులమీద వ్రాలి ఆపువ్వులు నలగనివిధంగా నేర్పుగా అందలి మకరందాన్ని కొద్దికొద్దిగా తీసికొనివచ్చి ఒకచోట పెట్టి క్రమంగా పెద్దతేనెపట్టును తయారుచేస్తాయి. అదేవిధంగా ధార్మికుడైనవాడు, ఎవరికీ ఏనష్టం కలగనివిధంగా ప్రతిరోజూ స్వధర్మాన్ని కొద్దికొద్దిగా కూడబెట్టి క్రమంగా పెంచి, ఆధర్మరాశి తనకు ఇహపరలోకాలలో ఉపకరించేటంతగా దానిని వృద్ధిచేయాలి. ఈవిశిష్టభావంకల ధార్మికసూక్తి ఇది.

"ధర్మం శనైస్సంచినుయాత్ వల్మీక మివ పుత్తికాః ।
పరలోకసహాయార్థం సర్వభూతా న్యపీడయన్ ॥"



## శాస్త్రాలలోని ధర్మనిర్వహణావశ్యకత.

ఇక ప్రతిఒకమానవుడు తమతమధర్మాలను తప్పనిసరిగా ఎందుకు ఆచరించాలో, వాని ఆవశ్యకతను గూర్చి ఆయాశాస్త్రా లేమంటున్నాయో, వాని సంగ్రహ భావాన్ని గూర్చి ఇక తెలుసుకొందాం.

"శుక్రనీతిసారం" అనే నీతిశాస్త్రం స్వధర్మాచరణాన్నిగూర్చి ఇలా అంటూంది.

"సుఖం చ న, వినా ధర్మాత్, తస్మా ద్ధర్మపరో భవేత్"

అనగా, స్వధర్మాన్ని ఆచరించని మానవుల జీవితాలకు ఏవిధంగాను శాంతిసౌఖ్యాలు లభించవుకనుక, తనశాంతిసౌఖ్యాలకోసమైనా ప్రతీవాడూ తనధర్మాలను ఆసక్తితో ఆచరించవలసిఉంది. ఇక ఈవిషయంలో చాణక్యుని అర్థశాస్త్రం ఇలా అంటూంది -

'వేదత్రయగతధర్మః చతుర్ణాం వర్ణానాం ఆశ్రమాణాం చ ధర్మస్థాపనాదౌపకారికః ॥'

అనగా, "ఋగ్యజుస్సామవేదాలలో నాల్గువర్ణముల వారికి వేర్వేరుగా చెప్పబడిన ధర్మసముదాయం, ఆనాల్గు జాతులవారినీ వారివారి ధర్మాలలో ప్రవేశపెట్టడంద్వారా ఆధర్మసముదాయం వారందరికీ అభ్యుదయప్రదమే ఔతుంది. ఇట్లే- బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్యాసులు అనే నాలుగు ఆశ్రమాలవారినీ కూడా వారి ఆశ్రమధర్మాలు వారిని తమతమధర్మాలలో ప్రవేశపెట్టి వారికి అవి శ్రేయ

స్కారాలు, అభ్యుదయప్రదాలు ఔతున్నాయి. ఇట్లు ధర్మాలన్నీ ప్రపంచంలోని అన్నిసంఘాలవారికీ అన్నివిధాలా సహకరించి ఉపకరిస్తూనే ఉన్నాయి" అంటూంది అర్థశాస్త్రం. ఇక ఇదే విషయంలో మహాభారతసంహిత ఏమంటుందో విందాం.

"ధర్మా ద్రాజ్యం ధనం సౌఖ్యం, అధర్మా ద్దుఃఖసంభవః ।
తస్మా ద్ధర్మం సుఖార్థాయ, కుర్యాత్ పాపం చ వర్జయేత్ ॥"

స్వధర్మాచరణంవలన మానవులకు రాజ్యసుఖం, ధనసుఖంవంటి సర్వవిధసౌఖ్యాలు అబ్బుతున్నాయి. ఇక అధర్మాచరణంవలన కలిగేది ఒక్క దుఃఖం మాత్రమే. కనుక "ఓ సోదరులారా! మీదృష్టిని అధర్మంవైపు మరల్చక, మీసుఖశాంతులకోసమైనా మీదృష్టిని మీమీధర్మాలవైపుకే మరల్చండి." అని వ్యాసర్షి యొక్క విశ్వసందేశం.

ఇక "మానవధర్మశాస్త్రం" అనబడే మనుస్మృతి ఇలా అంటూంది -

"నాఽధర్మ శ్చరితో లోకే, సద్యః ఫలతి గౌ రివ ।
శనై రావర్త మాన స్తు, కర్తు ర్మూలాని కృంతతి ॥"

లోకంలో, పాలిచ్చే ఆవు తౌడు పెట్టినరోజునే మరికొన్ని యెక్కువపాలిస్తుంది. అంటే తౌడు తిన్న ఫలాన్ని ఆరోజే ఆవు కనబరచినట్లు, పాపాత్ములకు వారి పాపకర్మాచరణఫలం వెంటనే కనిపించదు. కాని వారిపాపాలకు పరిణామసమయం సమీపించినపుడు మాత్రం వారిని ఆపాపపరిణామ



ఫలం కట్టి కుడుపుతుంది. ఇది, లోకంలో జరుగుతూన్నదే. కాని సామాన్యులదృష్టిలో, పుణ్యాత్మునికి తరచుగాకష్టనష్టాలే ఎదురౌతున్నట్లును, పాపాత్మునికి సుఖాలే కలుగుతూన్నట్లును పైకి కనిపిస్తుంది. అటువంటప్పుడు పుణ్యాత్ముడు తాను కష్టాలు అనుభవిస్తూన్నట్లు భ్రాంతిచెంది తనధర్మంయెడల విరక్తి చెందడం అనేది, నిజంగా వాని కష్టానుభవానికే కారణమౌతుంది. పరమార్థంలో- పాపాత్ములపాపపరిణామం వారికి మర్మచ్ఛేదంగా మారడం మనం చూస్తున్నాంకదా. తనధర్మం యెడల విరక్తి చెందినవారిగతే ఇట్టిది. కనుక వివేకంకలవాడు యెట్టి పరిస్థితిలోనూ స్వధర్మాచరణవిషయంలో విముఖత చూపరాదని ఫలితాంశం. ఈవిశిష్టవిషయాన్నే వ్యాసర్షి యొక్క 'భారతసావిత్రి' భంగ్యంతరంగా ఇలా విశదం చేసింది -

"న జాతు కామా న్న భయా న్న లోభాత్
ధర్మం త్యజే జ్జీవితస్యాపి హేతోః ।
నిత్యో ధర్మః, సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతు రస్య త్వనిత్యః ॥"

లోకంలో సామాన్యమానవుడు తనజీవితంలో విషమకరసన్నివేశాలు సమీపించినపుడు తాను భయ, లోభ, కామాదులకు లోనై చిత్తస్థైర్యాన్ని విడిచి స్వధర్మత్యాగం చేస్తూంటాడు. కాని, అట్టి విషమకరసమయాలలో కూడా ఏఒక్కడూ తనధర్మాన్ని విడువకూడదు. ఎందు

కనగా- 'ధర్మం' అనేది నిత్యమైనది. తాత్కాలికంగా వచ్చే సుఖదుఃఖాలు అనిత్యమైనవి. అనిత్యమైనదానికోసం నిత్యమైనదానిని విడిచెయ్యడం అవివేకమే అనిపించుకొంటుంది కదా! ఇంతేకాకుండా ధర్మాచరణకు ఫలం స్వర్గసౌఖ్యమనీ, పాపాచరణకు ఫలం నరకప్రాప్తి అనీ మరో స్మృతి నొక్కి -

'ధర్మస్య చ ఫలం స్వర్గః, నరక స్తద్విపర్యయః'

అని చాటుతూంది. కనుక ఎన్నివిధాలుగా విమర్శించి చూచినా, ఏఒక్కడూ ఏపరిస్థితిలోనుకూడా తనధర్మాన్ని విడువకూడదనీ, పరధర్మాన్ని కాని, అధర్మాన్ని కాని చేపట్ట రాదనీ స్మృతిప్రమాణాలద్వారా తేలిన సారాంశం.

## స్వధర్మాలను విడిచిపెడితే.

స్వధర్మాలను విడనాడిన పాలకులవలన దేశంలో కలిగే దుష్ఫలితాలనుగూర్చి "ఆత్రేయసంహిత"లోని కొన్ని వాక్యాలు ఇలా చాటుతున్నాయి.

“....త మువాచ భగవా నాత్రేయః, మనుష్యాణాం యే అన్యే భావాః వాయ్వాదయః తేషాం వైగుణ్యాత్ సమానకాలాః సమాన లింగాశ్చ వ్యాధయః వినిర్వర్తితా భవంతి । జనపదనగరాదీనాం విధ్వంసయంతి, యదా దేశనగరజనపదప్రధానాః ధర్మ ముల్లంఘ్య అధర్మేణ ప్రజాం వర్తయంతి .... ।

తానుపాశ్రితాః పౌరజానపదాః వ్యవహారోపజీవినశ్చ త, మధర్మ మభివర్ధయంతి ।



తేన ఆపః దేవః న వర్షతి, యది వర్షతి వికృతం వా వర్షతి, వాతాః న సంయగభివాంతి, క్షితిః వ్యాపద్యతే సలిలా న్యుపశోష యతి.... ।” (ఆత్రేయసంహిత)

అనగా “దేశనాయకులు, నగరగ్రామనాయకులు అనే వీరు తమతమధర్మాలను అతిక్రమించి తమవర్గంవారినీ, పాలితులనుకూడా ఎప్పుడైతే అధర్మంవైపుకి మరలిస్తారో, ప్రభుత్వవర్గంవారుకూడా ఎప్పుడైతే అధర్మాన్ని పెంచుతారో అటువంటప్పుడు ప్రకృతిలోని వాయుజలకాంత్యాదులలో, విషమయమైన- ప్రాణాపాయకరమైన- మార్పు ఏర్పడి ఆమార్పు వాయుజలాదులంతటా వ్యాపిస్తుంది. అట్టి మార్పువలన సమానకాలంలో సమానలక్షణం కల 'కలరా' వంటి వ్యాధులు క్రమంగా నగరగ్రామాలలో వ్యాపించి అవి నగరగ్రామాలను తుడుపెడుతాయి. అనగా- వాయువులో పుట్టిన వైగుణ్యంవలన ఉప్పుగాలివంటి ఏవిషవాయువో వీచి అది సస్యాలు మాడిపోడంవంటి ఉపద్రవానికి కారణ మౌతుంది. ఇట్లే, ఇక నీటిలో పుట్టిన వైగుణ్యంవలన, ఆనీటిని త్రాగినవారందరికీ సమానలక్షణం కల (ఒకేరకమైన) వ్యాధి సోకి ఆవ్యాధి ప్రజానాశనంకి దారితీస్తుంది. వర్షాలు కూడా సకాలంలో వర్షించవు. ఒకవేళ వర్షిస్తే ఆవర్షంవలన సస్యాలు, వృక్షాలు తెగుళ్ళతో క్షీణిస్తాయి” అని మీది ఆత్రేయసంహితావాక్యాలలోని భావం.

నేడు తరచుగా దేశంలో తల ఎత్తుతూన్న ఇట్టి ఈ దారుణదుస్సహదుర్భరదుస్సంఘటనలు, మీదచెప్పిన ఆత్రేయ సంహితావాక్యాలకు 'ప్రత్యక్షనిదర్శనాలుగా' ఉన్నాయి.

## యజ్ఞక్రియానిర్వహణంవలన ఏర్పడే లోకక్షేమం.

శాస్త్రీయవిధానంలో నిర్వహింపబడిన యజ్ఞయాగాది వైదికక్రియల నిర్వహణం, లోకక్షేమశాంతిసౌఖ్యసౌభాగ్యాలకు సాధన మౌతున్న విధానమునుగూర్చి, కాళిదాసమహాకవి తన "రఘువంశమహాకావ్యం"లో ఇలా వర్ణించినాడు.

"దుదోహ గాం స యజ్ఞాయ, సస్యాయ మఘవా దివం ।
సంపద్వినిమయే నోభౌ, దధతు ర్భువనద్వయమ్ ॥"

(రఘువంశం- 1-26)

అనగా "దిలీపచక్రవర్తి, ప్రజలశ్రేయఃప్రాప్తికొరకు గాను పన్నులరూపంలో వసూలుచేసిన భూలోకసంపదను, ప్రజాశ్రేయస్సంపాదకాలైన యజ్ఞయాగాదుల నిర్వహణం కోసమై వినియోగించి, దేవతలకు సంతృప్తిని కలిగిస్తున్నాడట. యజ్ఞాగ్నిలో వేల్చిన ద్రవ్యాలు దేవతలకు ఆహారమౌతా యని వారికి మరోపేరైన 'క్రతుభుజులు' అనే పదం చాటుతూంది. అనగా క్రతువులలో హోమంచేసే హవిరాజ్యపురోడాదిద్రవ్యాలను అగ్నిదేవుడు దేవతలకు ఆహారంగా అందిస్తాడుగాన, దేవతలు క్రతువులసమయంలో భుజించేవారు అనే అర్థంలో 'క్రతుభుజులు' అనేపేరు వచ్చింది. అలా సంతృప్తులైన దేవతలు భూలోకవాసులయెడ కృతజ్ఞతతో ప్రతిఫలంగా భూలోకంలోని సస్యాదుల అభివృద్ధికి ఆద్యసాధనాలైన సకాలవర్షాలు కురిపిస్తున్నారట. ఈవిధంగా దిలీపచక్రవర్తి, భూలోకసంపదను స్వర్లోకవాసుల సౌఖ్యం కోసమూ, స్వర్లోకవాసుల ప్రతినిధియైన దేవేంద్రుడు తమ



స్వర్లోకసంపదను (వర్షసంపదను) భూలోకవాసులసౌఖ్యం కోసమూ వినియోగించుకొని, ఇట్లు ఆచక్రవర్తు లిద్దరూ తమ రెండులోకాలను కాపాడుకొంటున్నారట". ఈకాళిదాసీయ శ్లోకంలో- "భూలోకసౌభాగ్యసంపదభివృద్ధికి అపేక్షితమైన సత్కర్మసంపద అంతా భద్రపరుపబడింది. ఇంకా ఇచ్చట "యజ్ఞనిర్వహణరూపమైన ధర్మాచరణంవలన స్వర్భూలోకవాసులకు వారి జీవితసౌభాగ్యం అంతా సంప్రాప్తమౌతుంది". ఈపరమార్థాన్ని రుజువుపరచే ఇంకో వేదమంత్ర మిది-

"యద్వై యజ్ఞస్య సామ్నా క్రియతే రాష్ట్రం, యజ్ఞస్యాశీ
ర్గచ్ఛతి, యదృచా విశం యజ్ఞస్యాశీ ర్గచ్ఛతి... "

(కృష్ణయజుర్వేదసంహిత 1-6-10)

అనగా— "యజ్ఞతంత్రంలోని ఒకస్థలంలో, సామవేద మంత్రాలు పఠించవలసినవిధి ఉంది. ఆసామవేదమంత్రపఠన వినియోగంవలన పుట్టిన ఫలవిశేషం, ఆరాష్ట్రంలో ఉన్న మొత్తం ప్రజలయొక్క అన్నాభివృద్ధికి సాధనమౌతుంది. ఇట్లే యజ్ఞంలో ఇంకోస్థలములో ఋగ్వేదమంత్రాలపఠనవినియోగం ఉంది. ఆఋగ్వేదమంత్రపఠనవినియోగజన్యఫల విశేషం, ఆరాష్ట్రంలోని ప్రజలందరియొక్క ఆయుర్దాయాఽభివృద్ధికి ఆదికారణమౌతుంది" ఇది, మీదిమంత్రభావం. "దేశీయుల జీవితసౌభాగ్యం అంతా, వారి ఆయురన్నాఽభివృద్ధులమీదనే ఆధారపడి ఉంది-" అనేది నగ్నసత్యం. మరి మనం ఇక్కడ గ్రహించవలసిన విశిష్టవిషయమిది-

'యజ్ఞం' అనేది రాష్ట్రంలో ఒక్కచోట నిర్వహించబడినా దాని ఫలవిశేషాలు ఆరాష్ట్రంమొత్తంలో ఉన్న ప్రజలందరికీ చెందుతాయి. ఈసందర్భంలో మరో విశిష్టసందర్భం వినదగి ఉంది. నిజం చెప్పాలంటే- మొత్తం పద్నాలుగు లోకాలల్లో, భూలోకం ఒక్కదానికే, యజ్ఞనిర్వహణం వంటి సత్కర్మాచరణానికి అధికారం ఉంది. కారణ మేమనగా భూలోకానికిమాత్రమే "కర్మభూమి" అనే ప్రత్యేకప్రశస్తి ఉందిగాన, మిగతా పదమూడులోకాలు, మనయజ్ఞాచరణ ద్వారా పుట్టిన పుణ్యఫలాలను అనుభవించేవిమాత్రమే. ఇట్లు- భూలోకంలో ఆచరించిన యజ్ఞాదిధార్మికక్రియాచరణ జాతఫలం, పద్నాలుగులోకాలలోనివారి సుఖసౌభాగ్యాదులకు చక్కని సాధనమౌతుందనీ, మిగిలిన పదమూడులోకాలలోనివారికి వేదోక్తధర్మకర్మలను ఆచరించే అధికారం లేదనీ "బ్రహ్మవిద్యాఽలంకార" బ్రహ్మశ్రీ ముదిగొండ వెంకటరామశాస్త్రిమహోదయులు- "ధార్మికభారతీయసామ్రాజ్యమే నిఖిలప్రపంచప్రశాంతిప్రదము" అనే తమగ్రంథరాజంలో తెలిపినారు (పేజీ 8). కనుక, చతుర్దశభువనాలలో ఒక్కభూలోకమే సర్వశ్రేష్ఠమైనదని సారాంశం. ఈ అంశాన్ని వేదమాతకూడా అనువదించినట్లు సమస్తభూమండలంలో "ఆర్యావర్తదేశం" పవిత్రయజ్ఞవేదికవంటిదనీ, యజ్ఞం అనేది సమస్తభువనాలకు నడిబొడ్డువంటిదనీ ఇలా వర్ణించింది.



"—వేది మాహుః పరమం తం పృథివ్యాః, యజ్ఞ మాహు ర్భువనస్య నాభిం—"

"నయ్యతే బధ్యతే అనేన ఇతి నాభిః" అని వ్యుత్పత్త్యర్థం. అంటే బండిచక్రంతాలూకు కుంచం ఆచక్రం ఆకులను పట్టుకొని నిలిపినట్లు, యజ్ఞనిర్వహణకు యోగ్యమైన "ఆర్యావర్తదేశం" (భరతఖండం) ఇతరభువనాలన్నింటికీ నాభిస్థానీయంగా ఆధారమై ఉందని మీది మంత్రభావం.

నల్లచారలుకల ఇట్టి స్వభావసిద్ధంగా సంచరించిన ప్రదేశం అంతా పవిత్రయజ్ఞక్రియానిర్వహణకు యోగ్యమైన ప్రదేశమనీ, అటుతర్వాతది మ్లేచ్ఛదేశమనీ మనుస్మృతి ఇలా చెప్పింది.

"కృష్ణసారస్తు చరతి మృగో యత్ర స్వభావతః ।
స జ్ఞేయో యాజ్ఞికో దేశో మ్లేచ్ఛదేశ స్త్వతః పరః ॥"
(అధ్యా- 2-23)

ఇట్లు స్వర్లోకలోకాంతరాలకు సౌభాగ్యసంజనకాలైన యజ్ఞాలు నిర్వహించనినాడు దేవతలకు ఆహారం లేకుండా చేసిన అపరాధమే ఔతుందది.

ఈ అపరాధానికి కినిసి దేవతలు దానికి ప్రాయశ్చిత్తంగా భూలోకసౌభాగ్యానికి సమధికసాధనాలైన సకాలవర్షాలను కురిపించరు. ఒకవేళ కురిపిస్తే సస్యాదులకు హాని చేసేట్లు కురిపిస్తారు. విషకరవాయువులవంటి ఉపద్రవాలు చెలరేగుతాయి. ఇట్టి ఉపద్రవాల ఉత్పత్తికి రెండేరెండు కారణా లున్నాయి. దానిలో మొదటిది, సర్వసమర్థులైన

సోమయాజిగణం యజ్ఞాదివైదికకర్మలు సకాలంలో ఆచరించక పోవడం; రెండవకారణం, దేశనాయకుల అధర్మప్రవర్తనం. ఈరెండూ సరిదిద్దబడిననాడు దేశం సర్వవిధాలా సుభిక్షంగా ఉంటుందనే సంగతి, పాఠకులకు, పాలితులకు పునఃపునః స్మరణీయమై ఉంది.

## ధర్మాఽధర్మనిర్ణయము.

ఒకడు ఒకపనిని తప్పకుండా చేయవలసి ఉన్నప్పుడు "ఆపని చేయడం నీవిధి" అంటాం. అంటే ఆపనిని అతడు తప్పనిసరిగా చేయవలసి ఉందన్నమాట. ఇట్లే- వేదంలోగల "సత్యం వద, ధర్మం చర" వంటి వాక్యాలను 'విధివాక్యాలు' అంటారు. ఆవాక్యార్థాలుకూడా మానవుల దైనందినజీవితంలో తప్పక ఆచరణీయాలైన వన్నమాట. ఇట్టి విధివాక్యాలచేత వేదశాస్త్రాలలో విధింపబడిన క్రియలన్నీ 'ధర్మక్రియలు' అని మహాత్ములచే నిర్ణయింపబడ్డాయి. ఇక-

"సత్యా న్న ప్రమదితవ్యం, ధర్మా న్న ప్రమదితవ్యం...."

వంటి నిషేధవాక్యాలద్వారా వేదశాస్త్రాల్లో నిషేధింపబడిన పనులు, అనగా క్రియలు "అధర్మక్రియలు" అని నిర్ణయింపబడ్డాయి. ఇట్లే శ్రద్ధగా దానం చెయ్యాలి. "(శ్రద్ధయా దేయం") అనే వాక్యం వేదంలో విధివాక్యంకనుక, అట్టివిధివాక్యంచేత విధింపబడిన, "శ్రద్ధగా దానం చెయ్యవలెను" అనేపని ధర్మక్రియగా నిర్ణయింపబడింది. ఇక, "అశ్రద్ధగా దానం చేయరాదు" ("అశ్రద్ధయా అదేయం") అనే వేద



వాక్యం నిషేధవాక్యంకనుక, ఆనిషేధవాక్యంచేత నిషేధింపబడిన అశ్రద్ధామూలకదానం అనే పనికూడా 'అధర్మక్రియ'గా నిశ్చితమయింది. ఈధర్మాఽధర్మవివేకాన్ని విశదీకరించే సిద్ధాంతశ్లోక మిది.

'విధేయేభ్యో విధేయానాం, ధర్మత్వేన చ నిర్ణయః ।
నిషేధేభ్యో నిషేధ్యానా, మధర్మత్వేన నిర్ణయః ॥'

ఇట్లు "ధర్మక్రియలు" చేసినవారికి ధనసౌఖ్యాదులు, అధర్మక్రియ లాచరించినవారికి కేవలదుఃఖాలు కలుగుతూ న్నట్లు శాస్త్రాలు, మన అనుభవంకూడా చాటుచున్నాయి గాన- బాలబాలికలారా! మీరు చిన్ననాటినుంచీ ధర్మక్రియలు ఆచరించటం అలవాటుచేసుకోనండి; అధర్మక్రియల కేసి చూడకండి.

## అధర్మాచరణంవలన కలిగే దుష్టఫలితాలు.

అధర్మాచరణానికి ఫలం నరకమే అని తెలుసుకొన్నాం. అట్టి అధర్మాలనే ఆసక్తితో ఆచరించేవారికి దాపురించే దుష్టఫలితాలనుగూర్చి శాస్త్రం ఇలా వర్ణించింది.

"వ్యాధి ర్విత్తవినాశః, దుర్భగత్వ ముద్వేగతా— ।
తృష్ణా లౌల్య మనిర్వృతిః కుశయనం కుస్త్రీ కుభోజ్యం రుజః—'
ఇత్యేతాని పాపమహీరుహస్య ఫలాని.

అనగా "మానవుల అధర్మఫలం వారి అనుభవానికి వచ్చే సమయానికి అట్టి పాపాత్ములకు రకరకాల వ్యాధులు పుట్టుకొస్తాయి. అంతేకాదు అట్టివారికి అనేకవిధాలుగా ధననాశం

కలుగుతుంది. ఉన్నట్లుండి వారికి కోపతాపాలు చెలరేగుతాయి. ఇంకా ఈ అధర్మపరిణామఫలరూపంగా అట్టివారికి అత్యాశ, ఇంద్రియచాపల్యం, అశాంతి, ఆవేశం, నీచస్త్రీతో సంపర్కం, తత్ఫలితంగా నీచకులంలో పుట్టడం, తినకూడని వాటిని తినే దుర్గతి పట్టడం, గడ్డురోగాలతో వికలాంగులు కావడం వంటి హీనదీన ఘోరనీచదశలు దాపురిస్తాయి. ఇవన్నీ పాపాత్ముల పాపవృక్షం కాచే చేదుఫలాలేసుమండీ" అని మీది శాస్త్రవాక్యాలు చాటిచెపుతున్నాయి.

## ధార్మికబుద్ధికై చిత్తనైర్మల్యాదుల అవశ్యకత.

మానవుల మనస్సు నిర్మలంగా ఉన్ననాడు, వారి ఇంద్రియాలు స్థైర్యంకలవౌతాయి. మనస్సుయొక్క సహాయంతోనే ఇంద్రియాలు ఆయాపనులలో పాల్గొంటాయి. మానవుల మనోభావాలు నిర్మలంగాను, పవిత్రవంతంగాను ఉన్నప్పుడు జరిగేపనులుకూడా ఉదారభావభాసితాలౌతాయి. ఇట్లు మన మనస్సుయొక్క నైర్మల్యం. మనఇంద్రియముల స్థైర్యానికీ, ఆస్థైర్యం ఇంద్రియనిగ్రహానికీ సాధనమై ఆనిగ్రహం, మానవుల ధార్మికభావోదయానికి దారితీస్తుంది.

అసలు, మనపూర్వజన్మలోని వాసనలు మనమానసిక భావాలపై తమప్రభావాన్ని చూపుతాయి. కనుక మనభావ నైర్మల్యం మనచిత్తనైర్మల్యానికీ, ఆనైర్మల్యం మనఇంద్రియ విశుద్ధతకు, ఆవిశుద్ధత ఇంద్రియనిగ్రహానికి సాధనాలౌతాయి. కనుక ఇంద్రియనిగ్రహం అనేది, మానవుల ధార్మికభావోదయానికి పరంపరాకారణ మౌతుందని తేలింది.



## ఇంద్రియనిగ్రహానికి వలసిన ప్రథమప్రక్రియ.

నిర్మలమైన మనస్సుయొక్క సహజస్వరూపమే సత్సంకల్ప మనిపించుకొంటుంది. సామాన్యమానవుల ఇంద్రియాలు సహజంగా- 'శబ్ద,స్పర్శ,రూప,రస,గంధాలు' అనబడే భౌతిక విషయాలమీదకు పరుగులు తీస్తూండడం, ఆయింద్రియాలస్వభావం. ఇట్లు భౌతికవిషయాలతో ఇంద్రియాలు సంయోగం చెందడం అనేదే 'కామం' అనిపించుకొంటుంది. 'కోరిక' అనే అర్థంకల ఈ "భౌతికకామం" చెడ్డసంకల్పంచేతనే పుట్టుకొస్తుంది. ఇట్టి కోరికలచేతనే ఇంద్రియాలకు ఉత్తేజం, దుష్టవేగం అనేవి అబ్బుతాయి. అట్టి దశలో ఉన్న మనఇంద్రియాలు పాశవిక (పశుసంబంధమైన) బలంతో చెలరేగుతాయి. ఈవిధంగా ఇంద్రియోద్వేగాన్ని, మానసికోద్వేగాన్ని రేకెత్తించే చెడ్డకోరికలను పూర్తిగా విడిచిపెట్టడమనేది మనమనశ్శాంతికి, మన ఇంద్రియనిగ్రహానికి ముఖ్యసాధన మౌతుంది. ఈమహాఽభ్యుదయప్రాప్తికిగాను ముందుగా మానవుడు తన మనస్సులోని వివిధకోరికలను, మమత్వాదులను విడిచెయ్యాలనీ, అలా విడిచెయ్యడంచేతనే మానవులకు నిజమైన నిత్యమైన 'మనశ్శాంతి' కల్గుతుందనీ గీత ఇలా చాటిచెప్పింది.

"విహాయ కామాన్ య స్సర్వాన్, పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకారః, స శాంతి మధిగచ్ఛతి ॥" (గీత- 2-71)

అంటే- ముందుగా భౌతికమైన కోరికలను విడిచిపెట్టి భౌతికమైన ఏపనియందూ ఎక్కువ మక్కువచూపకుండా మమ

త్వాఽహంకారాలు విడిచిపెట్టగలవాడే నిజమైన "మనశ్శాంతిని" "ఇంద్రియనిగ్రహాన్ని" పొందగలుగుతాడని మీది గీతాసూక్తిలోని భావం. నిజానికి, సత్త్వరజస్తమోగుణాలుఅనే ప్రకృతిగుణాల ప్రభావంచేత అన్నిపనులు వాటికంతట అవే జరుగుతూంటాయి. అటువంటప్పుడు "ప్రతీపనీ జరగడానికి నేనే కర్తను; నావల్లనే ఈపనులన్నీ ఇలా జరుగుతున్నాయి" అనుకొనేవాడు 'మూఢాత్ముడే' ఔతాడని గీత ఇలా అంటూంది.

"ప్రకృతేః క్రియమాణాని, గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా, కర్తాఽహ మితి మన్యతే ॥" (గీత- 3-27)

కనుక, "దుష్టకామత్యాగరూపపరిణతి"లోనికి ఎప్పుడైతే మనమనస్సు వస్తుందో అప్పుడే మనకు, "ఇంద్రియనిగ్రహం" అనే మహాఽభ్యుదయం ప్రాప్తమై ఆ అభ్యుదయం 'ముక్తి'కి సులభమార్గం చూపుతుంది. కనుక, ఎప్పటికైనా, పరిణతిచెందిన నిర్మలమనస్సుచేతనే మానవుని యింద్రియాలు స్వాధీనం చేసుకోదగిఉన్నాయి. ఇట్లు దుష్టవాంఛలు లేని మనస్సే ఇంద్రియజయానికి సాధన మౌతుందని గీతాశాస్త్రసిద్ధాంతమై ఉంది. (చూ. గీత- 6-24)

## ఇంద్రియాలతో మనస్సు కలిస్తే.

"శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు" అనబడే భౌతికవిషయాలతో మన ఇంద్రియాలు కలిసినప్పుడే అవి బలంకలవౌతాయి. అట్టిఇంద్రియాలతో మనస్సుకూడా కలిసినప్పుడు



అట్టి ఆ ఇంద్రియమనస్సుల సంయోగమనేది సామాన్యమానవులనేగాక విద్వాంసులనుకూడా మోహపరచి తప్పుదారిని పట్టిస్తుంది. ఇక సామాన్యులమాట చెప్పనక్కర్లేదు. కనుకనే వ్యాసమహర్షి ఇంద్రియ మనస్సంయోగసమయంలో మానవుల ఇంద్రియాలకున్న పాశవికబలాన్నిగూర్చి-

"బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి"

అని నొక్కి వక్కాణించినాడు. ఇంకా ఈ ఇంద్రియ మనస్సంయోగముచే ఏర్పడుతూన్న దుష్టపరిణామాన్నిగూర్చి భగవద్గీత- ఇంద్రియాల సహజస్వభావాన్ని తేటతెల్లం చేస్తూ ఇలా చెప్పింది-

"ఇంద్రియాణాం హి చరతాం, యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం, వాయు ర్నావ మివాంభసి ॥"
(గీత- 2-67)

అంటే "శబ్దాది విషయాలతో కూడి ఏ అడ్డూ లేకుండా యథేచ్ఛగా సంచరిస్తూన్న ఇంద్రియాలతో మనస్సు కలియడం అనేది, సముద్రంలో ప్రయాణం సాగిస్తూన్న ఓడకు హఠాత్తుగా వచ్చిన తుఫానుగాలివంటిది ఔతుంది. అనగా ఇంద్రియమనస్సంయోగమనేది, ఆధ్యాత్మికసాధనచేస్తూన్న సాధకుల వివేకబుద్ధిని, తుఫానుగాలి పెద్దఓడను సముద్రంలో ముంచివేసినట్లు, మోహసాగరంలో ముంచేస్తుంది." గీతోక్తమైన ఈపరమార్థాన్ని సెంటిపెర్సెంటులో ఋజువుచేసే ఈభౌతికనిదర్శనాలను గమనించండి.

"పుట్టలో యెక్కడో సురక్షితంగా ఉన్న సర్పం, పాములవాని నాగస్వరానికి (శబ్దానికి) తనశ్రోత్రేంద్రియాన్ని వశంచేయడంచేతనే ఆపాము స్వయంగా పైకివచ్చి పాములవానిచేతికి చిక్కి చంపబడుతూంది. ఇచ్చట చెవి అనే ఇంద్రియానికి శబ్దం విషయంకనుక ఇట నాదస్వరం అనే శబ్దంతో పాముయొక్క చెవి అనే ఇంద్రియం మనస్సుతో సహా కలిసింది. కనుక అట్టి విషయేంద్రియసంయోగం ప్రస్తుతంలో పాముని చంపింది.

ఇట్లే మగఏనుగు చర్మేంద్రియం ఆడఏనుగుశరీరంతో రాచుకొనడం అనే స్పర్శసుఖానికి వశమౌతుంది. అప్పుడు ఆడఏనుగును వెంబడించిన మగఏనుగు, తనకై ఏర్పాటుచేసిన పెద్దగోతిలో పడి క్రమంగా చంపబడుతూంది. అనగా ఇక్కడ త్వక్ అనే ఇంద్రియం మనస్సుతో సహా స్పర్శసుఖం అనే విషయానికి వశం కావడంచేతనే ఏనుగు క్రమంగా నశించిందన్నమాట. అంటే ఇచ్చట త్వక్‌స్పర్శలు అనే విషయేంద్రియాలు కలిసి ఏనుగును చంపిన వన్నమాట.

ఇట్లే మిడత తననేత్రేంద్రియాన్ని మంట అనే రూపానికి (విషయానికి) వశం చేయడంచేతనే వెంటనే మంటలో పడి అది మాడిపోతూంది.

ఇట్లే- తుమ్మెద తనఘ్రాణేంద్రియాన్ని (ముక్కుని) మనస్సుతో సహా పరిమళమనే విషయానికి వశంచేయడం చేతను, చేప తనరసనేంద్రియాన్ని దానికి విషయమైన మాంసపుముక్కకు మనస్సుతో కూడా వశంచేయడంచేతను,



తమచావును తామే తెచ్చిపెట్టుకుంటున్నాయి. ఈవిధంగా సర్పం మొదలైన జంతుపంచకం తమ ఒక్కొక్క ఇంద్రియాన్ని ఆయింద్రియవిషయాలకు వశంచేసి, నశిస్తూండగా తమ పంచేంద్రియాలమధ్య జీవిస్తూన్న మానవులు తమ ఇంద్రియపంచకమును వాటి విషయాలమీదకు తమమనస్సుతో సహా విడిచి వశంచేసినప్పుడు వారిగతి, ఎంతటివిషమపరిణామానికి గురిఔతుందో కదా!

ఈపరమార్థాన్ని ప్రకటించే మూలశ్లోక మిది-

"భుజంగ మాతంగ పతంగ భృంగ
మీనా హతాః పంచభి రేవ పంచ ।
ఏకః ప్రమాదీ, స కథం న హన్యతే,
య స్సేవతే పంచభి రింద్రియై శ్చ ॥"

ఇక, తన ఇంద్రియాలను, భౌతికముగా ఆ ఇంద్రియవిషయాలతో కలియనివ్వకుండా వానిని తనఅధీనంలోనికి తెచ్చుకొని వానిని తనవశంలో పెట్టుకున్నమానవునికి ఆఇంద్రియాలవలన ఎట్టి ప్రమాదమూ కలుగదు. అంటే మనోనిగ్రహంకలవాని ఇంద్రియాలూ, వాని మనస్సూ ఆనిగ్రహం కలవాని కపకారులుకాకపోవడమేకాక పైపెచ్చు అవి ఆత్మీయబంధువులవంటి వౌతా యన్నమాట. ఇక ఇంద్రియనిగ్రహం లేనివాని ఇంద్రియాలు కర్త అధీనంలో లేకపోవుటచేతను అట్టి అనియతేంద్రియాలు తమవిషయాలతో కలిసి విచ్చలవిడిగా తిరుగుచున్న కారణంచేతను కర్తకవి శత్రువుల వంటివే

ఔతాయి. ఈపరమార్థాన్ని మనగీతామాత ఇలా ఋజువు చేస్తూంది.

"బంధు రాత్మాత్మన స్తస్య, యేనాత్మై వాత్మనా జితః ।
అనాత్మన స్తు శత్రుత్వే, వర్తే తాత్మైవ శత్రువత్ ॥"
(గీత- 6-6)

ఇట్లు- మానవుల నిత్యజీవితంతో ప్రతీక్షణం సమన్వయించుకొని తద్ద్వారా తమజీవితరక్షణము గావించుకోదగిన శ్లోకరత్నాలు గీతారత్నాపణములో మరెన్నో ఉన్నాయి. పాఠకులు ఇట్టి శ్లోకవిశేషాలను తప్పక తెలుసుకోవలసిఉంది. ఇందులకు "జ్ఞానదీపిక" అనే, విపులాంధ్రభాషామయవ్యాఖ్య పాఠకులకు ఎక్కువగా సహకరిస్తుంది. ఈవ్యాఖ్యను కైలాస మానససరోవరతీరవాసి ఐన స్వామి ప్రణవానంద తేట తెనుగులో రచించినారు. A

ఇట్లు మానవుని మనస్సు నిగ్రహదశలో ఉన్నప్పుడు అట్టివానికది బంధువువంటిదికాగా, అదే మనస్సు నిగ్రహరహిత దశలోఉన్నప్పుడు అట్టిమానవులకది శత్రువువంటిదే ఔతున్నది. ఇట్లు ఒకేవస్తువు ఒకనికి బంధువుగాను, మరొకనికి శత్రువుగాను మారడంలో ఉన్న సత్యాన్ని ఒకస్మృతిసూక్తి ఇలా తెలిపింది.

"మన ఏవ మనుష్యాణాం, కారణం బంధమోక్షయోః ।
మోక్షో విషయ వైరస్యం, బంధో వైషయికో రసః ॥"

---

A. ప్రాప్తిస్థానం- ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ - సికిందరాబాద్, మద్రాస్, మచిలీపట్నం.



## మానవులు ధర్మాత్ముణ్ణే ఎందుకు పూజిస్తారు?

మానవులు, దేవతలుకూడా ధర్మబుద్ధికలవానినే పూజిస్తారుకాని, కాముకుణ్ణిగాని, ధనికుణ్ణిగాని పూజించరు. కాముకులు స్వార్థదుర్గుణదూషితులు ఐనధనికులవలన, ఇహలోకపరలోకవాసులలో ఏఒక్కనికీ ఏఒక్క ఉపకారమూ ఉండదు. ఇక ధార్మికుడంటారా? ఉభయలోకనివాసులకూ హితంకరములు; క్షేమంకరములు ఐన ధార్మికక్రియలనే ఆచరించడంద్వారా అతడు అందరికూ అభిలషణీయమైన అభ్యుదయాలను చేకూరుస్తాడు. కనుక అట్టివాడు అందరికూ ఆశ్రయణీయుడౌతున్నాడు. ఈసత్యాన్ని ఈఉపనిషద్వాణి ఇలా బోధిస్తూంది.

"---లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి
ధర్మేణ పాప మపనుదతి
ధర్మే సర్వం ప్రతిష్ఠితం,
తస్మా ద్ధర్మం పరమం వదంతి—" (తైత్తిరీయోపనిషద్వాణి)

లోకంలోకూడా చాలామంది ధర్మాత్ముణ్ణి ఆశ్రయించి "అయ్యా! మానవులు తమపూర్వజన్మలలో చేసికొన్న పాపాలే మలిజన్మలలో వారిని వ్యాధులరూపంలో బాధిస్తాయి.

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే"

అని శాస్త్రప్రమాణంకదా! కనుక మా ఆధివ్యాధులకు ఆదికారణమైన మాపాపాలు పోవాలంటే మేమేం చెయ్యాలో సెలవీయగోరుచున్నాము".

అని ఆదరపూజ్యభావాలతో ప్రజలు వచ్చి ధర్మాత్ముణ్ణే అడుగుతారు. ఇది లోకస్వభావం. కారణం: అన్ని అనర్థాలకు ఆదికారణమైన పాపం, ధర్మాచరణంచేతనే పోతుందని- "...ధర్మేణ పాప మపనుదతి" అనే ఉపనిషత్సూక్తి సాక్ష్యమిచ్చిందికదా!

కనుక సోదరసోదరీమణులారా! గతంలో మిగిలి ఉన్న మనపాపాలను మనధర్మాచరణంచేతనే పోగొట్టుకోవలసి ఉంది. మనపాపపరిహారానికి ఇదొక్కటే సులభమార్గం. తెలివితేటలు కలవారమనుకున్నవారు ఇక్కడ ఒకప్రశ్న వేయవచ్చు. "ధర్మాచరణంచేత పాపం పోతుంది" అన్నారుకదా! ఐతే 'పాపాచరణంచేతకూడా ధర్మంపోతుందా?' అని. సోదరులారా! ఇటువంటి ధార్మికవిషయప్రసంగసమయంలో యుక్తివాదం పనికిరాదని శాస్త్రం చెపుతూంది. మరి చూడండి వేదం–

"ధర్మంచేతనే పాపం పోతుంది." "ధర్మేణ పాప మపనుదతి" అనిమాత్రమే చెప్పిందిగాని, 'పాపంచేత ధర్మంపోతుం' దని ఎక్కడా చెప్పలేదుకదా!

మీది చర్చవలన తేలినసారాంశమేమనగా - మానవుల సర్వవిధాభ్యుదయసిద్ధికీ కావలసిన సాధనసంపద అంతా వారివారి ధర్మాచరణంమీదనే ఆధారపడి ఉంది. కనుకనే, "స్వధర్మంమీదనే మానవుని సర్వవిధాభ్యుదయసంపద సుప్రతిష్ఠితమై ఉంది" అనే సారాంశాన్నే ఉపనిషన్మాత-

"ధర్మే సర్వం ప్రతిష్ఠితం"



అనే సూక్తిద్వారా ధృవపరచింది. ఇంకా ఈ "ధర్మం అనేది అన్నిటికంటె అధికమైనది" అనే అంశాన్నికూడా- ఉపనిషన్మాత "తస్మా ద్ధర్మం పరమం వదంతి" అని చక్కని సిద్ధాంతం చేసింది. ఇది త్రికాలములలో నిత్యంగా నిలిచే సిద్ధాంతం.

ఇంతవరకు మనం ధర్మం యొక్క ప్రత్యేకతను, ఆవశ్యకతను, ప్రత్యేకప్రయోజనాదులనుగూర్చి సంగ్రహంగా తెలుసుకొన్నాం.

మానవుల నిత్యజీవితంలో ప్రతిక్షణం వారికి సర్వాభ్యుదయసంధాయకములైన వేలాదిధర్మాలను మనమహర్షులు, కేవలలోకశ్రేయస్సంపాదనధ్యేయంతోనే తమస్మృతిగ్రంథాల ద్వారా అందించి, ప్రపంచవాసులందరికీ మహోపకారం చేశారు. అట్టి ధర్మసూత్రాలలోంచి బాలబాలికలారా! మీభావిజీవితాలకు మహాభ్యుదయసంపాదకాలైన కొన్నిముఖ్యసూత్రాలను ఎన్నికచేసి, సులభసంగ్రహతాత్పర్యాలతో వానిని ఈమొదటిప్రకరణంచివరను, సాంఘికప్రకరణంచివరను నిక్షేపించాను. అవి మిమ్ము అచిరభావిలో ఉత్తమభారతపౌరులుగా తీర్చిదిద్దగలిగి ఉన్నాయి. ఎలాగంటారా! ఆసూత్రాలు, మానవుల మానవత్వసిద్ధికి కావలసిన ముఖ్యధర్మాలను, సాంఘికకళ్యాణసిద్ధికి మూలములైన నీతులను, ఉత్తమప్రవర్తనకు కావలసిన ఉత్తమశీలమును ఉదారభావసంపదను, మీదైనందినజీవితంలో మీఆరోగ్య

సంపదకు, అవసరమైన ఆరోగ్యసూత్రాలను ఈసూత్రార్థాలు మీకు అందిస్తాయి. వాటిని మీరు అమలులో పెట్టుకొని, ఆకళించుకొని ఆచరించిననాడు మీనిత్యజీవితం మూడుపువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధిచెందుతుంది. కనుక ఈసూత్రాలను వీలుగా ఉన్నన్ని మీరు కంఠస్థంచేయడం అత్యవసరమన్న మాట. నేటిసైన్సుకికూడా సరిపడే ఈసూత్రాలను శ్రద్ధగా ఇక చదవండి.

## మూలసూత్రాలు-తాత్పర్యములు.

1. "అంభసః ప్రసృతీ రష్టౌ రవావనుదితే పిబేత్ ।
వాతపిత్తకఫాన్ జిత్వా, జీవే ద్వర్షశతం సుఖీ ॥" (చరకం)

తాత్పర్యము:- మానవులు ప్రతిరోజూ సూర్యోదయానికి ముందే 8 పుడిసెళ్ళచన్నీళ్ళుత్రాగినచో అట్టివారు తమలోని వాతపిత్తకఫముల ఉద్రేకమును జయించి నూరేళ్ళు సుఖంగా జీవిస్తారు. వాతపైత్యకఫాలలో ఏఒక్కటి ఉద్రేకించినా మనం లేచి తిరగలేం. కనుక సుఖజీవితానికై ఈచిట్కా అందరకు అవసరమైనదే.

2. "అకాలే బహుచాల్పం వా భుక్తం తు విషమాశనం" (చరకం)

తా:- వేళకానివేళలో, ఎక్కువగాగాని, తక్కువగాగాని చేసినభోజనం ఆభోక్తలకు విషంతో సమానమగును.

3. "అక్రోధేన జయే త్క్రోధం, గర్వం తు వినయేన చ"
(నీతిశాస్త్రం)



తా:- మానవుడు తనక్రోధాన్ని, తనసహానగుణంతో జయించాలి. ఇట్లే తనగర్వాన్ని తనవినయగుణంతో జయించాలి.

4. "అచింత్యాః ఖలు యే భావాః
న తాంస్తర్కేణ సాధయేత్ ॥" (స్మృతివాక్యం)

తా:- మనకు అందుబాటులో లేని ఆధ్యాత్మికవేదాంతాదివిశిష్టవిషయాలను, దుర్బలములైన మనహేతువాదాలతోను; కుయుక్తులతోను సాధించుటకుప్రయత్నించరాదు. అలా ప్రయత్నిస్తే బుద్ధిశక్తి క్షీణిస్తుంది.

5. "ఆహారం మైథునం నిద్రాం సంధ్యాకాలేషు వర్జయేత్ ॥"
(శంఖస్మృతి)

తా:- భోజనంచేయడం, భార్యతో కలియడం, నిద్రించడం అనే యీమూడు పనులను మానవులు సంధ్యాసమయాల్లో చేయకూడదు. చేస్తే వారి సహజశారీరకశక్తులు సైన్సురీత్యా నశిస్తాయి.

6. "కన్యాదూషక షండో జాయతే" (గౌతమధర్మసూత్రం)

తా:-కన్యకను చెరచినవాడు పైజన్మలో నపుంసకుడై పుట్టును. కారణం ఇటు తనపురుషధర్మాన్ని పాడుచేశాడు. అటు కన్యాధర్మాన్ని పాడుచేశాడు. ఈధర్మద్వయనాశనఫలితంగా ఆకన్యాదూషకుడు, తనమలిజన్మలో పురుషుడూ కాకుండా, స్త్రీకాకుండా నపుంసకుడుగా జన్మిస్తాడు. అంటే తనధర్మద్వయనాశనం తన జీవితద్వయనాశనానికి మూలమయిందన్నమాట.

7. "కర్మణా మనసా వాచా యత్నా ద్ధర్మం సమాచరేత్"

(యాజ్ఞవల్క్యస్మృతి)

తా:- తనజీవితంలో నిత్యసౌఖ్యాన్ని కోరే ప్రతిమానవుడూ త్రికరణశుద్ధిగా శాస్త్రంలో తమకు చెప్పబడిన ధర్మక్రియలనే శ్రద్ధగా ఆచరించవలెను.

8. "కామక్రోధసమావిష్టో మా భుంజీయా త్కదాచన ॥" (చరకం)

తా:- భోజనసమయంలో తనకు పుట్టుకొచ్చిన కామ, క్రోధముల ఉద్రేకాన్ని వివేకంకలవాడు తప్పక అణచుకోవలెను. అట్టి ఉద్రేకంలో ఉన్నప్పుడు భుజించినదంతా విషంగా మారి సైన్సురీత్యా ప్రాణాపాయమును కలిగించును. ఇది మన అనుభవంలోనిదే.

9. "అప్యున్నతపదారూఢః పూజ్యా న్నైవాపమానయేత్"

(స్మృతిసూక్తి)

తా :- తాను ఎంతటి అధికారంలోను, ఉన్నతపదవిలోను ఉన్నానసరే, పూజింపదగినవారిని యెప్పుడూ, ఏపరిస్థితిలోనూ ఏవిధంగానూ అవమానించరాదు. "పూజ్యావమానం" అనేది అవమానించినవాని అధోగతికే ఆది కారణమగును.

10. "శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చాప్యవధార్యతాం ।
ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ॥"

(మహాభారతసూక్తి)

తా :- తనకు అయిష్టమయిన మాటనుగాని, పనినిగాని



యెదుటివాని విషయంలో చేయకపోవడ మనేదే ధర్మసారమని తెలుసుకొని దానిని శ్రేయస్కామి మరవక తప్పక ఆచరించవలెను. ఇదే ధర్మసారమనికూడ గ్రహించవలెను.

11. "ఆయుష్కామేన వస్తవ్యం, న జాతు పరయోషితి ॥" (చరకం)

తా :- తనకు మంచి ఆయుర్దాయం కావాలనుకున్నవాడు ఏపరిస్థితిలోనూ పరస్త్రీతో కూడరాదు. "న పరదారాన్ గచ్ఛేత్" అని శాస్త్రం నిషేధించిందిగాన.

12. "గాయత్రీరహితో విప్రః శూద్రా దప్యశుచి ర్భవేత్ ॥"

(పరాశరస్మృతి)

తా :- గాయత్రీమహామంత్రాన్ని రోజూ శుచిగా నియమనిష్ఠలతో జపించని బ్రాహ్మణుడు, శూద్రునికంటే ఇంకా అపవిత్రుడగును. ఇట్టివాడు బ్రాహ్మణధర్మభ్రష్టుడై "జాతిచండాలుడు" అనిపించుకొంటూ, సాంఘికంగా పతితుడగును. మైలవంటి అశుచి వచ్చినప్పుడు కూడా వినిర్మలచిత్తంతో మానసికంగామాత్రమే జపించవలెను. ఇది ప్రతినిత్యమూ ఆచరించవలసిన నిత్యక్రియ గనుక.

13. "న దత్తం పున రాదద్యాత్, న దత్వా పరికీర్తయేత్ ॥"

(ఆపస్తంబధర్మసూత్రం)

తా :- ఒకరికి దానంగా ఇచ్చిన వస్తువును తిరిగి (దాత) తీసికొనరాదు. ఇస్తే ఒకరికి దానంగా ఇంత

ఇచ్చానని పరులతో చెప్పనూరాదు. అలా తీసికొన్నను, చెప్పినను దాతకు ఆదానఫలం ఏమీ తక్కదు.

14. "న నక్తం దధి భుంజీత ॥" (చరకం)

తా :- తరచుగా రాత్రులందు పెరుగు భుజించినచో అట్టి భోక్తకు క్రమంగా ఆయుర్దాయం క్షీణిస్తుందిగాన మన ఆయుర్దాయరక్షణకోసమే రాత్రి పెరుగుతో భోజనం చేయడమనేదాన్ని మనమహర్షులు నిషేధించారు.

15. "ప్రియం తథ్యం చ పథ్యం చ వదే ద్ధర్మార్థమేవ చ ॥'

(మనుస్మృతి)

తా :- పెద్దల సమక్షంలో మాట్లాడునప్పుడు ఆ మాటలు వినేవారికి ప్రియంగా ఉండవలెను. అవి ఇంకా నిజమైనవిగాను, హితమైనవిగాను ఉండవలెను. అట్టి ప్రియకర హితకరసంభాషణం అలా భాషించువానికి ధర్మ ప్రవర్తనగా మారును.

16. "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, న బ్రూయా త్సత్య మప్రియం ।

ప్రియం చ నానృతం బ్రూయాత్, ఏష ధర్మ స్సనాతనః ॥" (మను)

( "సనా, సనత్, సనాత్- సనా నిత్యే " అని శబ్దశాస్త్రవచనం)

తా:- మనం మాట్లాడే మాటలతీరు ఎట్లుండవలెననగా వినేవారికి మనమాట- సత్యంగాను, ప్రియంగాను ఉండవలెను. నిజమైనదైనా ఆమాట వినేవారికి అప్రియంగా ఉండరాదు. ఇట్లే మనమాట వినేవారికి ప్రియమైనదైనా



ఆమాట అసలు అసత్యం కారాదు. ఈవిధంగా మాట్లాడుతే మానవునకు ఎప్పటికీ మార్పులేని సత్యనిత్యధర్మమును ఆచరించిన ట్లగును ("సనాతనం" అనగా ఎప్పటికీ మార్పులేక ఒకేరీతిగా స్థిరంగా ఉండేది అని అసలు అర్థం.)

17. "బ్రాహ్మీముహూర్తే యా నిద్రా, సా పుణ్యక్షయకారిణీ ॥"

(యాజ్ఞవల్క్యస్మృతి)

తా :- సూర్యోదయానికి 1½ గంటల ముందున్న కాలాన్ని "బ్రాహ్మీముహూర్తం" అంటారు. అట్టి బ్రాహ్మీముహూర్తంలో నిద్రించినవారి నిద్ర వారిపుణ్యక్షయానికే కారణమాతుంది. కారణం : ఆముహూర్తం దేవతారాధనకు చెప్పబడిన సమయంగాన.

18. "భార్యా భర్తు ర్మతేనైవ, వ్రతాదీని చరే త్సదా ॥"

(స్మృతివాక్యం)

తా:- భార్య, తానుచేయదలచిన వ్రతాదిపుణ్యకార్యాలన్నింటినీ తనభర్త అంగీకారంమీాదనే చేసుకొనవలెను. లేనిచో ఆమె ఎంతటిగొప్పవ్రతం చేసినా ఆవ్రతఫలం ఆమెకు తక్కదు.

19. "సర్వేషు ధర్మకార్యేషు, పత్నీ దక్షిణతో భవేత్ ॥"

(వసిష్ఠస్మృతి)

తా:- కన్యాదానంవంటి వేదోక్తమైన ధర్మకార్యాలు చేసేటప్పుడు భార్య, భర్తకు కుడివైపుననే ఉండవలెను. ఇట్లుండుటవలన సైన్సురీత్యా దంపతుల భావాలలో

ఒకక్రొత్తశక్తి ఏర్పడి ఆశక్తివలన వారు చేసే ఆకార్యం త్వరలో విజయవంతమగును.

20. "మనో బుద్ధ్యా నిగృహ్ణీయాత్, విషయా న్మనసాత్మనః ॥"

(భీష్మధర్మం)

తా:- వివేకంకలవాడు, తన చంచలమనస్సును తన స్థిరబుద్ధిచేత నిలద్రొక్కుకొని తన అదుపులో పెట్టుకొనవలెను. అలా నిశ్చలమైన తనమనస్సుచేత శబ్దస్పర్శాది భౌతికవిషయాలను నిరోధించవలెను. ఈప్రక్రియచేత మోక్షప్రయత్నం తొందరలో సఫలమగును.

21. "యా న్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని, నో ఇతరాణి ॥"

(తైత్తిరీయోపనిషద్వాణి)

తా:- ప్రతిఒక్కరూ తమకు శాస్త్రంలో చెప్పబడిన సత్కర్మలనే అనగా మంచిపనులనే చేయవలెనుగాని చెడ్డపనులనుమాత్రం చేయరాదు. ఒకవేళ చేస్తే అవి జన్మాంతరంలో దుష్టవాసనలుగా మారి అవి పైజన్మలకు కూడ పాకి కర్తకు అధోగతినే కల్పించును.

22. "లోభశోకభయక్రోధవేగా న్నివారయేత్ ॥" (చరకం)

తా:- తన శాంతిసౌఖ్యాలను కోరే ప్రతి ఒక్కడూ తన శోక భయ క్రోధముల దుష్టవేగాన్ని తప్పక నివారించుకోవలెను. క్రోధాదుల ఉద్రేకం మితిమీరినచో ఆవ్యక్తి రక్తాణువులు విషంగా మారి గుండె ఆగి చనిపోవుట తటస్థించును.



23. "వయోధికాం నోపయచ్ఛేత్, దీర్ఘాం కన్యాం స్వదేహతః"

(ధర్మసూత్రం)

తా:- వరుడు తనకంటె యెక్కువవయస్సుకల స్త్రీనిగాని, ఇట్లే తనకంటె పొడవుగా ఉన్న స్త్రీనిగాని వివాహమాడరాదు. ఆడినచో అట్టి యువకుడు తొందరలో ముసలివాడై అల్పాయువుకలవాడగును.

24. "వశ్యాత్మా ధర్మాత్మా చైవ, సర్వదా నిశ్చింతో భవేత్ ॥" (చరకం)

తా:- తనమనోబుద్ధులను తన ఆధీనంలో ఉంచుకొని, ఆవిధంగా ఇంద్రియనిగ్రహమూ, ధర్మబుద్ధీ కలవాడు సర్వదా చింతలేనివాడై సుఖశాంతులతో మనగల్గును. కనుక, మనోనిగ్రహం అనేది మానవుని ఉన్నతికీ, మనోనిగ్రహం లేకపోవడమనేది మానవుని అధోగతికీ ముఖ్యకారణమగును. (చూ. గీత 2-64-67)

25. "శంభోః ప్రదక్షిణం కుర్వన్ సోమసూత్రం న లంఘయేత్ ॥"

(ఆగమసూత్రం)

తా:- దేవునిగుడిలో మహేశ్వరునికి ప్రదక్షిణం చేసేటప్పుడు ఆ ఈశ్వరునకు చెందిన సోమసూత్రాన్ని దాటి ప్రదక్షిణం చేయరాదు. అలా చేసినవాని పవిత్రశక్తి క్షీణించును.

26. "విభూత్యా పూజయే దీశం, సర్వైశ్వర్యప్రదాయకం ॥"

(విష్ణుపురాణం)

తా:- తనను ఆరాధించేవారికి సర్వైశ్వర్యములను

సమకూరుస్తాన్న సర్వేశ్వరుణ్ణి భక్తుడు 'విభూతి'తో పూజించడ మనేది అతడిసర్వైశ్వర్యప్రాప్తికి చక్కని సాధన మగును.

27. "శుష్కవాసాః స్థలే కుర్యాత్, తర్పణాచమనం జపం ॥"

(విష్ణుపురాణం)

తా:- తర్పణం, ఆచమనం, జపం అనే ఈమూడింటినీ గృహస్థుడు పొడిబట్టతో ఒడ్డుమీద కూర్చుని చేయవలెను. మహర్షులు చెప్పిన ప్రతిఒకపనిలోను సైన్సుకి సరిపడిన గొప్పప్రయోజనం ఉండితీరును.

28. "శ్వఃకార్య మద్య కుర్వీత, పూర్వాహ్ణే చాపరాహ్ణికం...."
"పరత్ర హేతో రిహ జన్మనా చ " (నీతిశాస్త్రం)

తా :- ఈ రోజుపనిని తొందరగా ముగించుకొని రేపటిపనిలో కూడా కొంత ఈరోజులో చక్కబెట్టుకోవలెను. ఇల్లే మధ్యాహ్నం పనిని పొద్దుట (కొంత) చేసుకొనవలెను. ఇల్లే తరువాత జన్మకు అవసరమైన పనులలో కొన్నైనా ఈజన్మలో చక్కబెట్టుకొనవలెను.

29. "సంధ్యాహీనోఽశుచి ర్నిత్యం, అనర్హ స్సర్వకర్మసు"

(బ్రహ్మవైవర్తపురాణం)

తా :- బ్రాహ్మణక్షత్రియవైశ్యులలో సంధ్యావందనం చేయనివాడు ఎప్పుడూ అపవిత్రుడుగానే ఉంటాడు. కనుక అట్టివాడు ఏవేళలోనూ ఏపుణ్యకార్యాన్ని చేయడానికైనా అర్హతలేనివాడే అగును.



30. "సముల్లంఘ్య సదాఽఽచారం కశ్చిన్నాప్నోతి శోభనం' (ఔర్వః)
"ఆచారః పరమో ధర్మః నృణాం కళ్యాణకారకః ।
ఇహలోకే సుఖీ భూత్వా పరత్ర లభతే సుఖం ॥" (ప్రాస్తావికం)

తా :- తనకు చెప్పబడిన సదాచారాన్ని అతిక్రమించినవాడు ఎప్పుడూ ఎక్కడా ఏ అభ్యుదయాన్నీ పొందలేడు. పొందలేదుకూడాను. 'సదాచారం' అనగా నిర్మలమైన సత్యప్రవర్తనం. అదే మానవులకు ఉత్తమ ధర్మంవంటి దౌతుంది. అట్టి ధర్మం మానవులందరకు మంగళప్రదమౌతూ, ఇహపరలోకాల్లో ముఖ్యంగా కావలసిన అన్నిసౌఖ్యాలను వారి కది సర్వదా సమకూరుస్తుంది.

31. "ఆచారహీనం న పునంతి వేదాః
యద్య ప్యధీతా స్సహ షడ్భి రంగైః"

తా:- సదాచారంలేనివారిని, వేదవేదాంగాల అధ్యయనంకూడా పవిత్రింపచేయలేదు.

32. "న బాధా విద్యతే యత్ర, తం ధర్మం సముపాచరేత్"

(వ్యాససూక్తి)

తా:- తనకూ, మరెవ్వరికీకూడా బాధాకరంకాని ధర్మాన్నే మానవుడు ఆచరించవలెను. పరధర్మం+అధర్మంఅనేయీరెండూ ఇతరులకు బాధాకరమౌతాయి. కనుక ఈ రెండింటినీ ఎవ్వరూ ఆచరించరాదన్నమాట.

33. "న లంఘయే ద్వత్సతంత్రీం.... ' (మనుస్మృతి)

తా:-ఆవునుకాని, దానిదూడనుకాని కట్టేసినత్రాడును

దాటి పైనుంచి ఎవ్వరూ పోరాదు. అలా దాటినవారికి పూజ్యమైన గోమాతను అవమానించినపాతకం ప్రాప్తించి అది అనేక అనర్థాలను కలిగిస్తుంది. ఏఒక్కనికీ ఏఒక అనర్థమూ అంటకుండా ఉండాలి అనే ఉత్తమధ్యేయంతోనే మనమహర్షిపుంగవులు మనకు అనర్థకరాలైన విషయాలన్నింటినీ ఇలా నిషేధించారన్నమాట.

34. "నాప్సు మూత్రపురీషం కుర్యాత్,
న, నిష్ఠీవేత్, న, వివసన స్స్నాయాత్....
గుహ్యో వా ఏషోఽగ్నిః...." (ఉపనిషద్వాణి)

తా:- నీళ్ళలోమలమూత్రాలూ, ఉమ్మి విడువరాదు; ఈదరాదు; కట్టుబట్ట లేకుండా నదీస్నానం చేయరాదు. నీటిలో రహస్యంగా అగ్ని ఉంది. "...గుహ్యో వా ఏషోఽగ్నిః" (శ్రుతి)

35. 'నాసౌ ధర్మో, యత్ర న సత్య మస్తి" (విదురనీతి)

తా:- సత్యంలేనిమాట 'ధర్మం' అనిపించుకొనక అది అధర్మమే ఔతుంది. కారణం సత్యాన్ని మించిన ధర్మం లేదుగాన. "సత్యాన్నాస్తి పరో ధర్మః" అని ధర్మశాస్త్ర సిద్ధాంతం.

36. "నాస్తి ధర్మా త్పరో బంధుః, నాస్తి ధర్మా త్పరం ధనం"
(బ్రహ్మవైవర్తపురాణం)

తా:- ధర్మాన్ని మించిన మరోబంధువుగాని, ధర్మాన్ని మించిన మరోధనంకాని లోకంలో లేదు. ప్రపంచ



శ్రేయస్సు అంతా సత్యధర్మాలమీదనే ఆధారపడిఉందని సర్వశాస్త్రాలసిద్ధాంతం.

37. "నేక్షే తోద్యంత మాదిత్యం, నాస్తంయంతం కదాచన"
(మను)

తా:- ఉదయిస్తూన్న సూర్యుణ్ణీ, అస్తమిస్తూన్న సూర్యుణ్ణీ చూడరాదు. కారణ మేమనగా ఆసమయంలో ప్రసరించిన సూర్యకిరణాలు మనకంటికి అనేకరకాలుగా హానిని కలుగజేయును. దీనినిబట్టి మహర్షులు చెప్పిన మాటలన్నింటిలోను సైన్సుకు చెందిన సత్యాలు, రహస్య విషయాలు, సిద్ధాంతాలు గూడుకట్టుకొని ఉన్నాయనడానికి ఈనిదర్శనం చాలు.

38. "నోపేయా త్పురుషో నారీం, సంధ్యయో ర్న చ పర్వసు"
(వాత్స్యాయనకామసూత్రం)

తా:- మూడు సంధ్యాసమయాలలోను పర్వదినాలలోనుకూడా, పురుషుడు తనస్త్రీతో కలియరాదు. అలా కలిసినవారిసతానం అల్పాయుస్సుకల దగును.

39. "ప్రాతస్స్నానం హరే త్పాపం, అలక్ష్మీం గ్లాని మేవ చ"
(ఆరోగ్యసూత్రం)

తా:- సూర్యోదయానికిముందు చన్నీటిస్నానం చేయడంవలన అలా చేసినవారిపాపం, దరిద్రం, అలసట, బద్ధకం అనే ఇవన్నీ తొలగిపోతాయి. సైన్సురీత్యా సూర్యోదయానికిముందు నీటిలోఉన్న కరంటుశక్తి ఆసమయంలో స్నానం

చేసినవారిశరీరంలో ప్రవేశించి అది వారిలో నూతనోత్తేజాదులను ప్రవేశపెట్టి తద్ద్వారా బద్ధకం, అలసట వ్యగ్రాలను పారద్రోలి చురుకుదనాన్ని కలిగించును.

40. "పిత్రో ర్వివదమానోఽపస్మారీ భవే త్సుతః"

(యాజ్ఞవల్క్యస్మృతి)

తా:- తల్లిదండ్రులతో జగడమాడేకొడుకు, తన మలి జన్మలో మూర్ఛరోగం కలవాడగును.

41. "నహి సత్యా త్పరో ధర్మః నానృతా త్పాతకం మహత్"

(బ్రహ్మవైవర్తస్మృతి)

తా:- సత్యభాషణమును మించిన మరో ధర్మంలేదు, అసత్యభాషణమునుమించినమరోపాతకంలేదు. 'సత్యమూలాని సర్వాణి' ప్రపంచంలో ఉన్న అన్నింటికీ "సత్యం" అనేది క్రుంగటివేరువంటిది. తల్లి వేరులేని వృక్షం జీవించలేనట్లు "సత్యవ్రతం" లేని మానవజీవితం 'జీవచ్ఛవం' వంటిదగును.

42. "నిభృతవేశపరిచ్ఛదేన భవితవ్యం" (ఆపస్తంబధర్మసూత్రం)

తా:- తన తోటివారిలో ప్రత్యేకమైన కీర్తిప్రతిష్ఠలు పొందగోరిన యువకుని వేషభాషలు, నిరాడంబరంగాను, ఉదారభావ భాసితంగాను ఉండవలెను. ఇదే భావం ఇంగ్లీషులో "Plain living, high thinking" అనీ, హిందీలో 'సాదా జీవన్, ఉచ్చ ఆదర్శ' అని వివరింపబడినది.

43. "పుణ్యేన వర్ధతే లక్ష్మీః, పాపేన క్షీయతే ధ్రువం"
"పుణ్యం పుణ్యేన జయతి, పాపం పాపేన ...."
(అని వేదోక్తమైన ప్రమాణవచనం)



తా:- మానవులధనసంపద వారి పుణ్యకార్యాచరణం చేత వృద్ధిపొందగలదు. ఇక మానవుల పాపకార్యాచరణం చేత వారి సంపద క్షీణించును. ఇది నిజము. కనుక తమసంపదలు వృద్ధిపొందాలనుకొన్నవారు పుణ్యకార్యాలుచేయుడం, "స్వధర్మాన్ని ఆచరించడం" అనేది అత్యవసరం.

44. "న మనస్సాక్షిణో విరుద్ధ మాచరేత్" (ఆపస్తంబధర్మసూత్రం)

తా:- పుణ్యకరభావాలతో నిర్మలమైన తన మనస్సు ఒక సందేహావిషయంలో తనకర్తవ్యాన్నిగూర్చి సున్నితంగా సూచిస్తూండగా విశ్వసనీయమైన ఆ అంతరంగ సాక్ష్యానికి విరుద్ధంగా ప్రవర్తించినచో తనకు తానే ద్రోహంచేసుకొన్నట్లగును.

45. "న సంశయే ప్రత్యక్షవ ద్బ్రూయాత్" (ఆపస్తంబధర్మసూత్రం)

తా:- తనకుతెలియనివిషయాన్ని తెలిసినట్లును, చూడని విషయాన్ని చూసినట్లును చెప్పి లోకాన్ని మోసగించడం అనేది అట్టిమోసగానికి సులభంగా నరకబాధనుకల్పించును.

46. "పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠేత్, ఆసీనః పశ్చిమాం తథా"

(శంఖస్మృతి)

'ప్రాతర్మధ్యాహ్నకాలే చ గాయత్రీం తు స్థితో జపేత్'

(యాజ్ఞవల్క్యస్మృతి)

తా:- ప్రాతర్మధ్యాహ్నసమయాలలో నిలుచుండియు, సాయంసమయంలో కూర్చుండియు గాయత్రీ మహామంత్రాన్ని మనస్సులోనే జపించవలెను. మననం చేసేదే "మంత్రం" అనిపించుకొనునుగాన.

47. "ప్రత్యఙ్ శిరాః ప్రవాసే తు, న కదాచి దుదఙ్ శిరః"

(స్మృతివాక్యం)

తా :- తనబుద్ధిబలాన్ని కోరినవాడు, ప్రవాసంకి వెళ్ళినప్పుడు పడమటకేసి తలపెట్టి పరుండవచ్చు. కాని యెప్పుడూ ఎక్కడాకూడా ఉత్తరంకేసి తల పెట్టి పరుండరాదు.

48. "పరదారా న్న గచ్ఛేత్తు మనసాపి కథంచన".

(ధర్మశాస్త్రవచనం)

తా :- పరునిభార్యతో కలుసుకొనవలెననే భావాన్ని కూడా శ్రేయస్కామి యగువాడు తన మనస్సులోనికి రానీయకూడదు. అలా రానిస్తే అన్య(స్త్రీ)సంగమంచేసిన పాపంవచ్చి ఆపాపిష్ఠిభావం తన ఆయుర్దాయనాశనమునకు కారణమగును.

49. "పరిత్యజే దర్థకామౌ ధర్మపీడాకరౌ నరః"

తా:- స్వాభ్యుదయాభిలాషి తనధర్మానికి హానిని కలిగించే అర్థకామములను సేవించరాదు. అధర్మమూలకాలైన అర్థకామాలు, కౌరవకీచకులకువలె తన వినాశానికే దారి తీయును.

50. "అసంకల్పా జ్జయే త్కామం, క్రోధం కామవిసర్జనాత్"

(పద్మపురాణం)

"కామక్రోధౌ నృణాం లోకే, నిరయస్యైవ కారణం"

(స్మృతివాక్యం)



తా॥ తనమనస్సులోని దుష్టసంకల్పాలను దూరంచేయగలవాడు కామాన్ని జయించగల్గుతాడు. అట్టి కామాన్ని విడిచినచో క్రోధాన్ని జయించవచ్చును. ఇట్లు భౌతికములు, నరకకారణాలు ఐన కామక్రోధాలను త్యజించడంద్వారా దుష్టములైన తన సంకల్పకామాలను జయించవలెను.

ఇట్లు బహుళార్థప్రదములు, త్రికాలములయందు సేవ్యములు ఐన ఇట్టి మహితమహర్షిసూక్తులు ప్రతి ఒక్కరినీ ప్రతిక్షణంలోను అనర్థాలనుంచి రక్షించడానికి సర్వసమర్థాలై ఉన్నాయి. ఇట్టి సూక్తులు విశ్వమంతటికీ విశిష్టసందేశాలై, విశ్వగతప్రజలకు క్షేమంకరాలు, హితంకరాలు, ప్రియంకరాలు ఔతూ, కాలత్రయంలోను సర్వులకు సంసేవ్యాలౌతూంటాయనడంలో సందేహంలేదు.

51. "..అనార్యై ర్నాపి భాషేత" (చరకం)

తా :- దుష్టులతో సంభాషించరాదు; అసలు వారిని పలుకరించనూరాదు. "దుష్టులకు దూరంగా ఉండవలెను." అనే సామెత అందరకూ తెలిసినదేకదా !

52. "ఋణాని త్రీ ణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్"...

(మనుస్మృతి)

తా:- 'ఋషి, దేవ, పితృరుణాలు' అనబడే ఈమూడు ఋణాలను శాస్త్రోక్తవిధానంలో తీర్చినద్విజుడే తనమోక్షప్రయత్నానికి యోగ్యతకలవాడగును. శాస్త్రోక్తంగా బ్రహ్మచర్యవ్రతనిర్వహణంవలన ఋషిరుణము తీరును.

ఇట్లే ధర్మపత్నితో కలిసి యజ్ఞం చేయడంవలన దేవఋణము, సత్సంతానప్రాప్తిచేత పితృఋణము తీరును.

53. "పత్రజాతిషు సర్వాసు బిల్వపత్రం విశిష్యతే"

తా :- ఆదిదేవునికి (శివునికి) పూజచేసే పత్రాలన్నింటిలోకి మారేడుపత్రి ఒక్కటే సర్వశ్రేష్ఠమైనది.

54. "దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్ ॥"

(శుశ్రుతం)

తా:- ప్రతీఒక్కడూ మార్గంలో నడిచే సమయంలో దారిచూసి మరీ అడుగువేయవలెను. బట్టతో వడబోసిన నీటినే త్రాగవలెను. సత్యమని నమ్మినదానినే పలుకవలెను. మనంచేసే పని మంచిదే అని తన మనస్సుకి నచ్చిన పిమ్మటే ఆపని చేయవలెను. తనకు నచ్చనిపనిని చేయరాదు. ఈ సూక్తిలో చెప్పినపనులను చెప్పినట్లే చేయనివారు అనేక అనర్థాలను ఎదుర్కొనవలసివచ్చును. ఎట్లనగా చూడకుండా నడుస్తూన్నప్పుడు ముళ్లు, గాజుపెంకులు వగైరాలు పాదాల్లో దిగి సెలవేసి కొన్నాళ్ళు నడవలేని పరిస్థితి దాపరింపవచ్చు.

ఇక వడబోయని నీరు త్రాగినచో ఆనీటిలోనున్న సూక్ష్మక్రిములు మన కడుపులో ప్రవేశించి అనేక విధాలుగా మన కవి హాని చేయవచ్చును. వడబోసినచో హానినుండి రక్షింపబడుదుము.

ఇక మన మాటకు సత్యము అనేది జీవశక్తిని ఇచ్చునని, "మాటకు ప్రాణము సత్యము" అనే సూక్తి తెలుపును.



ఇక నాల్గవ పాదంలో "ఈపని చేయవచ్చును" అని నిర్మలమైన మన మనస్సు సూచించిన పనినిమాత్రమే మనం చేసినచో అట్టి పనివలన కర్తకు ఏఅనర్థమూ రాదు సరికదా, కార్యసిద్ధితో బాటు సంఘంలో సమధిక గౌరవాదులు కలుగును.

ఇట్టి ధార్మికసూక్తులు ఇంకా కోకొల్లలుగా ఉన్నాయి.

## హి తో ప దే శ ము.

సోదరసోదరీమణులారా !

ఇంతవరకూ స్వధర్మాలను ఆచరించిన మానవులకు ప్రాప్తించగల శాంతిసౌఖ్యపుణ్యగౌరవ ప్రతిష్ఠాది మహాప్రయోజనాలను, అధర్మాత్ములకు కలిగే ఆపదలు కష్టనష్టాదులను తేటతెల్లంచేసిన వేదశాస్త్రపురాణాల ప్రమాణవచనాలను వీనుల విందుగా మీరు విన్నారుకాదూ ! అసలు బాలబాలికలు తమ చిన్ననాడు నేర్చుకున్న అలవాట్లు వారి జీవితకాలం పొడుగునా వారి మనస్సులలో మెలగుతూనే ఉంటాయి. మరి ఆ అలవాట్లు మంచివైతే మంచిపనులనూ, చెడ్డవైతే చెడ్డపనులను అవి మీచేత బలవంతంగా చేయిస్తూ కొన్ని జన్మలవరకూ అవి ఆపనులకు తగిన ఫలితాలను మానవులచేత అనుభవింపజేస్తాయి.

ఎలాగంటే — "మనం ఈ రోజున ఒక విత్తనం పాతినాము" అనుకోండి. ఆవిత్తనం క్రమంగా చెట్టుగా పెరిగి

కొంతకాలం తరువాత, మనం ఎటువంటి గుణంకల (చేదు-తీపి) విత్తనం పాతినామో అటువంటి గుణంకల ఫలాలనే ఆచెట్టు మనకిస్తుంది. అంతేకాని మనం పాతిన చేదువిత్తనంకి బదులుగా తీపిఫలం మనకు కావాలంటే రాదుకదామరి. అదే విధంగా మనం చేసిన చెడ్డపనులకు బదులుగా మంచిఫలితం కావాలన్నా రాదన్నమాట.

ఉదాహరణగా:- బాలబాలికలు తమచిన్నతనంలో- చెడ్డఅలవాట్లను బోధించే చెడ్డనవలలను చదివి దుష్టులతో స్నేహంచేస్తూ తమబాల్యజీవితం గడిపినా రనుకోండి. అట్టి బాలబాలికలకు తమభావిజీవితంలో అశాంతి, అసహనం, క్రోధం, భయం, పిరికితనం, దొంగతనం, అసత్యంవంటి దుర్గుణాలే అబ్బి- అవి అట్టివారికి సంఘంలో ఏవిధంగానూ గౌరవమర్యాదలు లేకుండా చేస్తాయన్నమాట. అంతే కాకుండా ఆదుర్గుణాలు, ఇంకా యువకులకు వారి మానప్రాణధనములకు హానిని కలిగించే పరమశత్రువులుగాకూడా తయారౌతూ అవి కొన్ని జన్మలవరకూ ఆజీవిని పట్టిపీడిస్తాయి; బంగారుజీవితాన్ని మసిబొగ్గుగా మలుస్తాయి.

ఇక చిన్నతనంలో ఉత్తమగురువులవద్దను, తమతల్లిదండ్రులవద్దను ఉత్తమప్రవర్తన, ఉత్తమశీలము, ఉత్తమ విద్యలను సక్రమశిక్షణలో నేర్చుకున్న బాలబాలికల భావి జీవితంలో- వినయం, విశ్వాసం, దేవునియెడల, పెద్దలయెడల భక్తిగౌరవాలు, సహనం, నిశ్చలబుద్ధి, ధైర్యం, బుద్ధివికాసం,



మంచిపనులు చేయడంలో ధైర్యసాహసాలు, ఉత్సాహం, ముఖ్యంగా-

## వసుధైకకుటుంబకభావం.

వసుధైకకుటుంబకభావంవంటి ఉజ్వలోదాత్తమ సుగుణాలు ఏర్పడి ఆసుగుణాలు కల బాలబాలికలను అచిర భావిలో, అవి శివాజీవంటి వీరపురుషులుగాను, పటేల్‌వంటి ఉక్కు-మనుషులుగాను, రాధాకృష్ణపండితునివంటి తత్త్వవేత్తలుగాను, అమరజీవి, లాల్‌బహదూర్‌శాస్త్రివంటి త్యాగమూర్తులుగాను, ఉత్తమదేశభక్తులుగాను, స్త్రీలలో సీతా అనసూయలవంటి పతివ్రతామతల్లులుగాను, రుద్రమదేవి వంటి వీరనారీమణులుగాను తీర్చిదిద్దుతాయి.

అట్టి ఆదర్శస్త్రీపురుషులు కల సంఘం, అట్టి సంఘం కల దేశం సర్వవిధాలా ఉత్తమశక్తిసామర్థ్యాలతోను, ఉత్తమ కీర్తిప్రతిష్ఠలతోను తులతూగుతూ తోటిదేశాలకు తలమానికమౌతుంది.

కనుక బాలబాలికలారా! మీదచెప్పిన ఉత్తమభారత పౌరుల లక్షణాలు మీలో స్థిరపడాలనుకొంటే, మీబాల్యం లోనే మీరుఉత్తమమైన నైతికసాంఘికధార్మికవిషయాలను ఉత్తమగురువులనుండి, ఉత్తమగ్రంథాలనుండి (విని) శ్రద్ధగా నేర్చుకోవాలి. ముఖ్యంగా మీరు వివేకానంద, రామకృష్ణ పరమహంసల వంటి మహాపురుషుల జీవితచరిత్రలను శ్రద్ధగా ఏకాగ్రబుద్ధితో చదివి మీమనస్సులలో హత్తింపజేసుకొని,

వారి జీవితసన్నివేశాలను మీనిత్యజీవితసన్నివేశాలతో సమన్వయించుకోవాలి; అలా ఆచరించాలి. అప్పుడే మీరు "ఆదర్శపురుషులు" అనిపించుకుంటారు. మీకారణంగా మీపవిత్రభారతదేశమూ, మీరూ సర్వవిధ సౌభాగ్యాలతోను, సర్వవిధకీర్తిప్రతిష్ఠలతోను, భోగభాగ్యాలతోను తులతూగుతూంటారు.

అట్టి దేశీయాభ్యుదయలాభాన్ని మీరు సంపాదించినప్పుడే మీజీవితం మీతోటివారికి, తోటిదేశాలకు ఆదర్శవంతమై ధన్యమౌతుంది. అప్పుడే మీమానవత్వంలో మాధవత్వం సుప్రతిష్ఠిత మౌతుంది. అప్పుడు మీమానవలోకం మాధవలోకంగా పరిణమిస్తుంది.

"సర్వస్య సద్భావనాఽస్తు, విశ్వస్య కళ్యాణమస్తు"
"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"
సర్వం శ్రీనివాసార్పణ మస్తు.
ఇది ధర్మప్రకరణము
సంపూర్ణం.

---

[8]

# సంస్కృతిప్రకరణము.

## సంస్కృతి-సంస్కృతము.

మానవుల దైనందినజీవితంలో- వారి నైతికప్రవర్తనము, వారిఆచారవ్యవహారాలు, ఉదారోత్తమభావాలు, వారి సంప్రదాయాలు, నడవడికలోని తీరుతెన్నులు ఇవన్నీ కలిసి 'సంస్కృతి' అనిపించుకుంటాయి.

ఏదేశీయుల 'సంస్కృతి' వారి మనస్సులకు ఉత్తమ సంస్కారాలు అనగా పరోపకారం, మానవసేవవంటి ఉదార భావాలు కలిగించి వారి జీవితధ్యేయాలను ఉత్తమలక్ష్యాలు కలవానినిగా తీర్చి దిద్దగలదో, తోటి దేశాలకు నైతికవైజ్ఞానిక ధార్మికభిక్ష పెట్టగలదో- అట్టి సంస్కృతే ఉత్తమోత్తమమైన దని విజ్ఞుల నిర్ణయం. ఇట్టి సంస్కృతికి పుట్టినిల్లు "సంస్కృతం."

ఈసంస్కృతం, మానవుల దైనందినజీవితాలను పరోపకారప్రవణమైనవిగాను లోకశ్రేయస్సంపాదకమైనవిగాను, సంస్కారవంతములుగాను మలిచి తీర్చిదిద్దగలిగి ఉంది. సంస్కృతభాషాలక్ష్యం ఎంతటి ఉన్నతభావాలు కలదో, ఎంతటి లోకక్షేమసంపాదనధ్యేయం కలదో తెలుసుకొనడానికి, ఈక్రింది సంస్కృతసూక్తిద్వయం చాలు. సంస్కృతభాషను తన జీవితంలో జీర్ణింపజేసుకొన్నవాడు ఇలా అంటున్నాడు. అతడి జీవితలక్ష్య మిది.

"అందరు సుఖంగా జీవించవలెను; అందరు శారీరకంగాను, మానసికంగాను ఆరోగ్యవంతులుగా ఉండవలెను. అందరు మంగళములను చూడవలెను. ఏఒక్కనికీ దుఃఖం లేకుండుగాక!" ఈభావాలకు మూలమైన శ్లోకమిది-

"సర్వేఽత్ర సుఖిన స్సంతు, సర్వే సంతు నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యంతు, మా కశ్చి ద్దుఃఖభా గ్భవేత్ ॥"

ఇంకా ఈసంస్కృతభాషామతల్లి తనసంతానంయొక్క భావాలను ఇంతటి మహోన్నతభావభాసితాలుగా పలుస్తుంది.

"నేను సామ్రాజ్యభోగాలను కోరను; ఐహలౌకికభోగాలనుగాని, ఐహలౌకికసుఖాలనుగాని కోరను. ఇంక నేను మానసికంగా కోరేదల్లా ఏదంటే—

"దుఃఖాలతో బాధపడుతూన్న ప్రాణులయొక్క దుఃఖాలను దూరంచేసి వారికి 'శాంతి'ని చేకూర్చడం" అనేదే.

"న త్వహం కామయే రాజ్యం, న భోగాన్ న సుఖాని చ।
కామయే దుఃఖతప్తానాం, జీవినాం ఆర్తినాశనమ్ ॥"

ఇట్టి ఉదారభావాలుకల మానవులే "మహాత్ములు" అనిపించుకొంటారు. (శ్రీ) పొట్టి (శ్రీ)రాములు, (శ్రీ) లాల్ బహాదూరుశాస్త్రి వంటి మహాత్ములు దేశనాయకులుగా ఎన్నుకొనబడినకారణంగా అట్టి దేశంయొక్క భావి ఏవిధంగా ఉంటుందో భారతదేశీయులు కొంత చవిచూసిఉన్నవారే కనుక అట్టివారి లక్ష్యాలను ఊహించుకోవచ్చు.



ఇంతటి మహోజ్జ్వలభావాలను మానవులకు ప్రసాదించేది కనుకనే ఈసంస్కృతం అఖిలప్రపంచంలో అంతటి వ్యాప్తిని పొందగలిగింది.

## విశ్వంలో విశ్వభాషయొక్క విశిష్టస్థానం.

ఇంతటి లోకక్షేమాన్ని సాధించిందికనుకనే సంస్కృతము నాటికీ నేటికీకూడా నాగరికదేశా లనిపించుకొన్న అన్ని దేశాలలో 'విశ్వభాష'గా ప్రసిద్ధికెక్కింది.

1. 'రూస్' దేశపండితుడైన "లూయీరేణు" అనే మహాశయుడు ఒకసభలో సంస్కృతాన్నిగూర్చి అన్నమాటలివి—

"ఏశియాయాః అనేక దేశానాంభాషాః సంస్కృతశబ్దాన్ వహంతి" అనగా ఆసియాఖండంలోగల అనేకదేశాలభాషల్లో సంస్కృతశబ్దాలు కనిపిస్తున్నాయి. ఇంగ్లండుదేశంలోగల "లేటిన్" భాషాపదాలతోటాకు మూలపదాలు, అనగా ఆంగ్లభాషకు మూలమైన లేటిన్ భాషాపదాలకుకూడా వాని మూలపదాలు సంస్కృతంలో ఇలా ఉన్నాయన్నమాట.

| సంస్కృతమూలపదాలు. | లేటిన్ | ఇంగ్లీషు |
|---|---|---|
| మాతృ | మాటర్ | మదర్ |
| పితృ | పిటర్ | ఫాదర్ |
| భ్రాతృ | భ్రాటర్ | బ్రదర్ |
| దుహితృ | దిహితర్ | డాటర్ |

ఇట్టి పోలికపదాలు సంస్కృతంలో ఇంకా చాలా ఉన్నాయి. ఇక సంస్కృతంలోని మూలపదాలు ఆయా దేశీయుల ఉచ్చారణలో మార్పులు చెందుతూ క్రమంగా ఇంగ్లీషులోనికి వచ్చి నిలిచి ఉన్న పరిణామాన్ని, ఈసంస్కృత మూలపదాలు ఇలా ఋజువుచేయగలిగి ఉన్నాయి.

1. 'సాయకీలః' ఈ సంస్కృత మూలపదానికి వ్యుత్పత్త్యర్థం- 'అయః కీలైః సహితః' అని ఉంటుంది. అనగా ఇనుపకడ్డీలతో కూడినది అని అర్థం. ఈసాయకీల పదమే సాయకిల్ అని మార్పుచెంది ఇంగ్లీషులో 'సైకిల్'గా నిలిచినది. ఇంకా ఇట్టి పదా లెన్నో ఉన్నాయి.

2. "ఫలావరః" అనే మూలపదానికి, 'ఫలం అవరం యస్మాత్' అని అవయవార్థం. అనగా పువ్వుకి క్రిందిభాగంలో కాయ తయారై అదే క్రమంగా ఫలంగా పరిణామం చెందుతుంది- అని అర్థం. ఈమూలపదం 'ఫలావర్' అని, "ఫల్‌వర్" అని మార్పులుచెంది ఆఖరికి "ఫ్లవర్" అని ఇంగ్లీషులో నిలిచింది.

3. ఇట్లే 'కలాకః' అనే సంస్కృత మూలపదానికి, ధ్వనిరూపంలో సమయాన్ని తెలిపేది అని అర్థం. ("కై శబ్దే" అని ధాతువు.) ఈ మూలపదం "కలాక్" అనే మార్పుతో "క్లాక్"గా ఇంగ్లీషుపదంగా నిలిచింది. ఈవిధంగా ఇతరభాషా పదాలకు మూలమైన పదా లెన్నో సంస్కృతభాషలో ఉండడాన్ని అనగా సంస్కృతానికి గల అంతర్జాతీయమహాత్వాన్ని తెలుసుకొని కొలంబియా, షికాగో, వాషింగ్టన్ యూనివర్సి



టీలలో భాషాశాస్త్రంపై పరిశోధన (రిసర్చి) చేస్తున్న పండితులు ఒకనిర్ణయానికి వచ్చి ఇలా అన్నారు.

" న కేవలం ఏశియాయా ఏవ, ప్రత్యుత సమగ్రస్యాపి యూరోపస్య భాషాజిజ్ఞాసూనాం ,సంస్కృతవాచోనుశీలన మావశ్యకం । యతః, సంస్కృతేన సహ సర్వాసాం భాషాణాం నికటతమస్సంపర్కః"

అంటే ఒక్క ఆసియాదేశాలలోని భాషలకేకాక, మొత్తంయూరప్‌దేశంలోగల అన్నిభాషలయొక్క పదాల స్వరూపస్వభావాలు తెలుసుకొనగోరినవారికి ముందుగా సంస్కృతవాక్యాల స్వరూపస్వభావాలను పరిశీలించడం అనేది అవసరం. ఎందుకనగా, అన్ని భాషలకు సంస్కృతంతో దగ్గర సంబంధం ఉందికనుక. ("రిపోర్టర్"లో).

అమెరికానుంచి వచ్చిన "మీనార్డు" పండితుడు "అమెరికా కాంగ్రెస్‌గ్రంథాలయం"లో ఆరువేల ఏడువందల సంస్కృతలిఖితగ్రంథా లున్నట్లు తెలిపినాడు.

ఇట్లే జర్మనీ యూనివర్సిటీలో 'మహామహోపాధ్యాయ' బిరుదం పొందిన డా॥ "ఆల్డ్‌డోర్ఫ్" పండితుడు "జర్మన్యాం సంస్కృతాధ్యయనం" అనే అంశాన్నిగూర్చి అన్నమాటలివి.

"జర్మన్యాం కశ్చిదేకః పండితః (గొథే) కాళిదాసీయం శాకుంతలం స్వశిరసి సంస్థాప్య పరవశస్సన్ యది నృత్యతి, అన్యః పండితః ఉపనిషత్పారాయణేన బ్రహ్మానందం ప్రాప్నోతి। ఏవమేవ అత్రత్యః అన్యః పండితః మనుధర్మశాస్త్రపఠనేన చిత్తశాంతి ముపలబ్ధుకామశ్చేత్, అన్యః పండితః యోగశాస్త్రాభ్యాసేన దీర్ఘాయుష్యం లిప్సతే...."

అనగా- "జర్మనీ దేశంలో తరచుగా ఆయా ప్రదేశాలలో ఒక పండితుడు (గోథేమహాశయుడు) కాళిదాసకవీంద్రుని శాకుంతలనాటకాన్ని తనశిరస్సుపై పెట్టుకొని శరీరం మరచి పరవశంతో నాట్యంచేస్తూండగా ఇంకొక జర్మన్ దేశ పండితుడు ఉజ్జ్వలోదార భావభరితమైన ఉపనిషత్ పారాయణంతో బ్రహ్మానందాన్ని పొందుతూంటాడు. అటులనే ఆ దేశంలో మరోచోట ఉన్న మరో పండితుడు మనుస్మృతి పఠనంచేత మనశ్శాంతిని పొందగోరినపుడు, అక్కడి మరో పండితుడు పతంజలిమహర్షి రచించిన యోగశాస్త్రాన్ని అభ్యసించి దాని ప్రభావంతో దీర్ఘాయుర్దాయాన్ని పొందగోరుతాడు." ఇవీ, జర్మనీ దేశంలోని "సంస్కృతాధ్యయనం" యొక్క తీరుతెన్నులు.

ఇక "లూయీరేణు" అనే పండితుడు భారతదేశాన్నుంచి స్వదేశానికి వెడుతూ, "సంస్కృతం మృతభాష" అన్నవారిని ఉద్దేశించి అన్నమాట లివి- "నేను ఒకేఒక దుఃఖంతో భారతంనుంచి స్వదేశానికి వెడుతున్నాను. మేము పుట్టుకచేత యూరోపియన్లము ఐనా, ఏ అమృత (మృతం లేని) భాషను ఆధారంగాచేసుకొని భాషావిషయకపరిశోధనలు గావింపగల్గుచున్నామో, అమృతలక్షణలక్షితమైన ఆభాషనే భారతీయులుకొందరు 'మృతభాష' అంటున్నారు. భారతీయుల మరో దౌర్భాగ్యానికి నిదర్శన మేమిటంటే, ఆదేశంలోని విద్యాశాఖాధికారులకుకూడా సంస్కృతం రాదు ..." ఈమాటలకు చెందిన మూలవాక్యాలివి-



"అహం ఏకమేవ దుఃఖ మాదాయ భారతా త్స్వదేశం గచ్ఛామి। యద్వయం యూరోపియాస్తు యాం భాషాం అమృతభాషాం మత్వా సమనుశీలయామః। తామేవ భారతీయాః 'మృతాం' ఆచక్షతే। భారతీయానా మిద మపరం దౌర్భాగ్యం య, త్తేషాం శిక్షాసచివోఽపి సంస్కృతం న జానాతి...."

ఇక జర్మన్ దేశీయుడైన మేక్స్‌ముల్లర్ పండితుడు, స్వదేశీయమైన తన పేరును, తన మాతృదేశంయొక్క పేరును, తనకు ఉన్నత విద్యను ప్రసాదించిన తన యూనివర్సిటీ పేరును సంస్కృతీకరించి, తన "ఋగ్వేదభాష్యపరిశోధనవ్యాసాంతం"లో ఇలా చక్కని సంస్కృతశ్లోకం రచించినాడు. అది ఇది-

"శార్మణ్యదేశజాతేన, గోతీర్థపురవాసినా ।
మోక్షమూలరభట్టేన, భాష్య మేత ద్విశోధితమ్ ॥"

1. శార్మణ్యదేశజాతేన= జర్మనీదేశంలో పుట్టినవాడును,
                    గో, తీర్థ, పుర
2. గో, తీర్థ, పుర, వాసినా = ఆక్స్, ఫోర్డ్, యూనివర్సిటీలో చదివినవాడును,
3. మోక్షమూలరభట్టేన = 'మేక్స్‌ముల్లర్' అనే పేరుకలవాడును ఐనవానిచే,
4. ఏత ద్భాష్యం విశోధితం=ఈభాష్యం ఎడిట్‌చేయబడింది. అనగా ఈ భట్టు ఋగ్వేదభాష్యాన్ని పరిశోధించినాడన్నమాట.

జర్మన్‌భాషాశాస్త్రవేత్త ఐన ఈమేక్స్‌ముల్లర్ పండితుడు ఇంకా, 'ప్రాచ్యలోకంలోని పవిత్రగ్రంథాలు' అనే

అపూర్వగ్రంథమాలను స్థాపించి ఆగ్రంథమాల పేరిట మన శ్రుతిస్మృతిపురాణగ్రంథాల్లో ఉన్న విశిష్టతను జర్మన్ భాషలోనికి అనువాదంచేసి, 51 పెద్దసంపుటాల ప్రకటనతో పాశ్చాత్యలోకానికి కనువిప్పుగావించిన పుణ్యంకట్టుకొన్నా డీముల్లర్ పండితుడు.

ఈవిధంగా గొప్ప నాగరికత, విజ్ఞానము కల జర్మన్ దేశపండితుల మనస్సులనుకూడా ఇట్లు ఆకట్టుకొన్న యీ సంస్కృతంయొక్క ప్రత్యేకప్రభావం. ఇట్టి ప్రపంచప్రశస్తులకు పాత్రమైనదే.

ఇక మానవులదైనందినజీవితంలో వారికి అడుగడుగునా అవసరమైన నైతిక ధార్మిక సూత్రాదుల ఆవశ్యకత, చరక శుశ్రుతగ్రంథాలలోని ఆరోగ్యసూత్రాల ప్రబోధం, "మానవుడు పుట్టింది మొదలుకొని గిట్టేవరకు అతడికి సంస్కృతంతో గల గట్టిసంబంధంవంటి ప్రత్యేకప్రయోజనాలు, సంస్కృత భాషయొక్క- ప్రత్యేకతను సర్వకాలాలలో ప్రకాశింపజేస్తూనే ఉంటాయి.

వేదవాఙ్మయరూపంలో యుగయుగాలనుంచీ అవిచ్ఛిన్నంగా అభివృద్ధిచెందుతూ వస్తూన్న ఈ "సంస్కృతభాష" ఒక్కటే- భారతసంస్కృతిలో ప్రత్యేకంగా ప్రకాశిస్తూన్న "గురుత్వ మహత్వ పటుత్వ ప్రాభవములను" ప్రపంచంలో చాటుతూ-మానవలోకాన్ని మాధవలోకంగా మలచడంలో సర్వసమర్థమై ఉందనడంలోసందేహంలేదు. ఈసంస్కృతంలో



ఉన్న చక్కందనాలు, మెత్తందనాలు, తియ్యందనాలు మరోభాషలో మీరు చూపగలరా ?

**భారతీయభౌతికతత్త్వంపై ఆధ్యాత్మికతత్త్వప్రభావం.**

మానవునికి "మర్త్యుడ"నీ, మానవలోకానికి 'మర్త్య' లోకం అనీ పర్యాయపదా లున్నాయి. 'మర్త్యుడు' అనగా ఎప్పుడో ఒకప్పుడు మరణం కలవాడని అర్థం. 'మృజ్' 'మరణే' అనే ధాతువునుంచి 'మర్త్య' శబ్దం పుట్టింది. ఈ విధంగా మరణశీలంకల మానవుని విషయంలో శ్రీకృష్ణపరమాత్మ "ఓపార్థా! ఈయుద్ధరంగంలో ఉన్నవారందరము నిత్యంగా ఇలా ఉండేవారమే" అని అంటాడు. A

ఇలా అనడంలో ఒక పరమార్థం ఉంది. ప్రతీ ఒక జీవి హృదయంలోను ఉన్న- నాశరహితమైన 'ఆత్మ' 'దేహము' అనే ఈరెండూ భౌతికదృష్టిలో ఒక్కటేకాని వేరుకాదు. ఇట్టి ఆత్మను శరీరాన్ని కలిపి మొత్తంమీద 'నేను' 'మేము' అంటాంగనుక, నిత్యమైన ఆత్మతో, అనిత్యమైన శరీరాలను కలిపి శ్రీకృష్ణపరమాత్మ "మనమందరము నిత్యులము" అని గీతలో అన్నమాటలోని పరమార్థం. ఇంకా ఒక్కొక్కప్పుడు మనం మన గుండెకాయమీద వేలుపెట్టి ('పరమాత్మ' ఉన్న కేంద్రాన్ని చూపుతూ) "చూడు నామజా" అన్నప్పుడు 'నా' (నేను) పదానికి 'పరమాత్మ' అనే అర్థం ఉన్నట్లు-

---

A గీత_2_12

"నాఽహం దేహః... సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహం" అనే ఆదిశంకరులసూక్తి ఋజువుచేస్తోంది.

ఒకప్పుడు చికాగోదేశం వెళ్ళిన వివేకానందస్వామి ఒకమహాసభలో ఉన్నవారందరిని "ఆత్మస్వరూపులారా!" అని సంబోధించి తద్ద్వారా- మనభారతీయభౌతికతత్త్వంలో గూఢంగా ఉన్న "ఆధ్యాత్మికతత్త్వాన్ని" అద్భుతంగా ఆదేశీయుల అంతరంగాల్లో మెరయించాడు. ఈవిధంగా- "మానవత్వంలో మాధవత్వాన్ని" సందర్శించే భాగ్యం ఒక్క భారతీయసంస్కృతికే పరిమితమయింది. ఈపరమార్థవిషయాలను, మనలో ఉన్న 'నాడీచక్రమండలం' కూడా ఋజువు చేయగలిగి ఉంది.

## మనలోని నాడులు - వానిస్వరూపస్వభావాలు.

మన 'వెన్నెముక' దగ్గర మూడునాడు లున్నాయి. ఆనాడులను- "ఇడానాడి, పింగళానాడి, సుషుమ్నానాడి" అనే పేర్లతో మనపెద్దలు వ్యవహరించారు. ఈమూడింటిలో "ఇడానాడి" గంగానది (వంటిది) అనీ, 'పింగళానాడి' యమునానది అనీ, ఈ రెండింటికీ మధ్యన ఉన్న "సుషుమ్నానాడి" సరస్వతీనది అనీ ఈక్రింది స్మృతిప్రమాణం ఇలా నిరూపించింది-

"ఇడా భాగీరథీ గంగా, పింగళా యమునానదీ ।
తయో ర్మధ్యగతా నాడీ, సుషుమ్నా చ సరస్వతీ ॥
ఏవం జ్ఞానహ్రదే తీర్థే రాగద్వేషమలాఽపహే ।
యః స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిం ॥"



మీది స్మృతిసూక్తిలో- ఇడాపింగళాసుషుమ్నా నాడుల కలయిక, "జ్ఞానహ్రదము" అనే పవిత్రమైన పేరుకల పుణ్యతీర్థంవంటి దౌతుందనీ, ఆతీర్థం, మానవులలోని రాగద్వేషములు అనే పాపరూపమాలిన్యాలను పోగొడుతుందనీ, అట్టి—

"మానసతీర్థంలో" స్నానం చేసినవాడు మోక్షమార్గాన్ని చేరుకోంటాడనీకూడా మీది సూక్తివలన తెలుస్తోంది. దీనినిబట్టి పాంచభౌతికమైన మనశరీరం 'మానసతీర్థం' గా పరిణమించి అట్టితీర్థం మానవుణ్ణి మోక్షలక్ష్మీపదాన్ని చేర్చడమనేది, మన "భారతీయభౌతికతత్త్వంపై ఆధ్యాత్మికతత్త్వప్రభావం" కాక మరేమౌతుంది ? ఇట్టి ప్రభావప్రాప్తికి మానవుని చిత్తశుద్ధి- అనగా 'వినిర్మలవిశుద్ధభావన' అనేదే ప్రధానసాధన మౌతుందనే విశిష్టవిషయం విస్మరింపరానిది.

## 'సుషుమ్నా'నాడి ప్రత్యేకత - మోక్షప్రాప్తి.

మూడు నాడులలోకి ముఖ్యమైన "సుషుమ్నా" నాడి 'మేరుదండము' అనబడే వెన్నెముకదగ్గర ఉండి అది, చంద్రసూర్యాఽగ్నులరూపంతో సర్వతేజోమయంగా దీపిస్తూ ఉంటుందని దేవీభాగవతసూక్తి ఇలా తెలిపింది-

"ప్రధానా మేరుదండేఽత్ర చంద్రసూర్యాగ్నిరూపిణీ ।
సర్వతేజోమయీ సా తు సుషుమ్నానాడి రుచ్యతే ॥"
(దేవీభాగ - స్కం 7 అధ్యా 35)

ఈ 'సుషుమ్న' నాడి మానవుని గుదస్థానంలోని మూలాధారచక్రంనుంచి "సహస్రారచక్రం" (శిరస్సులోది) వరకూ పయనం సాగిస్తూన్నప్పుడు, ఆనాడి జీవునితో కలిసి, "సహస్రారచక్రం"లో ఉన్న "పరమాత్మ" వరకుం పయనిస్తుంది. ఈపరమాత్మే మన శరీరాన్నంతటినీ ప్రకాశింపజేస్తూంటాడు.

అట్టి ఆపరమాత్మ స్థానాన్ని మానవుని సుషుమ్న నాడి చేరుకొనడం అనే పరిణతినే 'మోక్ష' మంటారని, 'తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి' అనే ఉపనిషద్వాక్యం వ్యక్తంచేసింది. అట్టి ఈముఖ్యనాడియందే ప్రాణము, జఠరాగ్ని, బిందునాదములు ఉంటాయి. ఇంకా ఈనాడి పద్మంలో ఉన్న సన్ననిదారంవలె బాగా పొడవుగా ఉండి పైభాగానికి ప్రసరిస్తూ, మెరుపువలె మెరుస్తూ, "బ్రహ్మనాడి" అనే పేరుతో మానవుల బ్రహ్మపదప్రాప్తికి (మోక్షానికి) పరమసాధనమౌతుందని ఈక్రిందిస్మృతిసూక్తి ఇలా తెలిపింది-

"కందమధ్యే స్థితా నాడీ 'సుషుమ్నా' సుప్రతిష్ఠితా।
పద్మసూత్రప్రతీకాశా ఋజు రూర్ధ్వప్రవృత్తినీ ॥
బ్రహ్మణో వివరం యావ ద్విద్యు దాభాసనాలకం।
వైష్ణవీ 'బ్రహ్మనాడీ' చ నిర్వాణప్రాప్తిపద్ధతిః ॥"



మనలో ఉన్న "షట్చక్రాల A స్థానంలో 72 వేల చిన్న నాడులు పుడుతున్నాయి. మన రోజువారీపనులు సక్రమంగానూ, విజయవంతముగానూ సాగడానికి ఆ 72 వేల నాడులే మూలమౌతున్నాయి. ఇట్లు సుషుమ్ననాడిని ఆధారంచేసుకొని పరమపదాన్ని చేరుకోవడం అనే పరమ పవిత్రప్రక్రియను మనం అలవర్చుకొని ఆచరించిననాడు ఇదంతా- "భారతీయ భౌతికతత్త్వంపై ఆధ్యాత్మికతత్త్వ ప్రభావమే" అనకుండా ఉండలేం.

ఇక మనలోని మూడునాడులు మూడుముఖ్యనదులకు ప్రతినిధులై కోటినదులుగా మారి మనశరీరాన్ని పుణ్యక్షేత్రంగా మలచినరీతిని, శ్రీత్యాగరాజస్వామి తనకీర్తనలలో ఇలా చిత్రించినారు.

"కోటినదులు ధనుష్కోటిలో నుండగ ఏటికి తిరిగెదవే మనసా ?"

ఈకీర్తనలోని పరమార్థం ఇది- ధనుస్సు యొక్క కోటి అనగా చివరిభాగం 'ధనుష్కోటి' అనబడుతుంది. ఇట్టి వెన్నెముక

---

A "ఆధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, చక్రాలను" 'షట్చక్రాలు' అంటారు. మన ఆధార చక్రంలో నిద్రిస్తూన్న 'కుండలినీశక్తి'ని యోగులు మేల్కొల్పి పైకి ప్రయాణంచేయించడంతో 'కుండలినీయోగం' ప్రారంభమౌతుంది. ముఖ్యమైన "సుషుమ్న" నాడి యందే ఈ కుండలినీమహాశక్తి ఉంది. (చూ 85 డిశంబర్ 'సప్తగిరి'లో "క్షీరసాగరమథనం-కుండలినీశక్తి" — శ్రీ డి. [illegible]).

యొక్క ప్రక్క భాగాలలో ఉన్న 3 నాడులు, ముఖ్యాలైన గంగాయమునాసరస్వతీనదులవంటివిగాన, ఆ 3 నదులూ అన్ని నదులకు సమానం. అనగా ఈ 3 నాడులున్నచోట కోటినదులున్నట్లే అర్థం.

ఈవిధంగా "ధనుష్కోటిలో కోటినదులూ ఉన్నప్పుడు అపవిత్రతీర్థంలో సంచరించక ఓచిత్తమా! నీచిత్తంవచ్చినట్లు ఎక్కడెక్కడికో యెందుకలాతిరుగుతావు? "ఏటికి తిరిగెదవే మనసా ?" అని శ్రీత్యాగరాజస్వామి భౌతికంగా ఉన్న తన మనస్సును ఆధ్యాత్మికభావంవైపు మరలిస్తూన్నట్లు ఈకీర్తన (ఈత్యాగోపనిషత్) తెలుపుతూంది. ఇట్లు భారతీయభౌతిక జీవితంతో ఆధ్యాత్మికజీవితం చక్కగా సమ్మేళనం చెందిన సరససన్నివేశాలెన్నో మన సంస్కృతిలో ఉన్నాయి.

## మన క్రియలలోని ఆధ్యాత్మిక ప్రకాశ.

మనం లేచిందిమొదలు పరుండేవరకూ శారీరకంగానూ, మానసికంగానూ ఎన్నోపనులూ, భావనలూ చేస్తూంటాం. అవన్నీ మనసంసారానికి సొంతలాభాలకు చెందినపనులుగానే ఉన్నాయి. అసలు "భౌతికము- ఆధ్యాత్మికము" అన్నది మానవుని భావనలో ఉందికాని వస్తువులలో లేదు. ఎలాగంటే రోజూ మనం చాలాదూరం నడుస్తూంటాం కదా! ఆ నడక, మన "సొంతపనులు నెరవేర్చుకొనడంకోసమే ఉద్దేశింపబడింది" అనే భౌతికభావనతో మాత్రమే చేసినపుడు అట్టి స్వార్థపూరిత క్రియలవలన కర్తకు చివరకు



మిగిలేది శ్రమ, కష్టనష్టాదులు మాత్రమే. ఈ సత్యాన్ని నిరూపిస్తూ కృష్ణపరమాత్మ తనగీతలో-

"యే హి సంస్పర్శజా భోగాః, దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ ! న తేషు రమతే బుధః ॥"

(గీత- 5-22)

అని అన్నియుగాలకు ఉపయోగించే ఉ[illegible] "సత్యాన్ని" సంప్రకాశితం చేశాడు. అనగా 'భౌతికసుఖాలు బాగా అనుభవించాలి' అనే స్వార్థదృష్టితో చేసేపనుల తాలూకు ఫలితాలు చివరకు దుఃఖాలనే కలిగిస్తాయి. ఇంకా ఈ భోగాలు కొంతకాలమే ఉండి తరువాత నశిస్తాయి. కనుక అట్టి క్షణికభోగాల కోసం, 'పండితుడు' A అనిపించుకొన్నవాడు ప్రాకులాడడు.

ఈపరమార్థాన్నే భర్తృహరిమహాకవి తన 'సుభాషిత త్రిశతి'లో ఇలా తెలిపినాడు.

"భోగా న భుక్తా వయమేవ భుక్తాః .... ।
ఆశా న జీర్ణా వయ మేవ జీర్ణాః"

అనగా "మేము భౌతిక భోగాలను ఆసక్తితో అనంతకాలం అనుభవించాలని వాటి సంపాదనకోసం నానా యాతనలు అనుభవించామేకాని పట్టుమని ఆభోగాలను మాత్రం అనుభవించలేకపోయాము. చివరకు ఆభోగాలే మా జీవితాలను పూర్తిగా భుక్తం చేశాయి". కనుక స్వార్థభరిత భౌతిక భావనలతో మాత్రమే చేసేపనులవలన దుఃఖం మాత్రమే మిగులుతుంది.

---

A "పండా, బ్రహ్మవిషయకా బుద్ధిః అస్య సంజాతా పండితః"

ఇక మన సొంతఉపయోగంకోసం కాకుండా 'నడక' అనే ఆభౌతికక్రియను పరమేశ్వరునకు చేసే ప్రదక్షిణరూప క్రియగా మనం భావించగలిగినప్పుడు, అట్టి పనివలన మనకు ఏవిధమైన శ్రమకాని కష్టనష్టాలుకాని కలుగవుసరికదా పైపెచ్చు, ఆనందం, సంతోషం, పుణ్యంవంటివే మిగుల్తాయి. ఇదే పద్ధతిలో మన భౌతికదైనందిన జీవితంలో చేసే పనులూ, చెప్పేమాటలూ, భావించే భావనలూ 'ఇవన్నీ పరమేశ్వరుని ఆరాధనక్రియలుగాపరిణమించవలెను.' అనేపరమార్థభావనతో మనం (మన పనులను) చేయగలిగిననాడు, మన భౌతికక్రియలన్నీ ఆధ్యాత్మికక్రియలుగా మారిపోయి,అవి పరమేశ్వరానుగ్రహసంపాదనకు చక్కని సాధనము లౌతాయి. ఈసత్యవిషయాన్ని ఒకమహాకవి ఎంతసూటిగా చెప్పినాడో గమనించండి.

"ఆత్మా త్వం గిరిజా మతిః, సహచరాః ప్రాణాః శరీరం గృహం,
పూజా తే విషయోపభోగరచనా, నిద్రా సమాధిస్థితిః ।
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః, స్తోత్రాణి సర్వా గిరః,
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం ॥"

అనగా ఓపరమేశ్వరా! శంభో! నాలో ఉన్న 'ఆత్మ' నీయొక్క అంశం. ఇట్లే నాలోని 'బుద్ధి', శక్తిస్వరూపిణి ఐన గిరిజాదేవి నాలోని. 'ప్రాణాలు' నా ఉత్తమస్నేహితులు. నా 'శరీరం' నీపూజాగృహం. నా 'భోగానుభవజనితతృప్తి' నీకు చేసే పూజావిధానం. నేను అన్నీ మరచి హాయిగాపొందే 'నిద్ర', 'నాపరమభక్తి' జనిత 'సమాధి' స్థితి. ప్రతీరోజూ



నడిచే నా 'నడక' అంతా ప్రపంచస్వరూపుడవైన నీకు చేసే 'ప్రదక్షిణ'క్రియ. ఇట్లే నేను మాట్లాడే మాటలన్నీ నీకు చెందిన 'స్తోత్రవచనాలు'. ఈవిధంగా నేను పగలంతా చేసే పనులన్నీ నీవిషయంలో చేసే 'ఆరాధనక్రియలు'గా పరిణమించుగాక.

దీనినిబట్టి, ఆధ్యాత్మికభావనాప్రభావసంపన్నులైన భవ్యభారతీయుల భౌతికజీవితవాహిని అంతా వారిఆధ్యాత్మిక భావసాగరంలోనికి ప్రవహించి అందే అది సంగమిస్తుందని ఋజువుచేయబడింది.

ఇట్లే మనం ప్రతీరోజూ చేసే 'భోజనక్రియ', లౌకికదృష్టిలో "భౌతికక్రియే" ఔతుంది. కాని పరమార్థదృష్టికి ఆక్రియకూడా ఆధ్యాత్మికక్రియగా పరిణమిస్తుంది. ఎలాగంటారా ? శ్రీకృష్ణపరమాత్మ తన గీతలో అన్నాడుకదా !

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధం ॥"
(గీత 15-14)

"నేను ప్రతీప్రాణిశరీరంలోను 'వైశ్వానరాగ్ని' అనే పేరుతో ఉండి ఆప్రాణులు ఆరగించే అన్నిరకాల ఆహారాన్ని అరిగిస్తూంటాను" అన్నాడు.

ఇక మనం అన్నం తినడానికి ముందుగా అయిదుసార్లు నోట్లో వేసుకొనే మెతుకులను "ఆహుతులు" అంటారు. 'ఆహుతి' అనగా మరోఅర్థం, అగ్నిలో హోమంచేయదగిన

"ఆజ్యపురోడాశాదిద్రవ్యాలు" అనికూడా అర్థం ఉంది. కనుక మనశరీరంలో ఉన్న 'వైశ్వానర'నామక'అగ్ని'లో, 'అన్నం' అనే ద్రవ్యాన్ని మనం రోజూ హోమం చేస్తూన్నట్లౌతుంది. అంటే, "అన్నం ఆరగించడం" అనే మన భౌతికక్రియాచరణం ద్వారా మనం, అగ్నిలో హోమద్రవ్యాలను హోమంచేయుత మనే పవిత్ర "యజ్ఞక్రియను" ఆచరిస్తూన్నట్లే అర్థంకదా ! ఈవిధంగా మనభావం, పరమార్థభావనకు తగిన పవిత్రపరిణతిని పొందినప్పుడుమాత్రమే ఇట్టి పరమార్థసిద్ధి కలుగుతుందని చెప్పకతప్పదు.

## మన ప్రబంధాలలోని ఆధ్యాత్మిక భావాలు.

భారతీయుల జీవనధార అంతా పవిత్రసంస్కారాలతో పవిత్రవంతము, సంస్కారవంతమున్నై చివరకు అది వారి మోక్షప్రాప్తికి యోగ్యంగా తయారుకావలసి ఉంది. ఇది భారతీయుల జీవితధ్యేయం. ఈపరమార్థం, మనసంస్కృతాంధ్రమహాప్రబంధాలలో ప్రతిబింబించిన తీరు తీయందనాలను, నాప్రియభారతసోదర సోదరీమణులకు సంగ్రహంగా చవిచూపుతాను. ఎందుకంటే, "ఏకః స్వాదు న భుంజీత" అనే ధార్మికసూక్తిని అనుసరించి మధుర (తీపి) పదార్థాలను తానొక్కడే ఆరగించక, తనపరివారజనంతో కలిసి మరీ ఆరగించడం మన ఆర్ష సంప్రదాయం.

ఈవిధంగా నాస్వల్పపరిశ్రమలో సంప్రాప్తమైన,



ప్రబంధగతభావమాధుర్యాలను కొలదిగా ఆత్మీయుల కందించి నాఅల్పపరిశ్రమను అన్వర్థం (సార్థకం) చేసుకొంటాను.

"పలికెడిది భాగవతమట, పలికించెడువాడు రామభద్రుండట
నే పలికిన భవహర మగునట, పలికెద వేరొండుగాథ పలుకగనేలా ?"
(మహాభాగవతపీఠికలో పద్యం -18)

ఈపద్యంలో "వాడు + నే" అనే సర్వనామపదాలను ప్రయోగించి భక్తపోతనమహాకవి తనపరమేశ్వరభావనామకరందమాధుర్యాలను పాఠకమధుకరాలకు పంచిపెట్టినాడు. ఎలాగంటే– "వాడు" అనే అర్థంకల సంస్కృతపదం "సః" అనేది. ఇక "నేను" అనే అర్థంకల సంస్కృతపదం "అహం" అనేది. ఈరెండుసంస్కృతపదాలను కలిపినప్పుడు 'సోఽహమ్' అనే వాక్యం ఏర్పడుతుంది. ఈవాక్యానికి, "నేను ఆపరమేశ్వరుడను" అనే అర్థం వస్తుంది. ఈఅర్థంవలన కలిగే ఆధ్యాత్మిక భావం ఇలా రూపొందుతుంది-

"రసో వై సః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి...."

అనే ఉపనిషద్వాక్యంవలన, "పరమేశ్వరుడు బ్రహ్మానందస్వరూపుడనీ, ఆపరమేశ్వరతత్త్వాన్ని తెలుసుకున్నభక్తుడు కూడా బ్రహ్మానందస్వరూపుడై ఆపరమేశ్వరుడు తానే (సోఽహం) ఐపోతాడనీ" ఆవాక్యానికి అర్థం వస్తుంది. ఈ ఉపనిషదర్థాన్నే ఉద్బోధిస్తూ భక్తపోతన ఆ 'సోఽహమ్' వాక్యంలోని అర్థం వచ్చేటట్లు, తనపద్యంలో 'వాడు' + 'నే' పదాలనే ప్రయోగించి, సాక్షాత్పరమేశ్వరస్వరూపు

డైన ఆరామభద్రుడు (వాడు) తానే, 'నే' ఐనాడు. అపరమేశ్వర భావనాప్రభావంవలన ఈభక్తకవి తన అసలుస్వరూపమైన పరమాత్మస్వరూపంతో ఐక్యం చెందినా డన్నమాట. ఈస్వస్వరూపంతో అనుసంధానం చెందడమే 'పరమభక్తి' అనిపించుకొంటుందని-

"స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే"

అనే వేదాంతసూక్తి విశదం చేసింది.

ఈపరమభక్తి కారణంగానే ఈభక్తకవికి పునర్జన్మలేని మోక్షం సిద్ధించినట్లు- "...దీనిం దెనిఁగించి నాజననంబున్ సఫలంబు జేసెద బునర్జన్మంబులేకుండగన్" అని తెలిపినాడు. ఈవేదాంతభావాన్ని పూర్తిగా అనుసరిస్తూన్న కారణంచేతనే ఈభక్తకవి ప్రస్తుతం- "...నే పలికిన భవహర మగునట. పలికెద...." అని చెప్పగలిగినాడు. ఇట్లు తనమోక్షవిషయకధ్యేయంతో "వాడు" అనే పదంలో, సాక్షాత్పరమేశ్వరస్వరూపుడైన శ్రీరామభద్రుని దర్శించి ధన్యజీవనుడైనాడు. ఇంతటిపరమార్థభావనతో భరితమై ఉన్న 'వాడు' పదాన్ని లాగేసి దానిస్థానంలో, 'విభుడు' పదాన్ని తగిలించిన సంస్కర్తల సంకుచితసాహసకారణంగా ఉక్తపరమార్థభావం అంతా లుప్తమైపోయింది. ఈభక్తకవి కవితోద్యానంలో పరమార్థభావమకరందాలతో భాసురములైన పద్యసుమా లెన్నో పరిణత భావులనే మధుకరాలకు విందులు గావిస్తూంటాయి. మచ్చునకు మరో రెండు చూపుతాను-



"ఏమినోముఫలమొ ఇంతప్రొద్దొకవార్త
వింటి మబలలార వీను లలర ।
మనయశోద చిన్నిమగవాని గనెనట,
చూచివత్త మమ్మ సుదతులార!"

(మహాభాగవతం.)

ఈపద్యంలో 'యశోదమ్మ మగపిల్లవాని కనెను' అన్నది భౌతికవిషయం. పిల్లవాడు పుట్టినవార్త ఒక్కపూటలోనే గ్రామంఅంతా వ్యాపించినప్పుడు ఇట్టి సులభవార్త వినడానికి గొప్పనోములఫలం అక్కరలేదు. అయినా మహాకవి ప్రయోగబలాన్నిబట్టి ఈవార్త లౌకికవార్త కాదనీ, అపూర్వమైన అలౌకికవార్త అనీ సూచితమౌతుంది. ఇట్టివార్త వినడానికి మరి ఎన్నో నోములఫలం అవసరమే ఔతుంది. ఈవిషయాన్ని బలపరచే మరికొన్నికారణాలుకూడ ఈపద్యంలో లేకపోలేదు. ఎలాగంటే- ఇంతప్రొద్దు- ఇన్నియుగాలతర్వాత ఈవార్త వినబడింది. ఇది ఒకవార్త- ఇంతవరకూ విన్నవార్తలన్నీ ఒకఎత్తు; ఈప్రత్యేకవార్త ఒక్కటీ ఒక ఎత్తు.

"ఈశ్రీకృష్ణావతారం దశావతారాలలోకెల్లా సంపూర్ణావతారం" అనే విశిష్టవిషయాన్ని, "సంపూర్ణతమావతారః కృష్ణః" అనే సూక్తి విశదంచేస్తూంది. ఇట్టి దివ్యావతారానికి చెందినది కనుకనే ఈవార్త విన్నవారి వీనులను అలర జేసినది.

ఇక పుట్టిన ఈపిల్లవాడు 'మగవాడు' అనగా పురు

షుడు. ఇతడు లోకసామాన్యపురుషుడు కాదు. ఈపురుషుణ్ణి వేదం మహావిష్ణుస్వరూపునిగా ఇలా వినుతించింది.

"పురుష ఏవేదగ్ం సర్వం । యద్భూతం యచ్చ భవ్యం, ఉతామృ
తత్వ స్యేశానః...." (ఉపనిషత్సూక్తి)

శ్రీమద్భాగవతంకూడా ఈ 'పురుష' శబ్దంలోని ప్రత్యేకప్రభావాన్ని ప్రకటిస్తూ ఇలా చెప్పింది-

'యోంతఃప్రవిశ్య మమ వాచ మిమాం ప్రసుప్తాం
సంజీవయ త్యఖిలశక్తిధరః స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్తచరణశ్రవణత్వగాదీన్ ।
ప్రాణా న్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥"

ఆ 'పురుష' శబ్దంతో పిలువబడే 'వాడు' 'పరమాత్మ' స్వరూపుడే అని భగవద్గీత ఇలా ప్రకటించింది.

"ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥"
(గీత- 15-17)

ప్రస్తుతంలో భక్తపోతన మహాకవి ప్రయోగించిన 'మగవాడు' అట్టి 'పరమాత్మ' అన్నమాట. "ఓసుదతులారా! మనయశోదమ్మ కనిన ఆ 'మగవానిని' చూసి అనగా ఆ శిశువులో- ఆ 'పరమాత్మ'ను దర్శించి తద్ద్వారా మనజన్మలను ధన్యంచేసుకొని వద్దామా?" అని పోతనకవి ఆగోపికల చేత అనిపించిన "ఏమినోముఫలమొ..." అన్న పద్యంలోని పరమార్థం. (గోపికలమాటలు భక్తపోతనమాటలేకనుక)



పోతనహృదయగతభావంకూడా ఇదేనని భావించవలసి ఉంది. ఈపరమార్థభావం ఒకప్పుడు నాలోంచి వెల్వడినదే. ఇట్టి ఈపరిణామభావాలకు "హృదయపరిణతి" మూలం. ఈసందర్భంలో 'కళాప్రపూర్ణ' డాక్టర్ దివాకర్ల వెంకటావధాని మహోదయులు- (ఇటీవల కీర్తి శేషులు) "భక్తపోతన-మహాభాగవతరచన" అనే నావిమర్శగ్రంథపీఠికలో వ్రాసిన కొన్ని వాక్యాలివి—

"...కవి మనఃప్రవృత్తికిని, కావ్యవస్తుప్రవృత్తికిని పొందు పొసగినప్పుడు కావ్యమువలె, వస్తుప్రవృత్తికిని, విమర్శకమనఃప్రవృత్తికిని పొందుపొసగినప్పుడు విమర్శయు నత్యంతశోభావిరాజమానమై యుండునని నావిశ్వాసము. శ్రీశాస్త్రులవారొనర్చిన యీవిమర్శలో నట్టి సామరస్యము పుష్కలముగా నున్నదని దీనిని జదివినవారి కెల్లరకును దేటతెల్లముకాక మానదు..."

"పోతనజీవితాదర్శములు" 'పోతనపరిణామభావాలు' అనే (నాగ్రంథగత) ప్రకరణాలలో నాప్రత్యేకభావాలను పొందుపరచినాను. పోతనపద్యాల్లో మరొకపద్యంలోని పరమార్థం చూపి మరోవిషయానికి వస్తాను.

"ఓయమ్మ నీకుమారుడు, మాయిళ్ళను పాలు పెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికైనను, మాయన్నలసురభులాన మంజులవాణీ!"
(మహాభాగవతం. స్కం-10)

ఇందలి ముఖ్యార్థం సులభమే. ఇక ఇందలి పరమా

ర్థాన్ని ప్రకటించటం నా పని. యశోదతో గోపిక లన్నమాటలివి- "ఓతల్లీ! నీ బాలకృష్ణుడు మాశరీరాల్లో ఉన్న- (ఎన్నో జన్మలనుంచి వస్తూఉన్న భౌతికభోగాఽభిలాషలను బ్రతకనీయడంలేదమ్మా! అనగా వాటిని ఇక లేకుండాచేస్తున్నాడన్నమాట. ఇట్లు భౌతికాభిలాషలు లేనివారు ఈభౌతిక లోకంలో మనలేరుకనుక, ఇటుపైని పరమేశ్వరభావనాప్రధానంగా జీవించవలసిన మేము (గోపికలు) ఇక ఈలోకాన్ని విడిచి పరమేశ్వరునకు దగ్గరగా ఉన్న ఏసత్యలోకానికో పోతాము. ఈవిషయాన్ని మాసోదరుల ఆస్తిపై ఒట్టుపెట్టి నిజంగా చెప్పుతున్నాము. ..." అని ఈపద్యంలోని పరమార్థం.

ఈ బాలకృష్ణుడు తన వెనుకటి అవతారంలో, తనభక్తులైన జ్ఞానుల మోక్షాభిలాషను సఫలం చేయడానికి, ఆజ్ఞానులను గోపికలుగా పుట్టమనటం జరిగింది. కనుక ఈ శ్రీకృష్ణావతారంలో- తాను గోపికలకు మోక్షాన్ని ఇవ్వవలసి ఉంది. ఈమోక్షప్రాప్తికి అర్హత కలిగించడానికనే కృష్ణపరమాత్మ గోపికల (జ్ఞానుల) భోగాభిలాషాదిదోషాలను ముందు పోగొట్టాలి. అలా ఆదోషాలు పోగొట్టడానికి చేయవలసిన ముందుపనులలో, గోపికల ఇండ్లలో (శరీరాల్లో) పాలు, పెరుగును అనగా భౌతికాభిలాషలను లేకుండా చేయాలి. ఆపనినే బాలకృష్ణుడు ఈపద్యములో చేసినట్లు భక్తపోతన తనగోపికలద్వారా- "మాయిళ్ళను పాలుపెరుగు మననీడమ్మా!...." అనేవాక్యంలో ధ్వనింపజేశాడు. "కావ్యస్య



ఆత్మా ధ్వని రిత్యానందివర్ధనః." ఇట్టి మరికొన్ని నా ప్రత్యేకభావాలను- "పోతనభాగవతంలో పరమేశ్వర సందర్శనం" అనే నాప్రత్యేకవ్యాసంలో ప్రకటించుకొన్నాను.

ఈవిధంగా మనభౌతికతత్త్వం ఆధ్యాత్మికతత్త్వంగా పరిణమించిన విషయాన్ని ఈశ్రుతివాక్యంకూడా ఇలా రుజువు చేస్తూంది.

"... యత్తే పవిత్ర మర్చిషి అగ్నే! వితత మంతరా బ్రహ్మ తేన పునీమహే...." ఈమంత్రం అగ్నిదేవతకు సంబంధించినది.

"ఓపవమానాగ్నీ! నీలో తేజోరూపంలో ఉన్న ఏ పవిత్రశక్తి కలదో దానితో, మాబ్రహ్మను, అనగా మాశరీరాన్ని పవిత్రింపజేయుము." అని యీమంత్రభావం. మనశరీరానికి 'దేవాలయం' అనీ, 'బ్రహ్మపురం' అనీ వైదిక వాఙ్మయంలో ప్రసిద్ధి ఉన్నట్లు, ఈక్రింది ఉపనిషన్మంత్రం ఇలా తెలుపుతూంది-

"అష్టా చక్రా నవద్వారా, దేవానాం పూరయోధ్యా, తస్యాగం హిరణ్మయః కోశః, స్వర్గో లోకో జ్యోతిషావృతః। యో వై తాం బ్రహ్మణో వేద, అమృతే నావృతాం పురీం తస్మై బ్రహ్మ చ బ్రహ్మా చ। ఆయుః కీర్తిం ప్రజాం దదుః...."

"మనశరీరం అనే పట్టణం, అష్టధాతురూపాలైన ఎనిమిదిచక్రాలతో కూడినది. ఇట్లే ఇంద్రియాలనే నవద్వారాలతో కూడి అయోధ్య ఐనది; అనగా జయింపరానిది. దేవత

లకునిలయమైనది. ఈపట్టణంలో జ్యోతిర్మయమైనకోశమే స్వర్గలోకం. ఆలోకం జీవచైతన్యరూపమైన జ్యోతిస్సుచే ఆవరింపబడిఉంటుంది. ఇట్టి ఈపట్టణమును ఎవడుసత్యజ్ఞానానందరూపమైన బ్రహ్మకు A సంబంధించినదాన్నిగాను, అమృతముతో (బ్రహ్మానందముతో) ఆవరింపబడినదాన్నిగాను తెలుసుకొనగలుగుతాడో అట్టి పండితునికి ఆపరమాత్మ ఆయుఃకీర్త్యాదులను అనుగ్రహిస్తాడని" ఈచెప్పిన మంత్రంలోనిభావం. ఈ రీతిగా మనశరీరం దేవతానిలయమైనది. కనుకనే అది, దేవాలయం అనీ, అందలి జీవుడు దేవుడనీ ప్రసిద్ధిచెందింది. B

ఇట్లు భౌతికమైన మనశరీరం ఆధ్యాత్మికంగా బ్రహ్మపురమైనప్పుడు మానభౌతికముపై ఆధ్యాత్మికప్రభావానికి ఇంతకంటే వేరే నిదర్శనా లక్కర లేదు.

## వ్యంగ్యవైభవము.

"కావ్యజీవితం వ్యంగ్యవైభవం" అనే ఆలంకారికసూత్రం- "మహాకావ్యానికి వ్యంగ్యం అనేది ప్రాణంవంటిది" అని తెలిపింది. ఈవ్యంగ్యాన్ని 'ధ్వని' అనికూడా అనవచ్చు. ఉదాహరణకు-

"నరసింహప్రభువు అవతరించి అతిశయం పొందగానే ఆదిశేషువు తనతలను పైకి ఎత్తుకొనగల్గినది" అనే ఉదాహరణలో- "ఆదిశేషువునకు భూభారవహనం అనేది అవసరం

A "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ...." (ఉపనిషత్సూక్తి)

B "దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః ...."



లేకుండుటకై నరసింహప్రభువు భూభారాన్ని వహించినాడు" అనే అర్థం వ్యంగ్యరూపంలో మనస్సుకి తట్టుతూంది. A ఇట్లు మహాకవులు వర్ణించిన విషయాలతో, నిగూఢంగా పోలికగల మరోవిషయం బుద్ధికి తట్టడం అనేది 'వ్యంగ్యం' అనిపించుకొంటుంది. మరో ఉదాహరణను చూపుతాను. మనుచరిత్రలో వరూథిని అనే వేశ్యాంగనచేత ప్రవరాఖ్యునికి పెద్దన మహాకవి ఇలా చెప్పిస్తాడు.

"ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపగళికా శ్రీదోప నెందెందుం బోవ
కెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న బ్రాజదువు సంతర్బుద్ధి నూహింపుమా॥"

వరూథిచే పెద్దనకవి, వేశ్యపాత్రపోషణసందర్భంలో ప్రవరాఖ్యునికి చెప్పించిన మాట లివి- ప్రవరాఖ్యుణ్ణి వశం చేసుకొనడానికిగాను అతనియెడ వరూథిని ముందుగా చూపిన శృంగారచేష్టలు, వివిధవిలాసవైభవాలు వ్యర్థమైపోయాయి. అప్పుడు ప్రవరాఖ్యుడికి ఇష్టమైన వేదసూక్తిని నిదర్శనంగా చూపి ఆవేశ్య, "తనతో కూడి భోగానుభవాన్ని పొందడమే, వేదంలో చెప్పిన 'ఆనందో బ్రహ్మ...' అనే వాక్యానికి అర్థం" అని ఆయువకుణ్ణి లోబరచుకొనబోతుంది.

A "ఇందు దలయెత్తుకొనగల్గె దందశూక, పతికి నన నారసింహభూపాలు
డుర్వి, తాల్చె నను వ్యంగ్యమాదియా ధ్వనులు దోప, దనరు
నుత్తమకావ్యమై ధ్వని యనంగ ॥"

(కావ్యాలంకారసంగ్రహం ఆశ్వా- 2-93ప)

ఇక ఈపద్యంలోని ముఖ్యార్థంలో 'ఎందేన్' అనేసర్వనామానికి 'ఏరతియందు' అని అర్థం. ఏ 'రతి' సమయంలో మానవులచిత్తం మెత్తబడి హాయిని అనుభవిస్తుందో, ఇట్లే ఏరతియందు మానవుని అన్ని ఇంద్రియప్రవృత్తులు ఇతరవిషయాలమీదకు పోక ఏకాగ్రస్థితికి వచ్చి పరమానందానుభవంతో పరవశమౌతాయో అట్టి ఆ 'హాయినే' వేదం 'ఆనందో బ్రహ్మ' అని అభివర్ణించింది.

కనుక నీకు ప్రమాణమైన వేదమే "నాతో కలిసి నీవు భోగాలను అనుభవించడం మంచిదని అంగీకరించింది. కనుక ప్రియాతిథీ! నీవు బాగా ఆలోచించి నీవేదోక్తమార్గాన్ని అనుసరించుము" అని ఆవేశ్యాంగన, ఆయువకుని వైదికమతంతో తనకామసిద్ధాంతాన్ని సమన్వయించి ఇట్లు వానిపొందుకోసం బుద్ధినంతా వినియోగించింది.

ఐతే, తనకావ్యపాత్రచేత ఇలా చెప్పించిన పెద్దనార్యునికికూడా "పరస్త్రీతో కలియడం" అనే పాపకార్యం ఇష్టమేనా? అనే ప్రశ్నకు సమాధానంగా పెద్దనకవి- వేశ్యాంగనలస్వభావం ఇలా ఉంటుందనీ, పరపురుషులను వశంచేసుకొనడానికిగాను వారు అన్నిహన్నాగాలు పన్ని పురుషులను మోహవాగుర (వల)లో చిక్కించడానికి అంతసాహసాన్ని చూపుతారనీ, కనుక ధీరపురుషులు ఆవేశ్యాయువతులవిషయంలో గంభీరమైన ధైర్యాన్ని చూపి వారివలనుంచి తప్పించుకొని తనమనస్సును పరమేశ్వరునిధ్యానమందే లగ్నంచేయాలనీ, "ఆనందో బ్రహ్మ" అనే ఉపనిషత్సూక్తికి ఇదే నిజమైన



భావమనీ, ఈపరమార్థభావాన్ని ముఖ్యార్థంతో జోడించి ఈ మహాకవి వ్యంగ్యమర్యాదను అనుసరించి చెప్పినాడనీ, వివేకవంతులు ఇట భావించవలసిఉంది.

ఒక్క భౌతికభావనే ప్రధానంగా కల పామరులకు రోగికి అపథ్యవస్తువులవలె వరూథినీసిద్ధాంతాలు మధురమధురంగా కనిపించవచ్చు. ఇది కేవలభౌతికదృష్టికి చెందినది. కాని మహాకావ్యాలలో, లోకహితంకరమైన ఉపదేశం అనేదికూడా ముఖ్యమైనదేకదా! ఈపరమార్థమే యీక్రింద చూపబడింది.

సర్వనామశబ్దం అందరిని చెప్పగలిగిఉంది. ప్రస్తుత మనుచరిత్రంలోని పద్యంలో 'ఎందేన్' అనే సర్వనామశబ్దం ప్రస్తుతార్థంతో పాటు, "ఏపరమేశ్వరధ్యానమందు" అనే మరో అర్థాన్నికూడా తెలుపుతుంది. ఈ అర్థం చెప్పినప్పుడు ఈపద్యభావం ఎలా మారిందో చూడండి.

"ఏ పరమేశ్వరధ్యానసమయంలో ఏకాగ్రతతో ధ్యానంచేసేవారిమనస్సు ఆత్మీయానందంతో చిగుళ్ళుదొడుగుతుందో, ఇంకా ఏసమాధిధ్యానసమయంలో అట్టివారి మనస్సు కుండలో పెట్టిన దీపంవలె ఎటూ చలించక ఏకాగ్రస్థితినిపొంది చెప్పలేనంత ఆనందస్థితిని అందుకొంటుందో, ఇంకా అన్నియింద్రియాలు తమవిషయాలమీదకు పరుగులెత్తక నిలకడతో సత్యమైన సౌఖ్యాన్ని అనుభవించగల్గుతాయో అట్టి ఆసొంపే, ఆ అనిర్వాచ్యానందమే 'పరబ్రహ్మము'

అని చెప్పబడుతుంది. ఈపరమార్థాన్నే శ్రుతులు 'ఆనందో బ్రహ్మ' అని అభివర్ణించినవి." అని పరిణతిభావ్యులైన పండితులకుకూడా కావలసిన పరమార్థం ఇందున్నది.

ఈవిధంగా నాటిమహాకవులు భౌతికవిషయాలతో ఆధ్యాత్మికవిషయాలుకూడా జోడించి వానిని వ్యంగ్యరీతిలో ధ్వనింపజేసి తద్ద్వారా లోకశ్రేయస్సంపాదకాలైన మహాసందేశాలను లోకానికి అందించినారు. నిజానికి రతిసమయసంజనితమైన ఆనందం క్షణికమైనదే.

కనుకనే ఇట్టిసుఖాన్ని జితేంద్రియులు తుచ్ఛంగా భావిస్తారని ఈపెద్దనమహాకవి ప్రవరాఖ్యునిద్వారా వరూథినికి ఇలా చెప్పించాడు—

'చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ విరసాలపై తేనియల్' కనుక పెద్దనమహాకవి కాముకళావిశారదయైన వరూథినీ సిద్ధాంతాన్ని భౌతికంగానేగాక ఆధ్యాత్మికదృష్టికికూడా సరిపడేటట్లు- 'ఎందేన్' అనే సర్వనామం ప్రయోగించి, "పరమేశ్వరధ్యాననిష్ఠాగరిష్ఠుడైన మహాయోగి తనసమాధిస్థితిలో అనుభవించే బ్రహ్మానందానుభవస్థితిని పొందగలగడమే మానవజన్మకు చరితార్థత" అని ఉత్తమపాఠకునకు ధ్వనిరూపంలో మహాకవి ప్రబోధం చేసినట్లు భావించాలి.

ఈ నా(స్వీయ) భావాన్ని ఋజువుచేసే నిదర్శనంకూడా మహాకవిధర్మమా అని ఈపద్యంలోనే ఉంది. ఎట్లనగా- పరమార్థభావనకల ఓపాఠకోత్తమా! నీవు- "...ప్రాజదువు నంతర్బుద్ధి నూహింపుమా!"



ఈపద్యంలో చెప్పిన (రెండవ) పరమార్థం "నీఅంతర్బుద్ధిలో ఊహించినపుడే నీకది తెలుస్తుందిసుమా" అని మహాకవి ఈపద్యంలోని నాల్గవపాదంలోని వాక్యంద్వారా ధ్వనింపజేశాడని నానమ్మకం.

## కామపురుషార్థంయొక్క తీరుతెన్నులు.

"భారతీయపవిత్రసంస్కృతిలో భౌతిక 'కామం' ధర్మసంబంధంతో భవ్యపరిణతి చెందినప్పుడు అట్టిది లోకాభ్యుదయకరంగా పరిణమిస్తుంది" అనే సత్యాన్ని ఈఋగ్వేదసూక్తి చక్కగా ఇలా చాటుతూంది-

"యత్రానందాశ్చ మోదాశ్చ ముదః ప్రముద ఆసతే। కామస్య
యత్రాప్తాః కామాస్తత్ర మామమృతం కృధీన్ద్రాయేందో పరిస్రవ"
(9-113-11)

"ఎక్కడ ఆనందమోదాలు ప్రాప్తిస్తాయో, ఇక్కడే ఎచ్చట, కామునియొక్క, అనగా కామ్యమానుడైన పరమేశ్వరునియొక్క కామాలన్నీ లభిస్తాయో, అచ్చట నన్ను అమృతస్వరూపునిగ (ముక్తునిగ) చేయుము" అని అర్థం. (చూ. నిరుక్తభారతి పేజి-15)

దీనినిబట్టి ధర్మరహితమైనప్పుడు అనర్థావహమైన కామమే పరమేశ్వరసంబంధం కలదైనపుడు, అది బ్రహ్మానందప్రదమౌతుందని తేలింది. ఇట్లు మన సంస్కృతాంధ్రమహాప్రబంధాలలో ముఖ్యార్థంతోపాటు మరో పరమార్థంకూడా

వ్యంగ్యరూపంలో ధ్వనిస్తూంటుంది అనడానికి ఎన్నో నిదర్శనాలు ఉన్నాయి.

ఉదాహరణకు, ఒక కాళిదాసీయశ్లోకార్థ మిది- ఒక పెంపుడులేడిని వేటాడడానికని దుష్యంతుడు రథంపై దానిని వెంబడించి దగ్గరపడిన ఆలేడిపై తనవాడిబాణాన్ని విడవబోతాడు. ఇంతలో ఆశ్రమంలోని కొందరు మునులు ఆలేడి యెదురుకుండా వచ్చి "ఓమహారాజా! అతిసుకుమారజీవితంకల ఈపెంపుడులేడిపిల్లపై వజ్రాయుధంవంటి నీబాణాలు ప్రయోగింపరాదు. అతిచంచలమైన లేళ్ళ సుకుమారజీవితం ఎక్కడ? వజ్రాయుధప్రయోగంవంటి నీవాడిబాణాలప్రసారం యెక్కడ? సుకుమారవస్తువుపై కఠినవస్తుప్రయోగం అనేది, పువ్వుల రాసిలో నిప్పులు పోసినట్లు విపరీతఫలానికి కారణ మౌతుంది." ఇది ముఖ్యార్థం. ఈఅర్థంవలన, పాఠకోత్తముల పరిణత భావంలో ధ్వనించే పరమార్థ మిది.

ఇవీ మునులమాటలే-"ఓమహారాజా! శకుంతలజీవితం లేడిజీవితంవలెఅతిసుకుమారమైనదీ, శాంతప్రధానమైనదీకూడాను. ఇట్టి ఈమెవిషయంలో, నీబాణాలు అనగా కామవాంఛామూలకాలైన నీదృష్టిబాణాలు విడువరాదు. ఇంతవరకూ కామవికారాలంటే ఏమిటో తెలియని ఈముగ్ధరాలపై మదనవికారజనకాలైన నీసవిలాసవీక్షణబాణాలప్రయోగం, పువ్వులలో నిప్పులు పడవేసినట్లే, ఆమె మానసంలో క్రొత్తవికారాలు పుట్టించడంద్వారా శాంతినికేతనమైన ఆమెజీవితాన్ని (ఆబాణాలు) అశాంతినిలయంగా మార్చినట్లౌతాయి.



కనుక, పెంపుడులేడిశరీరంవంటి ఆమెశరీరంపై నీబాణాలు పడవేయరాదు." అని ఆమహర్షుల అంతర్వాణి, దూర్వాసశాపరూపంలో శకుంతలకు అచిరభావిలో రాబోయే భర్తృవిరహరూపఅనర్థాన్ని ముందే సూచించి నిషేధించినట్లయింది. భావికథాసూచనం అనే ఇదొకమహాకావ్యలక్షణం. ఇక్కడ పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యవిషయాలున్నాయి.

దుష్యంతచక్రవర్తి శకుంతలను గాంధర్వవివాహపద్ధతిలో వివాహం చేసుకొని ఆమెను 4 రోజుల్లో తనఇంటికి తీసుకొనివెడతానని చెప్పి తన అంగుళీయకం ఇచ్చి వెడతాడు. భర్త వెళ్ళినపిమ్మట శకుంతల ఒక్కదుష్యంతసార్వభౌమునే తనప్రేమసామ్రాజ్యానికి సార్వభౌమునిగా ఎన్నుకొంది. ఇప్పుడామెహృదయంలో- ఇదివరకున్న "విశ్వప్రేమ" విలుప్తమై దానిస్థానంలో కామమూలకమైన స్వార్థసంకుచితప్రేమ ఏర్పడింది.

ఈప్రేమఫలితంగా ఈతరుణంలోనే సులభకోపంకల దూర్వాసముని అక్కడకురావడం, పతిధ్యానంలో మునిగిఉన్న శకుంతల ఆమహర్షికి ఆతిథ్యం ఇచ్చేస్థితిలో లేకపోవడం, అనగా తనధర్మాన్ని ఆచరించకపోవడం, అందులకు ఆగ్రహించి ఆముని, "నీభావంలో ఉన్నవాడు నిన్ను మరచిపోవుగాక" అని శాపంఇచ్చి వెళ్ళడం, ఈశాపవాక్యాలైన ఆమె చెవిలో పడకపోవడం అనే సన్నివేశాలు జరుగుతాయి.

అసలు ఈశాపానికి మూలం, అతిథికి ఆతిథ్యం ఇవ్వక పోవడం అనే అధర్మమే. ఈఅధర్మాచరణానికి మూలం, శకుంతల సంకుచిత పతిప్రేమలో మునగడం- అంటే ధర్మంయొక్క స్థానాన్ని ప్రబలకామం ఆక్రమించడమన్నమాట. మానవుల జీవితాలలో వచ్చే ఒడుదుడుకులన్నీ ఈప్రబలకామంనుంచే ప్రారంభమౌతాయి. ఇట్టిఅనర్థాలు లోకానికి లేకుండా ఉండాలనే ధ్యేయంతోనే మన మహర్షులు మనవివాహసంస్కారంలో మొదటినుంచీ "ధర్మార్థకామాలను సమప్రాధాన్యంతో సేవించేటట్లు" గట్టి కట్టడిచేశారు.

ఇట్టి కట్టడిచేయడంలో వారి ఆంతర్యం ఏమనగా, భౌతికకామమూలకమైన ఆపదలలో మానవులు చిక్కుకొనకుండా ఉండడానికిగాను, కామం ధర్మానికి విధేయమై ఉండాలన్నదే వారిఆంతర్యం. ప్రస్తుతం భర్తపై శకుంతలకేర్పడిన ప్రబలకామం, ఆతిథ్యధర్మాచరణాన్నుంచి శకుంతలను భ్రష్టగా చేసింది. ఈఅధర్మాచరణఫలితంగా శకుంతలకు వెంటనే శాపం ఏర్పడి, భార్యాభర్తలు ఒకరికి మరొకరు దూరమై పోయారు. ప్రబలకామమూలకాలైన ఇట్టి దుస్సంఘటనలు గతచరిత్రలో నిత్యంగా నిలిచి లోకాన్ని ప్రబోధిస్తూనే ఉన్నాయి.

కీచకుడు, రావణాసురుడు, దుర్యోధనుడు మొదలైన వారందరినీ వారిబలవన్మరణానికి గురిచేసినది ఈప్రబలకామ ప్రభావమేకదా! కనుక మానవసమాజంయొక్క శ్రేయస్సంతా, ధర్మపూర్వకకామంమీదనే ఆధారపడి ఉన్నట్లును,



ధర్మరహితకామం సమాజపతనానికి మూలకారణమౌతూ న్నట్లును, యుగయుగాలనాటిచరిత్ర చాటుతూనే వస్తూంది. ప్రస్తుతంలో, లోకస్వభావం సంపూర్ణంగా తెలిసిన కాళిదాస కవి తనశాకుంతలనాటకంలో అమూలకమయిన మునిశాపకథ కల్పించి, 'ధర్మరహితమైన ప్రబలకామానికి వశమైనవారు శకుంతలవలె అనర్థాలలో చిక్కుకొనకమానరనీ, కనుక ధర్మ సహితమైన కామసేవనమే సమాజశ్రేయస్సునకు సాధన మౌతుందనీ, తననాటకీయకథాచిత్రణంద్వారా విశిష్టసందేశాన్ని విశ్వానికి అందించినాడు. ఈవిశ్వసందేశంలో విశిష్టంగా విరాజిల్లే సారమిది.

'కామం' అనేది విశృంఖలవిహారం చేస్తూ ధర్మాన్ని త్రోసిరాజుచేసి ప్రబలినాడు, అట్టి ప్రబలకామానికి వశమైనవారందరు తమ బలవన్మరణానికి తామే కారకులౌతారనీ, కనుక ధర్మాన్ని అనుసరించని ప్రబలకామం ప్రజలసామాజికజీవితానికి మృత్యుదేవతవంటిదౌతుందనీ సారాంశం.

ఇక ధర్మంతోకూడి, అనగా ధర్మం అడుగుజాడల్లో నడుస్తూ ధర్మానికి విధేయంగా ఉన్నకామం, భూతభవిష్యద్వర్తమానకాలాలలో మానవులసామాజికజీవితానికి సర్వవిధశ్రేయస్సులను, అనగా ఐహికాభ్యుదయాలతోబాటు ఆముష్మికాభ్యుదయాలనుకూడా అమరజేయగలిగి ఉంది.

ధర్మం పరమేశ్వరస్వరూపం కనుక అట్టిధర్మంతో కూడిన కామంకూడా పరమేశ్వరరూపంగా మారి మానవు

లకు మోక్షప్రదమౌతుందని ఈక్రింది స్మృతిప్రమాణాలు సాక్ష్యమిస్తున్నాయి.

“... ధర్మాఽవిరుద్ధః కామోస్మి భూతేషు భరతర్షభ” (గీత)

అంటే ‘జీవులకుచెందినకామం ధర్మంతోకూడిఉన్నచో అట్టికామం నా (పరమేశ్వర) స్వరూపమే ఔతుంది’ అని శ్రీకృష్ణపరమాత్మ స్వయంగా చెప్పినాడు. అనగా అట్టి కామం పరమేశ్వరుని దర్శింపజేయగలిగి ఉందన్నమాట.

దీనికి నిదర్శనం, ‘కామహా, కామకృత్, కాంతః, కామః, కామప్రదః, ప్రభుః’ అనే విష్ణుసహస్రనామం. అనగా లౌకికములైన కామాలను (కోరికలను) నశింపజేయువాడును, భక్తులకామాలను తీర్చువాడును, పరమేశ్వరుడు ఐన మహావిష్ణువు ‘కామ’స్వరూపుడు అసి ఈవిష్ణుసహస్రనామం తెలుపుతూంది.

“కామ్యతే పురుషార్థాభికాంక్షిభి రితి కామః” అని శాంకరభాష్యం. ఇంకా ఈకామతత్త్వాన్ని శ్రుతులు వివిధ రీతుల్లో వివరించాయి.

“...కేవలభౌతికభోగదృష్టితో ఏఒక్కడూ భార్యను నిత్యంగా ప్రేమించలేడనీ ‘ఆత్మ’ (పరమాత్మ) అనే అర్థం కల ‘తన + నా’ అనే అర్థంకల ‘ఆత్మన్’ శబ్దంతో సంబంధం ఉన్న భార్యనే పురుషుడు నిత్యంగా ప్రేమించగలుగుతాడనీ, ఇదేవిధంగా తనపుత్రాదులను ప్రేమించగల్గుతాడనీ, యాజ్ఞవల్క్యమహర్షి తన భార్య మైత్రేయితో చెప్పిన ఈస్మృతి వాక్యాలు వ్యక్తం చేస్తున్నాయి.



“నవా అరే, జాయాయాః కామాయ జాయా ప్రియా భవతి, ఆత్మనః కామాయ జాయా ప్రియా భవతి । నవా అరే పుత్రస్య కామాయ పుత్రః ప్రియో భవతి, ఆత్మనః కామాయ పుత్రః ప్రియో భవతి....”

‘ఆత్మ’ అనగా “పరమాత్మ” అనికూడా అర్థం ఉంది కదా! సృష్టిలోని ప్రతీఒకజీవికీ ‘పరమాత్మ’ అనే వస్తువు, సహజంగానే పరమప్రీతికరము, పరమాదరణీయము, పరమ పూజ్యము ఐ ఉంది. సర్వకాలాలలో అలాఉంటుంది కూడాను. కారణం అది, ‘తన, నా’ అనే అర్థం కల ఆత్మ (పరమాత్మ) భావనతోకూడి ఉండటమే.

ఉదాహరణకు ఒకనిశరీరం వికారమయిన ఆకారంతో పరులకు ఏవగింపుగా ఉన్నా, అదేశరీరం “తనది-నాది” ఐనప్పుడు అట్టి తనశరీరాన్ని ఏ ఒక్కడు ఏవగించుకోనడు, క్రొనలేడు కూడాను. కారణం ఆ (శరీరమనే) వస్తువు, తన=ఆత్మ=పరమాత్మ సంబంధం కలిగి ఉండటమే. ఇదేవిధంగా “తన కుమారుడు అనుకున్నపుత్రుణ్ణి ‘తన’ భార్య అనుకున్న పత్నిని ప్రేమించినంతగా ‘తన’ సంబంధంలేని పుత్రుణ్ణిగాని, పత్నినిగాని పురుషుడు ప్రేమించలేడు” అని ‘నవా అరే...’ అనే యాజ్ఞవల్క్యస్మృతివాక్యాలలోని అర్థం.

ప్రస్తుతంలో శకుంతలయొక్క భర్తృగతకామం అతిథిపూజారూపమైన ధర్మాన్ని త్రోసిరాజుచేసి ప్రబలడం వలన, ధర్మసంబంధం కాని, ‘ఆత్మ’ సంబంధం కాని లేని కేవలభౌతిక కామం (ప్రేమ)గా తయారయింది. ఇట్టి ‘కామ’ పురుషార్థ

సేనసంవలన దంపతులకు తద్ద్వారా మానవసంఘానికి అనర్థములే ఆవహిల్లుతాయని లోకానికి చూపడానికే కాళిదాసకవీంద్రుడు శకుంతలయొక్క భౌతికప్రేమను ఒకమూల వర్ణిస్తూ వెన్వెంటనే దానిఫలరూపంగా దూర్వాసముని శాపాన్ని కూడా దానితో జోడించి ఆభౌతికకామానికి తగినప్రాయశ్చిత్తాన్ని (శిక్ష) విధించాడు. దీనితో మొత్తం నాటకచక్రం అంతా మహామహిమోపేతంగాను, భారతీయ పవిత్రప్రణయతత్త్వంలోని గురుత్వమహత్త్వపటుత్వప్రాభవప్రకాశకముగాను మలుపుతిరిగి క్రమంగా, కావ్యనాయికయైన శకుంతల "భరతమాత"గా రూపొంది ప్రపంచప్రశస్తులకు పాత్రి అయింది. ఈసందర్భంలో విశ్వకవి రవీంద్రకవీంద్రుడు, కాళిదాసకవీంద్రునియొక్క అద్భుతకథాసంవిధానచాతురికచ్చెరువొంది చెప్పిన కొన్నివాక్యాలభావాన్ని ఇట పొందుపరుస్తాను.

"....దంపతులప్రేమ స్వార్థయుతమయినచో ఎట్టిసత్ఫలితముల నొసంగదనియు, వాత్సల్యరూపమున సంఘమునందు బరివ్యాప్తము కానంతవరకును దానికెట్టి సౌందర్యముగాని, శాశ్వతత్వముగాని చరితార్థతగాని లేదనియు నీకాళిదాసమహాకవి ముక్తకంఠమున నుద్ఘోషించెను..."

"కాళిదాసప్రతిపాదితసౌందర్యము తపస్సుచే దివ్యత్వము నార్జించును. ఇట్టి దివ్యసౌందర్యార్ణవమునందు నియమరహితములైన కామోద్రిక్తతా ప్రవాహములు అనేకములు సంగమించి భారతీయప్రణయభావసిద్ధితో పరిపూర్ణతను అనుభవించును. సకలప్రపంచమును అట్టి దివ్యసౌందర్యధామముగా



పరివర్తింపబడవలయుననియే శ్రీకాళిదాసకవీంద్రుని ఆశయము" (చూ. మదీయ 'కాళిదాసహృదయము' కాళిదాససౌందర్యారాధనము- విశ్వప్రేమము 102, 3 పేజీలు)

రవీంద్రకవీంద్రుని ఈవాక్యాలు, ప్రబలకామంయొక్క అనర్థావహత్వాన్ని, ధర్మమునకు విధేయమైన కామంయొక్క శ్రేయస్కరత్వాన్ని ప్రకాశింపజేయడానికి సంపూర్ణంగా సహకరిస్తున్నాయి. ఇక ప్రబలకామంయొక్క హఠాదాక్రమణంనుంచి కాళిదాసకావ్యనాయికలు కాళిదాసకవీంద్రునిచే ఎట్లు కాపాడబడినారో ఈవాక్యాలు వ్యక్తం చేస్తాయి. "కాళిదాసకావ్యతపోవనమునందు సింహశాబకములు (పిల్లలు) మానవులతో నాడుకొన్నట్లు యోగిగృహస్థభావములు సంశ్లిష్టములై యున్నవి. మన్మథు డాపవిత్రసంబంధమును భగ్నమొనర్ప యత్నించుటచేతనే యీకాళిదాసకవి యాతనిపై వజ్రపాత మొనర్చి తపస్సుద్వారా కళ్యాణమయమైన గృహముతో పవిత్రతపోవనసంబంధమును పునః స్థాపించినాడు. స్త్రీపురుషసంబంధమును హఠాదాక్రమణమునుండి యుద్ధరించి తపఃపూతమయిన యోగాసనముపై ప్రతిష్ఠిత మొనర్చినాడు." (చూ. నా "కాళిదాసహృదయము" 100 పే) ఇట్టి విశిష్టవిషయాలు ఈవిమర్శగ్రంథంలో మరెన్నో సోదాహరణంగా, సప్రమాణంగా వివృతాలై ఉన్నాయి. ఇంతకూ తేలిన సారాంశ మిది. మనపురుషార్థాలలోని కామం ధర్మాన్ని అనుసరించిఉన్ననాడే అట్టిది మానవసమాజానికి శ్రేయస్కరమై మనభౌతికజీవి

తాన్ని ఆధ్యాత్మికంగా మలుచుటకును, మానవత్వంలో మాధవత్వాన్ని ప్రవేశపెట్టుటకును సమర్థమయి ఉన్నది. ఇట్టి కామమే అందరిచేత కోరబడుతుందని "కామ్యతే ఇష్యతే ఇతి కామః" అనే వ్యుత్పత్త్యర్థం తెలుపుతూంది.

## మనసంస్కృతిలో "స్వాహా-స్వధా" శబ్దాల మహిమ.

ఈశబ్దాలనుగూర్చి శ్రీహరిసోదరులు తమ "భారతీ నిరుక్తి"లో (239 పేజీనుంచి) ఇలా తెలిపినారు. వాటిని సులభభాషలో అందిస్తున్నాను.

'స్వాహా', 'స్వధా' ఈ రెండూ మహిమాన్వితమయిన మంత్రాలని దేవీభాగవతం ఇలా తెలిపింది.

"స్వాహా స్వధా నామ మనుప్రభావైః,
తృప్యంతి దేవాః పితర స్తథైవ।
యజ్ఞేషు సర్వేషు ముదాహరంతి,
యన్నామయుగ్మం శ్రుతిభి ర్మునీంద్రాః ॥"

(అనగా ఈ రెండుమంత్రాలప్రభావంచేత దేవతలు, పితృదేవతలుకూడా తృప్తి చెందుతారు.) ఇంకా ఈశబ్దాలను గూర్చి బ్రహ్మవైవర్తపురాణం ఇలా వర్ణించింది-

"త్వన్నామోచ్చార్య మంత్రాంతే యో దాస్యతి హవి ర్నరః।
సురేభ్యః, తత్ ప్రాప్నువంతి సురాః స్వానందపూర్వకం ॥"

అనగా "ఈ రెండుశబ్దాలను సరిగా ఉచ్చరించి ఎవడు యజ్ఞాదులందు హవిస్సును దేవతల కర్పిస్తాడో అట్టి ఆహవిస్సునే దేవతలు సంతోషంతో స్వీకరిస్తారు."



'స్వాహా' శబ్దంలేని హోమం దేవతలకు ముట్టదుగనుక, ఇది దేవతలకుజీవనాధారమైనది- స్వాహాదేవియే పితృయజ్ఞములందు స్వధారూపిణి ఔతుంది. మనం పితృతర్పణాలలో చెప్పే వసు, రుద్ర, ఆదిత్యులు, అగ్ని, వాయు, సూర్య స్వరూపులు, వీరూ, పితరులూకూడా స్వధాస్వరూపులు.

(280 పే)- జీవుడు మృతదేహాన్ని విడిచి "స్వధలతో" అనగా పూర్వజన్మలో సంపాదించిన తనవిద్యాకర్మలను అనుసరిస్తూ ప్రవర్తించును. కనుక జీవుని రాకపోకలకు కారణం, 'స్వధలు'. అనగా "జీవుని అనుసరించి వస్తూన్న ఆ జీవుని త్రాలూకు పూర్వజన్మలలోని విద్యాకర్మలు, పూర్వప్రజ్ఞయును (అనగా పూర్వజన్మవాసన) తమ గతజన్మలలో చేసుకొన్న కర్మలకు వశులైన జీవులు పితృదేవతలుగా మారుట, వారు శ్రాద్ధాదులచే తృప్తులై తమపుత్రపౌత్రాదులను తరింపజేయుట" అనే విషయాలనుగూర్చి యాజ్ఞవల్క్యస్మృతి ఇలా నిరూపిస్తూంది-

"వసురుద్రాదితిసుతాః, పితర శ్శ్రాద్ధదేవతాః।
ప్రీణయంతి మనుష్యాణాం పితౄన్ శ్రాద్ధేన తర్పితాః ॥
ఆయుః ప్రజ్ఞాం ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖాని చ।
ప్రయచ్ఛంతి తథా రాజ్యం ప్రీతా నౄణాం పితామహాః ॥"

ఇచ్చట దేవదత్తాదిమనుష్యపితరులే పితృపితామహప్రపితామహశబ్దములచే గ్రహింపబడి వీరు, తమపుత్రాదులచే శ్రద్ధగా ఒసంగబడిన హవిస్సులు, తర్పణాలు, పిండాలు అనే క్రియలచే తాము తృప్తిచెంది దేవదత్తాదిమనుష్యపితరు

లను తృప్తిపొందిస్తున్నారు. ఇలా వీరు తృప్తులై కర్తలైన పుత్రాదులకు ఆయురారోగ్యైశ్వర్య పుత్రాదిమహాఫలములను అనుగ్రహిస్తూంటారని ఈస్మృతివాక్యాలలోని భావం.

మన అనుభవంలోకూడా:— తల్లి తనకు బంధువులు పెట్టే అన్నపానాదిక్రియలచే స్వయంగా తృప్తురాలై తన గర్భమందున్న శిశువునుకూడా తృప్తిపొందిస్తూందికదా ! ఇదేవిధంగా 'దివ్యపితరులు' అనబడే వసురుద్రాదిత్యులు కూడా తమయందు అధిష్ఠించిఉన్న మనుష్యపితరులను తృప్తిపొందించి శ్రాద్ధాదిక్రియలను ఆచరించడంద్వారా, కర్తలుగా ఉన్న పుత్రాదులకు వారు ఆయురాదిమహాఫలములను ప్రసాదిస్తూంటారన్నమాట.

(286పే) "పితృపితామహప్రపితామహులను, క్రమంగా సాక్షాత్ వసురుద్రాదిత్యస్వరూపులుగానే భావించవలెను" అని శాతాతపస్మృతిప్రమాణం ఇలా ఉంది.

"వసవః పితరో జ్ఞేయాః, రుద్రా జ్ఞేయాః పితామహాః ।
ప్రపితామహా స్తథాదిత్యాః, శ్రుతి రేషా సనాతనీ ॥"

(290పే) పిండత్రయరూపంగా అర్చింపబడుతూన్న "పితృపితామహ ప్రపితామహులు విష్ణుస్వరూపులు" అని మహావిష్ణువు స్వయంగా చెప్పినట్లు మహాభారతం పేర్కొన్నది. (12-345-21-2-3)

(293) కనుక పితరులను అర్చించినపక్షంలో వారి రూపంలో ఉన్న మహావిష్ణువే అర్చించబడుచున్నాడని చెప్పక తప్పదు.



## 'స్వధా పితృభ్యః' (అస్తు స్వధా)

పితృకార్యసందర్భాలలో అర్చించుటకు ఉద్దేశింపబడిన వారు పితృపితామహప్రపితామహరూపులైన మనుష్యపితరులే. ఐనా, ఆపితరులను అధిష్ఠించిఉన్న వసురుద్రాదిత్యులు, వీరలకు అధిష్ఠానరూపుడైన పరమేశ్వరుడు అనేదేవతలు అర్చింపబడుచున్నారు. ఈవిషయాన్ని స్ఫురింపజేయడానికిగాను "స్వధా పితృభ్యః" అని స్వధాకారం చేయబడుతూంది.

(295పే) "స్వర్గలోకం దధాతి యజమానస్య ఇతి స్వధా" అనే నిర్వచనం అనుసరించి; యజమానుణ్ణి స్వర్గలోకాన్ని పొందించడం అనే లక్షణం ఒక్కస్వధకే ఉంది.

"స్వధా"కారముతో పితరులను ఉద్దేశించి యజమానుని చేత పితరులకు ఒసంగబడే అన్నము, జలము మొదలైనవి తమయందు అంతర్యామిగాఉన్న శ్రీమన్నారాయణునిధరించునవియై 'స్వధా'రూపములై ఒప్పి, పితరులను యజమానులను తరింపజేయును" అని 'స్వధా పితృభ్యః' 'అస్తు స్వధా' అనే మంత్రాలు స్ఫురింపజేస్తున్నాయి. ఈవిధంగా పితృదేవతల కార్యాలలో రెండుశబ్దాల ఉచ్చారణవలన పుట్టినఫలం, మానవత్వంలో దేవత్వాన్ని సుప్రతిష్ఠితం చేస్తూ భారత సంస్కృతికి మహోన్నతత్వాన్ని ప్రసాదించినవిషయం విశదమయింది.

## యజ్ఞాలు - మహాయజ్ఞాలు.

'యజ' ధాతువునుంచి యజ్ఞశబ్దం పుట్టింది. దీనికి 'దేవతలకు చేసే పూజ' అని అర్థం.

"యజ్ఞము, సవము, అధ్వరము, యాగము, సప్తతంతువు, మఖము, క్రతువు" అనే ఆరునొక్క-పేర్లు 'యజ్ఞ' శబ్దానికి పర్యాయపదాలుగా ఉన్నాయి. ఈయజ్ఞాలనుగూర్చి గీత ఇలా గానంచేసింది.

"సహ యజ్ఞాః ప్రజా సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽస్త్విష్టకామధుక్ ॥" (3-10)

అనగా సృష్టికర్త ప్రజలతోబాటు యజ్ఞాలనుకూడా సృజించి "ఓప్రజలారా! మీరు ఈయజ్ఞాలను శాస్త్రోక్తంగా నిర్వహించడంద్వారా మీ మీఅభ్యుదయాలను సంపాదించుకొనండి. 'యజ్ఞ' నిర్వహణం అనే ఈక్రియ మీమీకోరికలన్నిటినీ తీరుస్తుంది" అని బ్రహ్మ ప్రజలతో చెప్పినాడట. ఈబ్రహ్మవాక్యం సర్వవిధాలా సత్యమయినదే అని యాగమంత్రాలు వ్యక్తంచేయగలిగిఉన్నాయి.

ఉదాహరణకు ఒకమంత్రభావమిది- "ఈయజ్ఞపురుషుడు ధనములకు, రత్నాదులకు ఇల్లే ఇంకా చక్కని పంటభూములకు, విశాలభవనములకు, శ్రేష్ఠవస్తువులకు కూడా అధిపతి అయి ఉన్నాడు. ఇట్టి యీయజ్ఞపురుషుడు యజ్ఞాలలో మా (సోమయాజివర్గం) చే ఆరాధింపబడినవాడై మాకు ఐహికముగాను, ఆముష్మికముగాను ఉపకరించే అశ్వగోప్రభృతిసంపదలను ప్రసాదించుగాక! ఈయజ్ఞవేదిక సత్పుత్రులను, భృత్యులను మాకు అనుగ్రహించుగాక."



ఇట్లు మానవుల ఐహికజీవితంలో అవసరమయిన అన్నిరకాలసంపదలూ ఈయజ్ఞాచరణంచేతనే సంప్రాప్తాలౌతున్నాయి.

దేవతలకు సంతృప్తిని కలిగించే మానవుల నిష్కామక్రియలన్నీ యజ్ఞక్రియలవంటివే ఔతాయనీ, స్వార్థానికి మాత్రమే ఉపయోగించే క్రియలు మానవులకు బంధనసంపాదకములే ఔతాయనీ- "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః" అనే గీతాసూక్తి తెలుపుతూంది. (3-9)

యజ్ఞాలలో సోమయాజివర్గం సమంత్రకంగా హోమంచేసే ఆజ్యపురోడాశవపాదిద్రవ్యాలు బాగాహుతమై (అగ్నిలో భస్మమై) ఆయజ్ఞాఽగ్నిద్వారానే ఆద్రవ్యాలు దేవతలకు చెందుతాయని దేవతలకు పర్యాయపదాలైన 'క్రతుభుజులు' 'బర్హిర్ముఖులు' అనే రెండుపదాలు తెలుపుతున్నాయి. ఇక అగ్నిలో సమంత్రకంగా హోమంచేసిన ద్రవ్యాలు సూర్యమండలాన్ని చేరి (ధూమరూపంలో) కొన్ని ప్రకృతిపరిణామాల ఫలితంగా అవి ఆసూర్యమండలమునుండి వర్షం కురిపిస్తాయనీ, ఆవర్షంవలన క్రమంగా అన్నసమృద్ధులు సంప్రాప్తములౌతాయనీ మనుస్మృతి చాటింది.

ఇక లోకంలో కరువుకాటకాలు బయలుదేరడానికి తగిన కారణాలేవి ? అని ఒకప్పుడు మహర్షులు సమావేశమై

చర్చ సాగించారనీ, ఆచర్చలో తేలిన సారాంశ మేమనగా యజ్ఞయాగాదివైదికక్రతువులను శాస్త్రోక్తంగా ఆచరించడానికి తగినయోగ్యతలుకలసోమయాజివర్గం, శాస్త్రంలో చెప్పబడిన (ఆయాకాలాలలో ఆచరించదగిన) యాగాలను ఆచరించకపోవడంచేతనే దేశప్రజలు అన్నంలేక మాడుతూంటారనీ, ఈవిధంగా లోకోపద్రవాలకు కారకులైన ఆసోమయాజి వర్గాన్ని ఆమహర్షిసంఘం కోపంతో మందలించిందనీ ఒక యజుర్వేదమంత్రం ఇలా తెలిపింది.

"యజ్ఞపతి మృషయ ఏన సాఽఽహుః, ప్రజా నిర్భక్తా అనుతప్య మానా మధవ్యౌ స్తోతా వపతౌ రరాధ...."

వైదికపరిభాషలో 'మధుమాసాలు' అనగా చైత్రవైశాఖమాసాలు. ఈరెండుమధుమాసాలలో సోమయాజివర్గం రెండుయాగాలను ఆచరించడంద్వారా లోకానికి క్షేమాన్ని కలిగించవలసిఉంది. ఆవిధంగా లోకానికి క్షేమంకరములు, హితంకరములు, ప్రియంకరములు ఐన ఆయాగాలను సలక్షణంగా నిర్వహించక ఆసోమయాజిగణం ఉపేక్షించినప్పుడు దేశీయులు ఆకలిబాధలకు లోనౌతూంటారనీ, ఈవిధంగా దేశంలో తలయెత్తిన తిండికొరతవంటి కరువుకాటకాలకు మూలకారకులైన సోమయాజివర్గాన్ని (యజ్ఞపతిం) ఋషులు కోపంతో అన్నారనీ (ఋషయ ఏనసాఽఽహుః) ఈమంత్రం సాక్ష్యమిచ్చింది. ఈసందర్భంలో ఇంకో వేదమంత్రభావం తెలుసుకోవలసి ఉంది.



చైత్రమాసం మొదలైన 12 మాసాలలో ప్రతిఒక మాసంయొక్క పౌర్ణమినాడు ఏనక్షత్రమౌతుందో, ఆనక్షత్రముయొక్క పేరే ఆనెలకు వస్తుంది. ఎలాగనగా- చిత్రానక్షత్రంతో కలిసిన పౌర్ణమికనుక చైత్రమాస మయింది. అంటే చైత్రమాసంలో వచ్చే పౌర్ణమినాడు చిత్రానక్షత్రమే వస్తుందన్నమాట. ఇలాగే వైశాఖపౌర్ణమినాడు విశాఖానక్షత్రమూ, జ్యేష్ఠపౌర్ణమినాడు జ్యేష్ఠానక్షత్రమూ వస్తూంటాయి.

ప్రస్తుతంలో చిత్రానక్షత్రంతో కూడిన చైత్రపౌర్ణమినాడు సోమయాజివర్గం, ఆసంవత్సరంమొదట చేయదగిన యాగానికి దీక్ష వహించవలసి ఉంది. ఈదీక్షాస్వీకరణం దేశక్షేమానికి మూలమౌతుంది. కనుక సంవత్సరం మొత్తంలో, దేశాభ్యుదయసిద్ధికోసం చేయదగిన యాగాల ఆచరణానికి చైత్రపౌర్ణమి ముఖంవంటిదై క్రమంగా ఇది ప్రజాక్షేమానికి నాంది ఔతూన్నట్లు ఈమంత్రార్థం ఇలా తెలుపుతూంది.

"చిత్రాపౌర్ణమాసే దీక్షేరన్ ముఖం వా ఏతత్సంవత్సరస్య యచ్చిత్రాపౌర్ణమాసో ముఖత ఏవ సంవత్సర మారభ్య దీక్షంతే...."

ఈచిత్రాచంద్రులయొక్క సంయోగం కల చైత్రపౌర్ణమినాడు కల శోభ చూపరుల చూపులకు వర్ణనాతీతంగా ఉన్నట్లు అనిపిస్తుంది. కారణ మేమంటే, సంవత్సరం మొత్తంలో చేయవలసిన యజ్ఞయాగాదిక్రతువులు అన్నింటికీ ఈచైత్రపౌర్ణమి నాంది ఔతూంది. ఈక్రతువులు

దేశాభ్యుదయసంపాదకాలు. కనుక ఆ అభ్యుదయాలన్నింటినీ ఆచైత్రపౌర్ణమి శోభారూపంలో సూచిస్తూంది.

వేదమంత్రగతభావాన్ని కాళిదాసకవి తన రఘువంశ మహాకావ్యంలో ఇలా తెలిపినాడు—

"సుదక్షిణాదిలీపదంపతులు పవిత్రవేషముతో తమకుల గురువైన వసిష్ఠుని ఆశ్రమానికి రథంమీద కలిసి వెడుతూండగా- మంచుతెరలు తొలగిన ఆచైత్రపౌర్ణమినాడు చిత్రాచంద్రులకలయికచే కలిగిన అద్భుతశోభవంటి శోభ ఆదంపతులను ఆవహించింది." (1-46)

ఇచ్చటి "కాళిదాసహృదయం" ఏమిటి? అంటే- సంవత్సరం పొడుగునా చేసే యాగాలకు చైత్రపౌర్ణమి ప్రారంభవాసరం కదా! ఆయాగాల ఆచరణంవలన దేశానికి కలిగే అభ్యుదయాలు చిత్రాచంద్రుల శోభారూపంలో గానవస్తాయి. వీరికి మంచుతెరలు తొలగినట్లే ప్రస్తుతం రాజదంపతులకూ శాపప్రభావం తగ్గింది. కనుక వీరికలయికలోకూడా అట్టి శోభ గానవచ్చింది. అంటే- వారికి అచిరభావిలో కలుగబోయే పుత్రోదయజనితకీర్తిశోభ. వారిని ముందుగానే ఆవహించినదని, వేదవిజ్ఞానవిరాజితుడైన కవికులగురువు సుందరసుకుమారభావనాభాసితంగా ఈఉపమానంతో వారిని వర్ణించినాడు. ఇట్లు సనాతన (నిత్య) వైదికసంప్రదాయాలు క్రమంగా విశ్వకళ్యాణసిద్ధికి విశిష్టమంగళతోరణములుగా పరిణమించడం గమనించదగి ఉంది.



ఇక సలక్షణమైన యజ్ఞతంత్రనిర్వహణంవలన రాష్ట్రప్రజలకు ప్రాప్తించే ప్రత్యేకప్రయోజనాలనుగూర్చి యజుర్వేదమంత్రం ఒకటి ఇలా చెప్తూంది-

"యద్వై యజ్ఞస్య సామ్నా క్రియతే రాష్ట్రం; యజ్ఞస్యాశీర్గచ్ఛతి యదృచా విశం యజ్ఞస్యాశీర్గచ్ఛతి...."

అనగా, యజ్ఞంలో ఒకచోట, సామవేదమంత్రాలు కొన్ని పఠించవలసిన అవసరంఉంది. ఆసామవేదమంత్రాల వినియోగంవలన పుట్టిన ఫలం, ఆమొత్తంరాష్ట్రంలో ఉన్న ప్రజలందరియొక్క అన్నాభివృద్ధికి కమనీయకారణమౌతుంది. ఇదేవిధంగా ఆయాగంలోనే మరోచోట ఋగ్వేదమంత్రాలను పఠించవలసిన నియమంఉంది. ఆఋగ్వేదమంత్రవినియోగజన్యఫలం, ఆరాష్ట్రప్రజల ఆయురారోగ్యాభివృద్ధులకు అధికంగా కారణమౌతుంది.

ఇట్లు ఒకేచోట జరిగిన ఒకే యాగక్రియాచరణంవలన ఆరాష్ట్రంలో నివసిస్తూన్న వారందరికీ ఆయుర్దాయాన్నాభివృద్ధులు అబ్బుతూన్నసందర్భంలో, దేశాంతరప్రజలకుకూడ ఆయాగనిర్వహణజన్యఫలం ప్రయోజనప్రదం ఔతుందనడంలో అనుమానం అనవసరం.

ఇక సోమయాజి యజ్ఞాగ్నిలో హోమం చేసిన ఆజ్యం, హవిస్సు మొదలైన ద్రవ్యాలు తాత్కాలికముగా భస్మమైపోయినప్పటికూడా ఆ ఆహుతిద్రవ్యాలు ఇంకోరూపంలో యజమానుడికి ఎన్నోరెట్లు అధికంగా వడ్డీవలె ఉపకరిస్తూంటా

యనీ, కనుక యజ్ఞాగ్నిలో హోమంచేసిన ఏ ఒకద్రవ్యం కూడా వృథాకాక అది కర్తకు అనేకవిధాలైన అభ్యుదయాలను అచిరభావిలో అమరజేస్తుందనీ, కనుక హోమంచేసిన ద్రవ్యం యజమానుడికి చెందినదేఅనీ ఒక వేదమంత్రం నొక్కి-వక్కాణించింది.

## మహాయజ్ఞాలు.

ఈ మహాయజ్ఞాలు అయిదు- (1) దేవయజ్ఞం, (2) పితృయజ్ఞం, (3) భూతయజ్ఞం, (4) మనుష్యయజ్ఞం, (5) బ్రహ్మయజ్ఞం అనేవి.

1. అగ్నిలో సమంత్రకంగా కర్త సమిధలను హోమం చేయడమనేదే 'దేవయజ్ఞం' అనబడుతుంది.
2. పితృదేవతలను ఉద్దేశించి యజమానుడు 'స్వధా' శబ్దోచ్చారణపూర్వకంగా చేసే తర్పణాలు (పితృదేవతలకి తృప్తిజనకాలుగనుక 'తర్పణాలు' అనే సార్థకనామం) 'పితృయజ్ఞం' అనబడుతుంది.
3. భూతములకు అనగా వివిధప్రాణులనుగూర్చి భూతబలి రూపంలో నేలమీద ఉంచే అన్నాద్యాహారద్రవ్యాలు 'భూతయజ్ఞం' అనబడుతుంది.
4. ఉత్తమబ్రాహ్మణులకు దేవతాభావనతో నిష్కామనగా తృప్తిగా అన్నం పెట్టడమనేదే "మనుష్యయజ్ఞం" అనబడుతుంది. ఇది ఆతిథ్యంలో ఒకభాగం.



5. ఇక ఋగ్వేదానికి చెందిన ఒక 'ఋక్' గాని, యజుర్వేద సామవేదాలకు చెందిన ఒకమంత్రాన్నిగాని సంధ్యావందనము చేసినపిమ్మట శాస్త్రోక్తంగా శ్రద్ధగా పఠించడమనేదే 'బ్రహ్మయజ్ఞం' అనిపించుకొంటుంది.

"మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ, బ్రాహ్మీయం క్రియతే తనుః"

అనే స్మృతిసూక్తిని బట్టి ఇట్టి యజ్ఞమహాయజ్ఞక్రియలను ఆచరించిన సోమయాజి శరీరం బ్రహ్మజ్ఞానప్రాప్తికి యోగ్యతకలదౌతుంది.

## మనసంస్కృతిలో "కర్మ"యొక్క ప్రభావం.

"మనం ప్రతీరోజూ ప్రతీక్షణంలోనూ శారీరకంగానో, మానసికంగానో ఏదో ఒకపనిని చేయకుండా ఉండలేం" అని భగవద్గీత—

"నహి తిష్ఠత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥" 3-5)

అని తెలిపింది. "ఈవిధంగా మానవుడు ప్రకృతిగుణములకు వశుడై, తాను ప్రతీక్షణంలోను అనివార్యంగా ఆచరించవలసిన ప్రతీ ఒక 'పని'కీ, ఆ 'పని'కి తగిన ఫలాన్ని కూడా అతడు పొందుతూనే ఉంటాడు" అనేది కర్మయొక్క మొదటిసిద్ధాంతం. ఈనియమముయొక్క స్వరూపస్వభావాలు బాగా తెలుసుకొన్ననాడు ఈసిద్ధాంతం నిత్యసత్యమైనదే అని కూడా తెలుస్తుంది.

లోకంలో కర్మ, ఆకర్మకు చెందినఫలం అనేవి రెండూ

వేర్వేరుగా ఉండక ఆకర్మకు చెందిన 2 దశలుగా ఉంటాయి. కాని మనకు ముందు కనిపించేది కర్మ, దానిఫలం తరువాత కనిపిస్తుంది. ఎలాగంటే ఒకవిద్యార్థి ఒకపరీక్ష వ్రాసినాడను కోండి. ఆవ్రాతపనికితగినఫలం ఏ రెండు నెలలలోకాని తెలియదు. కాని పరీక్షవ్రాత పూర్తి చేయగానే ఆవ్రాతకు తగినట్లు ప్యాసవడమో లేక ఫేలుకావడమో అనేది ఆవ్రాతలో మొదట సిద్ధమయ్యే ఉంది. కాని వీనిలో సామాన్యమానవులకు కనిపించేవి మొదట పని, చివర కర్మఫలం అనేవిమాత్రమే.

కాని మధ్యన జరిగే పరిణామాలు తపశ్శక్తికల మహాత్ములకే కనిపిస్తాయి. కనుక ఆతపోధనుల సత్యవాక్యముల యందు మనకు నమ్మకమున్ననాడు, ఏపని ఏవిధంగా ప్రారంభింపబడిందో, ఆపని ఏయేమధ్య పరిణామాలు చెందుతూ ఏ చివరి పరిణామం చెందినదో మనంకూడా తెలుసుకోవచ్చును.

ఇలా మనం తెలుసుకొన్ననాడు. మహర్షులు తమస్మృతిగ్రంథాలలో ఎటువంటిపనికి ఎటువంటిఫలం చెప్పినారో ఆఫలాలను తెలుసుకొనడంచేత, దుఃఖఫలాన్ని కలిగించే పనిని విడిచేసి, సుఖాన్నీ, శాంతినీ కలిగించే పనులనుమాత్రమే చేయడానికి తగిన అర్హత, అవకాశం మనకు ఏర్పడుతుంది. దీనినే "ఆస్తిక్య బుద్ధి" అంటారు. అనగా, "పరమేశ్వరశక్తి ప్రపంచం అంతటా వ్యాపించి ఉంది" అనే నమ్మక మన్నమాట. మొత్తం మీద "కర్మ, ఆకర్మతాలూకు ఫలం" అనే రెండూ ఒకే వస్తువులో ఉన్న రెండుదశలుమాత్రమే అని మనం నమ్మవలసి



ఉంది. మరో 2 ఉదాహరణలు చూపి ఈసిద్ధాంతాన్ని ఋజువుచేస్తాను.

ఒకడు ఆహారాన్ని తిన్నాడనుకోండి. తినడం అనే ఆ పనికి ఫలరూపంగా ఆకలితీరింది. కాని ఆహారం నోట్లో వేసుకొనడం, నమలడం, అది కడుపులోనికి వెళ్ళడం, తనస్థానాలలో అది సర్దుకొనడం అనేపనులుకూడా భోజనం అనే ఆ ముఖ్యక్రియలో అంగరూపాలైన క్రియలుగా ఉండనే ఉన్నాయి. అవి ఆభక్షణక్రియకు చెందినవేకాని ఎక్కడనుంచో వేరుగా వచ్చినవి కావు. కనుక ఏమని తేలింది ? ఆకలి తగ్గడం అనే ఫలం, మొదట ప్రారంభింపబడిన భక్షణకర్మయొక్క చివరస్వరూపంమాత్రమే అని తేలింది.

ఇదేవిధంగా మనం చెరువులోనికి ఒకరాయిని విసిరినామనుకోండి. అప్పుడు చిన్నఅలలు (చిన్న కెరటాలు) లేచి అవి క్రమముగా ఒడ్డును తాకుచూన్నట్లు మనకి కనిపిస్తాయి. కాని రాయి నీళ్ళలో పడడం, అలలు ఒడ్డును తాకడం మట్టుకే గ్రహించగలిగినవానికి మధ్యలో జరిగిన పరిణామాలు తెలియవు. కాని పనీ, ఆపనిమధ్యన జరిగే పరిణామాలను కూడా చూడగలిగినవానికి 'ఫలం' అనేది ఒకపనియొక్క చివరి స్వరూపమే అనే నిశ్చయజ్ఞానంకూడా కలుగుతుంది.

దీనినిబట్టి "మనం చేసిన ప్రతీఒక్కపనీ ఆపనితోనే ఆఖరుకాదుఅనీ, ఆపనియొక్క మార్పులు లేక పరిణామాలు ఏవో ఉండనే ఉంటాయనీ, మనకు తెలియనంతమాత్రాన

ఆపరిణామాలు లేకుండాపోయేవి కావనీ తేటతెల్లమౌతూంది. ఈనిదర్శనాలనుబట్టి ప్రతీపనియొక్క తీరుతెన్నులు వానిక్రమపరిణామాలు ఇలాగే ఉంటాయని బుద్ధిమంతులు సులభంగానే తెలుసుకోవచ్చును. ఇచ్చట ఇంకో విశేషం తెలుసుకోవాలి.

ఇంతవరకూ 'కర్మ' అనగా క్రియ లేక పని అని మాత్రమే తెలుసుకొన్నాం. సంస్కృతభాషలో పరిశీలన చేస్తే చేసేపనికీ, అనుభవింపబడే ఫలానికీకూడా కలిపి సమానంగా ఒకే 'కర్మ' శబ్దం ప్రయోగింపబడుతూన్నట్లు కనిపిస్తూంది.

"కర్మ కురు, అనుభూయతే కర్మ" అనే ప్రయోగాలలో ఒకే కర్మశబ్దం పనినీ, ఫలాన్నీకూడా తెలుపుతూ ఉపయోగింపబడింది. లోకంలోకూడా అనుకుంటూంటాం, "ఏ జన్మలో చేసుకొన్న కర్మోకాని ఈజన్మలో (ఫలరూపంగా) అనుభవిస్తున్నాం" అని. దీనినిబట్టి చూస్తే, చేయబడే పనీ, అనుభవింపబడే ఫలమూ అనేవి రెండూ ఒకేఒక 'కర్మ' యొక్క మొదటి తుది అవస్థలని తేలింది.

ఇంకోనిదర్శనం: విత్తనపుగింజల్లో ఆవిత్తనంకి చెందిన భావివృక్షవైశాల్యం అంతా ఇమిడిఉండి, ఆవిత్తనం పాతిన కొద్దిరోజులకే ఆవృక్షం విత్తనంనుండి పైకి వస్తుంది. ఇదే విధంగా మనం చేసే ప్రతీకర్మలో ఆకర్మఫలం దాగిఉండి పరిణామకాలానికి ఆఫలం బయటపడుతుంది. ఈపరిణామం స్వల్పకాలంలో రావచ్చు; సుదీర్ఘకాలంలో రావచ్చు.



ఇల్లు కర్మ, కర్మఫలాలసంబంధమూ ఆరెండింటిసంబంధమువలన పుట్టినశక్తిని తెలుసుకోలేనివాడు, ఆతెలియమివలన కలిగిన మూఢత్వప్రభావంచేత ఎంతటి పాపపుపనులనైనాసరే అనాలోచితంగానూ, అతిసులభంగానూ చేసేసి, వాని భయంకర ఫలితాలకు జంకడు. ఇట్టితెగకు చెందినవాని క్రియలు ఎంత అవివేకంగా ఉంటాయో ఊహించడానికి, చెప్పబోయే నిదర్శనం ఒక్కటే చాలు.

ఒకడు తన అరచేతితో బల్లపై గట్టిగా కొట్టి, అతడు ఆబల్లను గట్టిగా కొట్టినా ననుకొంటాడేకాని, తనచేతితో ఆబల్లనుఎంతగట్టిగా కొట్టినాడో ఆబల్లకూడా వెంటనే తనచేతిని అంత గట్టిగాను కొట్టినది. కాని అతడలా అనుకోనడే. ఇది పదార్థవిజ్ఞానశాస్త్రానికి చెందిన సిద్ధాంతం. కర్మసిద్ధాంతంకూడా ఇట్టిదే. అంటే చేయనిపనికి అనుభవం ఉండదు. మంచిచెడ్డల రూపంలో చేసినది, ఎప్పటికైనా మానవునకు అనుభవించక తప్పదు. ఈతప్పకపోవడం అనే విషయాన్ని ఒకసూక్తి ఇలా ఋజువుచేస్తూంది.

"నాఽభుక్తం క్షీయతే కర్మ, కల్పకోటిశతైరపి"

"తాను చేసుకున్న పనియొక్క ఫలం వేలాదిసంవత్సరాలు గడిచినా (ఎప్పటికో అప్పటికి) అనుభవించకతీరదు" అని దీని భావం. దీనినిబట్టి ఏజన్మలో చేసుకొన్నకర్మ ఐనా తరువాత ఏదో ఒకజన్మలో అనుభవించక తప్పదు.

రజోగుణం ప్రధానంగా కలవానికి చేదు, ఉప్పన,

పులుపు, కారంవంటి పదార్థాలే ఇష్టమౌతూ, ఆపదార్థాలను తినేవానికి అవి రజోగుణాన్ని వృద్ధిచేస్తాయి. కనుక, పూర్వజన్మలోని ఏవాసనచేత మానవునికి ఒకపనిచేయాలని ఇష్టం కలుగుతుందో ఆపనిని చేయడంచేత ఆవాసన వృద్ధినే పొందుతుంది. కనుక తనజీవితశ్రేయస్సును కోరుకునేవాడు, దుష్టవాసనలను కలిగించే ఏపనులనూ ఏజన్మలోనూ చేయకూడదనీ, మంచిపవిత్రభావాలను కలిగించే సత్కర్మలనే ప్రతీజన్మలో ఆచరించవలెననీ సిద్ధాంతంగా తేలిన సారాంశం. A (శ్రీజటావల్లభులవారి "ఆధ్యాత్మిక వ్యాసాలు" ఈనా వ్యాసానికి ప్రేరకం).

### హిందూమతంలో విశ్వకళ్యాణకరలక్షణాలు.

హిందూమతంలో ఏప్రామాణ్యగ్రంథాన్ని పరిశీలించినా ఆగ్రంథాలలో, ఆయాజాతులవారికి చెందిన ముఖ్యధర్మాలు చెప్పబడిఉంటాయి. దీనికికారణం. హిందూమతానికి 'వర్ణాశ్రమధర్మాలు' అనేవి ప్రాణములవంటివై ఉండడమే. దీనినిబట్టి "వర్ణాశ్రమ B ధర్మాలే హిందూమత మనేపేరిట పిలువబడుతున్నాయి." అనే విశిష్టవిషయం విశదమౌతుంది.

---

A. భగవద్గీతలోని "కర్మయోగం"లోని విశేషాలను తెలుసుకోవలెను. (ఇట్లే ప్రతీ 'కర్మ' ఆచరించవలసిన విధానమును గీతలోని 4వ అధ్యాయంలో 18వ శ్లోకం తెలిపినది).

B. 'వర్ణం' అనగా ఇక్కడ బ్రాహ్మణక్షత్రియాది 'జాతి' అనీ, 'ఆశ్రమం' అనగా బ్రహ్మచర్యాశ్రమం, గృహస్థాశ్రమంవంటి నాల్గు ఆశ్రమాలనీ అర్థం.



స్మృతిగ్రంథాలన్నింటిలో 'మనుస్మృతికి' ప్రత్యేక ప్రాధాన్యం ఉన్నట్లు- "యద్వై కించ మను రవద త్తద్భేష జమ్..." అనే వేదవాక్యం వ్యక్తం చేస్తూంది. కనుకనే, హిందూధర్మాన్ని గూర్చి సమగ్రంగా తెలిపే గ్రంథాలలో, మనుస్మృతిని మించిన గ్రంథం మరొకటి లేదని విజ్ఞులనిర్ణయం.

ఈస్మృతి పుట్టుకకు కారణం మనుస్మృతి ప్రారంభంలో ఇలా ఉంది-

"భగవన్ సర్వవర్ణానాం యథావ దనుపూర్వశః ।
అంతరప్రభవాణాం చ ధర్మాన్నో వక్తు మర్హసి ॥" (మను)

మరీచి మొదలగు మహర్షులు మనువువద్దకు వెళ్ళి ఇట్లడిగినారు- "ఓత్రికాలవేదీ! బ్రాహ్మణాదిసర్వవర్ణములవారియొక్క, వీరిమధ్యలో ఉన్న అవాంతరవర్ణములవారియొక్క ధర్మాలనుగూర్చి మాకు తెలుపుటకు నీవే తగినవాడవు" అని అడిగిన మహర్షులకు మనువు ఇలా చెప్పినాడు.

"ఈమనుశాస్త్రాన్ని నాకు బ్రహ్మ మొదట బోధించగా నేను భృగుమహర్షికి ఆశాస్త్రాన్ని ఉపదేశించాను. ఆభృగువు మీకీస్మృతిని బోధింపగలడు" అని తెలిపినాడు. ఇట్లు మనుశాస్త్రం వర్ణజాతిధర్మాలనుగూర్చి తెలుపుటకే ప్రారంభింపబడినదిగాన ఈగ్రంథానికి మరోపేరు- "వర్ణధర్మాలు-అవాంతరధర్మాలు" అనేది సార్థకంగా ఉన్నట్లు మనుశ్లోకం వల్లనే తెలుస్తూంది. ఇట్లే వర్ణాశ్రమధర్మాలకు ఇతరస్మృతులు కూడా ప్రాధాన్యం ఇచ్చినట్లు ఆగ్రంథగతవిషయాలే తెలుపగలిగిఉన్నాయి.

మానవసమాజ మనే సౌధానికి వర్ణాశ్రమధర్మాలు అనేవి పునాదిరాళ్ళవంటివి. అనగా మానవసమాజంయొక్క సర్వవిధశ్రేయస్సులు ఆసమాజంయొక్క మతరక్షణం మీదనే ఆధారపడిఉన్నట్లు గతచరిత్రలు తెలుపుతూనే ఉన్నాయి. రామాయణభారతాదిమహాప్రబంధాలలో కొందరు మహారాజులపరిపాలన బాగా సాగుటకు కారణం, ఆపరిపాలనలో వర్ణాశ్రమధర్మాలు సక్రమంగా వర్ధిల్లడమే మూలకారణమయినట్లు వర్ణింపబడినాయి.

వాల్మీకిమహర్షి శ్రీరామచంద్రప్రభువుయొక్క ఉత్తమోత్తమపరిపాలనమునువర్ణిస్తూన్న సందర్భంలో ఇలాఅంటాడు.

"బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా లోభవివర్జితాః ।
స్వకర్మసు ప్రవర్తంతే తుష్టాః స్వైరేవ కర్మభిః ॥"

(యుద్ధకాండ 131-99)

శ్రీరామచంద్రుని (రామ) రాజ్యం మూడుపువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధిచెంది ఆరాజ్యంలోని సర్వవర్ణములవారు శాంతిసౌఖ్యాలతో తులతూగుటలోగల మూలకారణం: ఆయాజాతులవారు, ఆశ్రమాలవారు తమతమ ధర్మాలను విడువక శ్రద్ధగా ఆచరించడమనేది ప్రజల శాంతిసౌఖ్యాలకు మూలమయినట్లు వాల్మీకిమహర్షి స్పష్టంగా తెలిపినాడు. కనుక ఏపాలకునిపరిపాలనలో ఏపాలితులులోభమోహాదులులేనివారై తమతమకర్మలను పరిపాలిస్తూ తద్ద్వారా సంతృప్తులౌతారో ఆపాలకుని రాజ్యమే 'రామరాజ్యం'గా పరిణమిస్తుందనీ,



ఇదే నిత్యసత్యమయిన హైందవధర్మమనీ ఉక్తనిదర్శనాలు చాటినవి. ఈనిత్యసత్య విషయాన్నే ఈగౌతమధర్మసూత్రంకూడా ఇలా రుజువుపరుస్తూంది-

"వర్ణా నాశ్రమాంశ్చ న్యాయతోభిరక్షేత్"

(గౌతమధర్మసూత్రం 11-9)

ఈచెప్పిన నిదర్శనాలవలన, దేశపరిస్థితులు బాగులేనప్పుడు ఆదేశంలో- వర్ణాశ్రమధర్మాలు చెడిపోయినవని గుర్తించవలసి ఉంటుంది. ఇక దేశం మంచిపరిస్థితిలోఉన్నదంటే, ఆదేశంలో ఆవర్ణాశ్రమధర్మాలు అందరిచే సక్రమంగా ఆచరింపబడుతూన్నట్లు గుర్తించవలసి ఉంది. దీనినిబట్టి హిందూమతధర్మాలలో వర్ణాశ్రమధర్మనిర్వహణకు ఎంతటి ప్రాధమ్యాన్ని మనమహర్షు లిచ్చారో ఊహించవచ్చును.

మన మన్వాదిస్మృతికర్తలు, దయ, సత్యము, శుచిత్వము మున్నగువానిని కూడ వర్ణధర్మాలలో చేర్చినారంటే ఈవిషయంకూడా ప్రత్యేకంగా గమనించదగిఉంది.

"సర్వేషాం సత్య మక్రోధో దాన మహింసా ప్రజననం చ"

(వసిష్ఠస్మృతి)

అనగా అన్నివర్ణాలవారికీ- "సత్యముపలుకుట, క్రోధం లేకపోవుట, దానగుణం కలిగి ఉండుట, అహింస, సంతానం కనుట అనే ఈగుణాలు కలిగిఉండడం 'ధర్మం'అనిపించుకొనును" అని ఈస్మృతిసూక్తికి అర్థం.

ఇంకా ఈ వర్ణవ్యవస్థను గూర్చి సవివరంగాను, సప్రమాణంగాను, 'హిందూమతము' అనే తమగ్రంథంలో కీ. శే. శ్రీజ.పురుషోత్తముగారిచే వ్రాయబడింది. ఈప్రస్తుత వ్యాసమునకుకూడా అదే ప్రోత్సాహముగాన శ్రీ పురుషోత్తమునికి నాకృతజ్ఞతాంజలు లర్పిస్తున్నాను.

'హిందూమతం' అన్నిమతాలవారికీ సర్వశ్రేయస్సులను సమకూర్చగలిగి ఉంది. అసలు 'మతం' అంటే 'ఇష్టమైనది' అని అర్థం. ఎదుటివానిని 'నీఅభిమతం' ఏమిటో చెప్పుమంటాం. అంటే నీకు బాగా ఇష్టమైనది ఏదో చెప్పుమని అర్థం. కనుక ఎవరిమతధర్మాలను (అది యెట్టిదైనాసరే) వారు శ్రద్ధగా మంచి గౌరవాదరములతో కాపాడుకోనడం వారి కనీసధర్మం.

కారణం : తన ఐహికాముష్మికజీవితాలకు స్వీయమతధర్మాలు సౌఖ్యశాంతులను, సర్వవిధశ్రేయస్సులను సమకూర్చగలిగి ఉన్నాయి. ఇన్ని మహత్తరప్రయోజనాలను సమకూర్చగల స్వధర్మాలను విడిచెయ్యడమనేది "ఆత్మద్రోహమై తనకు ఆధారమైన కొమ్మను తానే నరకుకొన్న" ట్లౌతుంది. ఈనిదర్శనాలనుబట్టి-ప్రస్తుతంలో (కారణమేదైనా) జరిగే 'మతంమార్పిడి' అనేది ఆమార్చుకొన్నవారికి ఘోరపాతకజనకమౌతూ, సర్వవిధారిష్టాలకు సమధికకారణమౌతూన్నసంగతిని గమనించవలసిఉంది.



## భారతీయుల తపోవనజీవితం.

పూర్వం మనపెద్దలు తమచివరిదశలో తమకున్న ఆస్తిని తనకొడుకులకు పంచి యిచ్చి భార్యతో సహా వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి, తదాశ్రమానికిచెందిన నియమనిష్ఠలతో ఏవనప్రాంతమునకో వెళ్ళి ప్రశాంతజీవితం గడిపేవారు. ఇది మహర్షులలో ఎక్కువగా కనిపిస్తుంది.

ప్రస్తుతం కాళిదాసీయ కావ్య తపోవనగత మహర్షుల మహితజీవితరీతులను ఇక్కడ సంగ్రహంగా చూపుతాను. సుదక్షిణాదిలీపదంపతులు సాయంకాలం వసిష్ఠాశ్రమాన్ని చేరిన సమయంలో ఆ దంపతుల కావసిష్ఠాశ్రమం ఇలా కనిపించింది.

“ఆతపోవనంలోని మునులు మరోవనంలోనుంచి సమిధలు, దర్భలు, ఫలములు చేతబట్టి తిరిగి తమ ఆశ్రమాన్ని చేరుకొనుచున్నారు. ఆమునులు ఆశ్రమానికల్లంతదూరంలో ఉండగా వారి త్రేతాగ్నులు తమ ఆహితాగ్నులైనవారికి అదృశ్యరూపంలో వచ్చి ఎదురేగుతున్నాయి. ఇంతటి ప్రభావం కల మహర్షులతో ఆవసిష్ఠాశ్రమం నిండిఉంది.”

(చూ. రఘువంశకావ్యం 1-49 శ్లో)

ఈశ్లోకవర్ణనంలో కాళిదాసకవి, “అగ్నులు తమ యజమానులకు అదృశ్యరూపంలో ఎదురేగడం, యజమానులు మరోవనంనుంచి సమిత్కుశఫలయుతపాణులై రావడం” అనే రెండువర్ణనలద్వారా ఈక్రింది శ్రౌతశాస్త్రసంప్రదాయా

లను రెండింటిని ఇట ప్రకాశింపజేశాడు. లోకంలో ఊరినుంచి వస్తూన్న తండ్రులవద్దకు వారి పిల్లలు, తమకు వారు మిఠాయిలు తెచ్చి ఉంటారనే ఆశతో తండ్రులకు ఎదురుగా పరుగెత్తుతారు. ఇదేవిధంగా ప్రస్తుతంలో "తండ్రులవంటి ఆహితాగ్నులకు పుత్రులవంటి వారి త్రేతాగ్నులు, తమకుభక్ష్యాల వంటి సమిధలు, కుశలు, ఫలాలను ఆయజమానులు తెచ్చి ఉంటారనే భావనతో ఆఅగ్నులు, వస్తూన్న యజమానుల వద్దకు ఎదురేగుతున్నాయి." అని కాళిదాసకవి వర్ణించినాడు. ఈవర్ణనకు మూలం- "సమిధః కృత్వా ప్రత్యేతి" అనే ఆపస్తంబశ్రౌతసూత్రం. (చూ. 6ప్రశ్న, 7పటలం4-13-1400)

ఈశ్రౌతవిషయాన్ని నా "కాళిదాసహృదయము" గ్రంథములో- "కాళిదాసు-శ్రౌతవిజ్ఞానము" అనే వ్యాసంలో వివరించి విశదీకరించాను (188పే). తండ్రులవద్ద పుత్రులు ఆత్మీయభావనతో సంచరించినట్లు ప్రస్తుతంలో 'వసిష్ఠాశ్రమంలో నివసించే ఆహితాగ్నులవద్ద వారి త్రేతాగ్నులు అదృశ్యంగా సంచరిస్తూన్నవి' అని వర్ణించడంద్వారా ఆమునులదివ్యశక్తిని వ్యంగ్యరూపంగా ఇట మహాకవి దీపింపజేశాడు.

ఇట్లే ఇంకా ఆదిలీపదంపతుల కాతపోవనం కనిపించిన తీరు తియ్యందనాలివి- "ఆతపోవనంలోని ఋషిపత్నులు, తమపర్ణశాలలవద్ద సంచరిస్తూన్న లేళ్ళకు ప్రతీరోజూ కొన్ని ధాన్యాన్ని ఆప్యాయంగా అందిస్తూంటారు. దానికి అలవాటుపడిన లేళ్ళు సరిగా అదేవేళకు ఆపర్ణశాలలద్వారాలవద్దకు



వచ్చి తమధాన్యభాగాన్ని పెట్టేవరకూ, తమకు కావలసిన భక్ష్యాలు పెట్టేవరకూ మారంపెట్టి తల్లులమార్గాన్ని అడ్డగించే సంతానంవలె, ఆలేళ్ళు ఋషిపత్నుల ద్వారమార్గాలను నిరోధిస్తున్నాయి."

అట్టి లేళ్ళతో నిండిన ఆతపోవనం ఆదంపతులఅంతరంగాలను ఆనందాశ్చర్యాలతో నింపుతూంది. ఈవర్ణనతో ఋషిపత్నులయొక్క సర్వభూతదయ, తమసంతానమందువలె సర్వప్రాణులయందు వారివాత్సల్యభావన అనే మహోదార గుణాలు మహాకవిచే ఇందు వ్యంగ్యరూపంలో ప్రకాశింపజేయబడినవి (రఘు 1-50).

ఇంకా ఆతపోవనంలోని మునికన్యలు తమపర్ణశాలలోని చిన్నిమొక్కలకు కుదురునిండా నీరు పోసి ఆనీటిని త్రాగడానికి వచ్చేపక్షులకు నమ్మకం కలగడంకోసం (ఆకన్యలు) ఆమొక్కలకు దూరంగా తప్పుకొంటున్నారట! (1-51)

ఇలా అన్ని జీవులకు విశ్వాసంకలిగేటట్లు తమజీవితాలను చిన్ననాటినుండి తీర్చిదిద్దుకొనడం అనే అలవాటు క్రమంగా బలపడినచో అది మానవులలో 'వసుధైకకుటుంబభావాన్ని' క్రమంగాబలపరుస్తుంది. ఇంకా ఆతపోవనమాదంపతులకు మరోచోట ఇలా కనిపించింది. "మునికుమారులు, పర్ణశాలలవద్ద ఎండబోసిన నీవారధాన్యాన్ని సాయంకాలం పోగుచేసినారు. ఆపోగులపక్కనే లేళ్ళు పడుండి ప్రశాంతంగా నెమరవేసుకొంటున్నాయి." (1-52)

ఇచ్చటి ఈవర్ణనచేత, వివేకగుణంలేని లేళ్ళుకూడా తమపక్కనేఉన్న ఆహారాన్ని ముట్టకుండా తమకర్తవ్యక్రియనే (నెమర) ఆచరిస్తూ పరమపవిత్రంగా అహింసావ్రతంతో ఆదర్శంగా (లేళ్లు) జీవిస్తున్నట్లు చిత్రించి, ఇట్టి పవిత్రభవ్య వాతావరణానికి తపోవనప్రదేశాలు ముఖ్యకేంద్రాలుగా ఉంటాయని మహాకవి ఇట నిరూపించాడు.

ఆతపోవన మాదంపతులకు మరోచోట ఇలా కనిపించింది- "అచ్చట ఆహితాగ్నులు ప్రజ్వలిస్తూన్న యజ్ఞాగ్నిలో హోమాలు చేసినప్పుడు ఆ హోమద్రవ్యాలు హుతమై (భస్మమై) అద్భుతమైన పరిమళాలతోకూడి వెల్వడే ధూమాలు, గాలిచే నలుమూలలా వ్యాపించి అవి ఆశ్రమంలోనికి వచ్చినవారిని పవిత్రింపజేస్తున్నాయి." (రఘు- 1-53)

ఇట్లు మానవుల బహిరాభ్యంతర భాగాలంతటిలో పవిత్రభావనను ఉజ్జ్వలమైన ఉదారభావసంపదను ఉదయింపజేయడంలో తపోవనజీవితం సర్వసమర్థమై ఉందనడంలో సందేహంలేదు.

అప్పటి క్షత్రియచక్రవర్తులకు, అప్పటి బ్రాహ్మణోత్తములయెడ కల దివ్యభావనను దీపింపజేస్తూ దిలీపచక్రవర్తి తనను కుశలమడిగిన వసిష్ఠమహర్షికి సవినయంగా ఇలా విన్నవిస్తాడు. "ఓగురువర్యా! సర్వవిధాలైన నారాజ్యాం



గాలు A కుశలంగా అనగా నిరుపద్రవంగా సాగుతూండడం అనేది సముచితమయినదే. కారణం, నాకు దేవతలవలన కలిగిన ఆపదలను, మనుష్యులవలన కలిగిన ఆపదలను B ఓ గురువర్యా! నీవు నీమంత్రశక్తిచేత నివారిస్తున్నావు. కనుక నా సామ్రాజ్యమంతా కుశలంగా ఉండడానికి నీతపశ్శక్తియే మూలకారణం (1-60).

మంత్రద్రష్టవైన ఓ మునీంద్రా! నీమంత్రశక్తిచేత దూరంలో (పరోక్షంలో) ఉన్న నా శత్రువులు జయింపబడుతున్నారు. కనుక, కంటికి కనిపించే లక్ష్యాన్నిమాత్రమే ఛేదించగల నాబాణాలు, నీమంత్రబాణాలచే నిరాకరింపబడినవివలె ఉన్నాయి. అనగా నీమంత్రసామర్థ్యం వల్లనే మా (చక్రవర్తి) పౌరుషం ఫలిస్తూ మాసామ్రాజ్యం సుభిక్షంగా ఉందని ఈమాటల్లోని భావం. (1-61)

ఇట్లే దేశికేంద్రా! నీవు శాస్త్రోక్తరీతిలో రోజూ అగ్నిలో హోమంచేసిన ఆజ్యపురోడాశాదిద్రవ్యాలుక్రమంగా సూర్యమండలంచేరి అవి, వర్షాలులేక ఎండిపోయిన సస్యాలను

---

A "స్వామి, అమాత్య, సుహృత్, కోశ, రాష్ట్ర, దుర్గ బలములు అనేవి సప్తరాజ్యాంగాలు.

B అగ్ని, జలము, వ్యాధి, దుర్భిక్షం, మరణం అనే ఈ 5 దేవతలవలన కలిగే ఆపదలు. ఇక ఆయుధాలవలన కలిగే భయమూ ఇట్లే దొంగలవలన, శత్రువులవలన, ప్రభుత్వంవలన, పృథివీపతిలోభం వలన మానవులకు కలిగే భయాలు 5 మానవీయభయాలు.

బ్రతికించే వర్షాలుగా తయారైనవి. అనగా కులపతివైన వసిష్ఠుడు అగ్నిలో చేసిన హోమాలు ప్రకృతిపరిణామాలతో సూర్యమండలం చేరి వర్షరూపం దాల్చి అవి, యెండిపోయిన సస్యాలను తిరిగి బ్రతికిస్తున్నాయి (1-62). నేను ఎన్నిపంచవర్ష ప్రణాళికలు కలిసివచ్చినా, మహర్షులు చేసిన 'సస్యోజ్జీవనం' అనే ఈమహాకార్యాన్ని సాధించలేవు. కనుక, ఆధ్యాత్మిక శక్తిముందు భౌతికశక్తి ఎందుకూ ఏమాత్రమూ పనిచేయదు. ఈసందర్భంలో ఒకక్షత్రియప్రభువు చెప్పిన మాటలిట స్మర్తవ్యాలు- "ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్." ఇంకా బ్రహ్మర్షిసత్తమా! నారాజ్యంలోని ప్రజలందరూ ఏవిధమయిన భయంకాని, ఈతిబాధలుకాని A లేకుండా పురుషునికి చెప్పబడినసంపూర్ణాయుర్దాయంతో ('శతాయుః పురుషః'- అని వేదంలో చెప్పబడినట్లు) వందేళ్ళుహాయిగా బ్రతుకుతున్నారంటే, అట్టి అభ్యుదయప్రాప్తికి ప్రథమకారణం నీ 'బ్రహ్మవర్చస్సే' B (1-63 శ్లో)

ఈవిధంగా భారతీయుల జాతీయజీవితం, దైనందిన జీవితం ప్రతీవిషయంలో "మూడుపువ్వులు ఆరుకాయలు"గా

---

A "అతివృష్టి రనావృష్టిః శలభా మూషికా శ్శుకాః ।
అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః ॥"
(కామందకః)

B "వ్రతాధ్యయనసంపత్తి రిత్యేతద్బ్రహ్మవర్చసం" హలాయుధ నిఘంటువు.



భౌతికంగాను, ఆధ్యాత్మికంగాను అభ్యుదయమార్గంలో పయనించడానికి, తపోవనగతులైన బ్రాహ్మణోత్తముల (మహర్షుల) వ్రతాధ్యయనాదితపస్సులే మూలకారణాలనే సంగతి, కాళిదాసకవీంద్రుని 'వసిష్ఠాశ్రమవర్ణనం' చేతనే రుజువయింది.

కనుక "ప్రపంచముయొక్క శ్రేయస్సంతా మహర్షుల తపశ్శక్తిమీదనే ఆధారపడిఉంది" అనక తప్పదు.

ఇక తనవద్దకు గురుదక్షిణకోసం వచ్చిన కౌత్సర్షిని గూర్చి రఘుమహారాజు చేసిన కుశలప్రశ్నలు, ఆనాటిచక్రవర్తులకు ఆనాటి తపోధనులయెడ గల ప్రత్యేక వినయవిశ్వాస భక్తిగౌరవాదరభావాదులను వేనోళ్ళ చాటుతున్నాయి.

(చూ. "రఘువంశమహాకావ్యం" సర్గ 5- శ్లో 4-10)

ఇక దుష్యంతచక్రవర్తి ఒకప్పుడు వేటాడుతూ క్రమంగా వచ్చి కణ్వాశ్రమంలో ప్రవేశించగానే ఆ ఆశ్రమం ఆమహారాజున కిలా దర్శనమిచ్చింది.

మాలినీవృత్తం:- "ఏచితనర్చితలిర్చినక్రోవుల నిమ్మగుతావుల జొంపములన్; బూచినమంచియశోకములన్ సురపొన్నల బొన్నలగేదగులన్; గాచి బెడంగుగ బండిన యూనిహకారములన్ గదళీతతులన్; జూచుచు వీనుల కింపెసగన్ వినుచున్ శుకకోకిలసుస్వరముల్" (ఆంధ్రమహాభారతం, ఆదిపర్వం- ఆశ్వా 4-21 పద్యం,)

వ. ఇట్లు హృదయసుఖావహంబగుచున్న యవ్వనంబులో నరిగి యరిగి యనవరతమహాద్విజపఠ్యమాన వేదధ్వను

లను, నవిచ్ఛిన్నహూయమానాగ్నిహోత్రస్వాహాశబ్దంబులను, ననేక మునిగణప్రణీత వచనవిషయవిభాగ వినిర్ణయ న్యాయ నిపుణవిద్వత్సభాసంభాషణఘోషంబులను, బ్రతిపక్షదుర్వ్యభేద ప్రమాణవిచార్యమాణ వేదార్థమీమాంసకగోష్ఠీవివాదనాదంబులనుం జేసి మ్రోయుచు, యజ్ఞప్రయోగప్రవీణులయిన యాజ్ఞికులకును, విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతలకును, నధికతపోనిరతు లయిన మహాతపోధనులకును నివాసంబయిన పుణ్యనదీతీరంబున, దద్దయు రమ్యంబయి గంగాతీరంబున నరనారాయణస్థానంబునుంబోలె జగత్పావనంబైన కణ్వమహామునియాశ్రమంబు గని యందు. (ఆంధ్రమహాభారతం 1-4-22)

సీ॥ "శ్రవణసుఖంబుగా సామగానంబులు,
చదివెడు శుకములచదువు దగిలి
కదలక వినుచున్న కరులయు,
గరికర, శీతలచ్ఛాయ దచ్ఛీకరాంబు,
కణముల చల్లనిగాడ్పునపడి దాని,
జెంది సుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి,
పెట్టు నీవారాన్నపిండతతులు,
తే॥ గడిగి భక్షింప నొక్కట గలసి యాడు,
చున్న యెలుకలు బిల్లులయెండు సహజ
వైరివర్గంబులయు సహవాసమపుడు
చూచి మునిశక్తి కెంతయు జోద్యమంది."
(1-4-23 మహాభారతం.)



ప్రస్తుతం 'మునిశక్తి' యొక్క అద్భుతప్రభావాన్ని చూసి దుష్యంతచక్రవర్తి అధికాధికంగా ఆశ్చర్యపడినాడు. వారి కీశక్తి ఎక్కడనుంచి ఎలా వచ్చిందంటే- వారి తపోవన జీవిత రీతుల్లో ముఖ్యాలైన వేదవిహితకర్మాచరణం, నియమపూర్వకతపశ్చరణం; ఆయా సమయాల్లో ఆచరించవలసిన యజ్ఞయాగాదుల నిర్వహణం; ఉపవాసవ్రతదీక్షాదులు; సకాలంలో సంధ్యాజప, ఉపాసనహోమాదులు అనే వారి దైనిక జీవికారీతులే ఆమునులకు అట్టి అద్భుతశక్తులను ప్రసాదించినవని చెప్పవలసిఉంది.

"సహవాసేన దోషగుణాః భవంతి" అనే సూక్తినిబట్టి, మహామహిమాన్వితమహర్షిగణంతో కలసి రాత్రింబగళ్ళు వారిసాహచర్యం చేయడంచేతనే అచ్చటి పశుపక్ష్యాదులకూ, అతిహింస్రులైన సింహాదిజంతువులకు వానివైరివర్గమునకు కూడా సహజంగా వచ్చిన వారి జాతివిద్వేషాదులు మరచి అవి ఒక్కచోట హాయిగా సహజసోదరభావంకలవివలె జీవించగలుగుతూన్నాయి. జన్మతో వచ్చిన క్రౌర్యవైరాదిభావాలకు పూర్తిగా వశమై ఉన్న జంతువులలో ఇట్టి అద్భుతపరిణామం కలగడానికి ఏది మూలం అంటే- "మునిశక్తే మూల" మనక తప్పదు.

"నియమాత్ శ్రేయ ఆప్నోతి" అనే సూక్తినిబట్టి "మానవజాతి తమతమనియమాలను అనగా విధులను సక్రమంగా సకాలంలో నిర్వహించిననాడు పవిత్రశక్తులను,

శ్రేయస్సులను సంపాదింపగలుగుతారు" అని శాస్త్రాలు చాటుతున్నాయి. కనుక, మానవుల దైనందినప్రవర్తనలమీదవలె పశుపక్ష్యాదులమీదకూడా పరిసరప్రభావాలు పడకమానవు. కనుకనే "సజ్జనసాంగత్యం సర్వాఽభ్యుదయసంధాయకం" ఔతుందని భర్తృహరిమహాకవి మూడు కాలాలలోనివారికీ హితంకరమైన "సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసాం" అని విశ్వానికే విశిష్టసందేశాన్ని ఇచ్చాడు.

మేరుపర్వతంయొక్క పరిసరాల్లో ఉండడంవలన, జాతిచేత కాంతివిహీనాలైన గడ్డిపరకలుకూడా కాంచనకాంతులు కలవౌతాయి. సూర్యపరమాత్మయొక్క తేజస్సంబంధంచేత, ప్రపంచగతవస్తుజాతం అంతా తేజోమయం ఔతుందికదా! ఇచ్చటి 'తేజస్సు' అనే పదానికి 'కాంతి' అనే అర్థమూ ఉంది. ఇంకా, చెడ్డవారి చెడ్డగుణాలను మాటుపరచే మహాత్ముల దివ్యశక్తికూడా 'తేజస్సు' అనబడుతుంది. A. కనుక 'తేజశ్శక్తి'తో తేజరిల్లుతూన్న మహాత్ముల సన్నిధిలో చెడ్డవారి చెడుతనంకూడా "మంచి"గానే మారుతుంది. ఇటువంటిశక్తిని సంపాదించడానికి, పవిత్రప్రశాంతభవ్యవాతావరణభరిత తపోవనజీవితమే పరమసాధనం అనేది నగ్నసత్యం. ఈసత్యాన్ని సంప్రకాశితం చేసే మరోసన్నివేశాన్ని సమవలోకించండి.

A. "....తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా। భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత" అనే దైవీసంపదకు చెందిన గుణాల్లో 'తేజస్సు' అనేది ముఖ్యమైనది. (చూ. దైవాసురసంపద్విభాగయోగం (గీత) 16-1-4)



దుష్యంతచక్రవర్తి కణ్వాశ్రమంలో ప్రవేశించగానే చెలికత్తెలతో కలిసి శకుంతల లతలకు కుండలతో నీళ్ళు పోస్తూంటుంది. వారినిచూడగానే ఆమహారాజునకు సహజసౌశీల్యసమలంకృతసౌందర్యసర్వస్వసందర్శనంచేత సహజమాధుర్యరసభరిత మకరందపానముచేతవలె మహారాజుయొక్క మనోనేత్రేంద్రియాలు అవ్యక్తమైన హాయితో ఆనందపరవశాలైనవి. అప్పుడు మహారాజు ఇలా అనుకొంటాడు. "తపోవనవాసినులైన వీరిసహజసౌందర్యసౌకుమార్యాదులు అంతఃపురస్త్రీలకుకూడా అలభ్యములేఐ ఉన్ననాడు, సహజసుగుణయుతతపోవనలతలచే అంతఃపురోద్యానలతలు దూరీకృతాలైనవి." A

అనగా అంతఃపురస్త్రీలలో ఉన్న కృత్రిమత్వాది రాజసప్రధానగుణాలు, తపోవనవాసినులలో లేనికారణంగా, వారిలో ప్రకృతిసిద్ధంగా ఉన్న పవిత్రాకర్షణశక్తి అంతఃపురస్త్రీలలో అంతరించిందన్నమాట. నిజానికి మహారాజభవనాలలో లభించే భోగసౌఖ్యాదులు, శరీరపోషణాదులు వనవాసినులకు లభించవు. ఐనా మహర్షియొక్క అలౌకికశక్తిమహిమచేతనే అట్టి అలౌకికసౌందర్యాదులు తపోవనవాసినులలో తొణికిసలాడుతూంటాయి.

కనుక వీరి సహజరూపాదులు అంతఃపురస్త్రీలకు అలభ్యాలుకావడం యుక్తమే. ఇంకా వారిది ధర్మపురుషార్థప్రధానజీవితం; వీరిది కామపురుషార్థప్రధానజీవితం. ఈజీవిత

A "శుద్ధాంతదుర్లభ మిదం వపు రాశ్రమవాసినో యది జనస్య।
దూరీకృతాః ఖలు గుణైః, ఉద్యానలతావనలతాభిః" (శాకుం- 1-17)

ధ్యేయాలుకూడా తాపసస్త్రీల సహజరూపాతిశయాదులకు కమ్మని కారణాలౌతాయి.

ఇంకా కామకళావిశారదుడైన మహారాజుయొక్క కామవాగురలో చిక్కడం అనేది, శకుంతలయొక్క శాంతినికేతనజీవితానికి తాత్కాలికంగా చిన్నకళంకమే అయింది. ఈసన్నివేశాన్నే సూచిస్తూ రవీంద్రకవీంద్రుడు, "అరణ్యక పుష్పంమీద 'దుమ్ము' పడింది. తాత్కాలికమైన ఆధూళి పతనం ఆపుష్పంయొక్క లలితలావణ్యశోభకు ప్రతిబంధ సామగ్రికాలేదు" అని ఆసన్నివేశాన్ని లలితలలితంగా చిత్రించినాడు. A.

శకుంతలకు కలిగిన ఈకాముని ఆఘాతాన్ని క్రొత్తదైన దూర్వాసమునిశాపమనే పెద్దఆఘాతంతో మహాకవి నివారించి, ఆకుసుమసుకుమారగాత్రిని తిరిగి మారీచాశ్రమంలో తాపసిక జీవితానికే అలవాటుచేయడంద్వారా, ప్రబలకామంయొక్క హాలాహలఘాతంనుంచి ఆమెను కాపాడినాడు. ఇంతటి మహాప్రయోజనసిద్ధికోసమని మనకవికులగురువు దూర్వాసముని శాపకథను స్వకపోలకల్పితంగా తన శాకుంతలనాటకంలో ప్రవేశపెట్టినినాడు, శకుంతలజీవితం, మహోన్నతము,

---

A. "Dust settles on the flower of the forest. But inspite of it she easily retains her own beautiful cleanliness"

నాతొలిరచన "కాళిదాసహృదయము' లో ఈవిషయం విశదీకృతమయింది. (పేజీ_91_2)



ప్రపంచజేగీయమానము ఐన "భరతమాత" పదవిని పొందలేకపోయేది. అచిరభావిలో ఈమహోన్నతపదవిని అలంకరింపజేసే 'అర్హత' కోసమే కాళిదాసకవి మొదటినుంచీ శకుంతలమానసికప్రవృత్తిని, "వసుధైకకుటుంబక" భావభాసితంగా తీర్చిదిద్దుతూనే వచ్చాడు.

ఈసత్యాన్ని నిరూపించే చక్కని యీసన్నివేశాన్ని తిలకించండి. కణ్వమహర్షి శకుంతలను క్రొత్తగా రాజ(రాజస) భవనానికి అనగా అత్తారింటికి అంపుతూ "శకుంతల అత్తారింటికి వెళ్ళడానికి ఆమెకు అనుజ్ఞ ఇమ్మని" ఆమహర్షి తపోవనగత తరువులను ఉద్దేశించి ఇలా అంటాడు.

"అహో! సన్నిహితదేవతాస్తపోవనతరవః!" "నిత్యమూ సమీపించి ఉన్న దేవతలుగల ఓతపోవనవృక్షములారా! ఏ శకుంతల ముందుగా మీరు నీరుత్రాగనిదే తాను నీరు త్రాగేది కాదో, ఇక పువ్వులు ముడుచుకోనడమంటే మురిసిపోయే ఏశకుంతల మీయందుగల స్నేహవిశేషంచేత మీయొక్క చిగురుటాకునుకూడా ఎప్పుడూ త్రుంపియెరుగదో, మీకు క్రొత్తగా పువ్వుపుట్టిన సంతోషసమయంలో ఏశకుంతల తాను (పుత్రోత్సవంవంటి) ఉత్సవాన్ని జరుపుకొనేదో అట్టి మీతపోవనప్రియబాంధవి శకుంతల నేడు పతిగృహానికి వెళ్ళుచున్నది. కనుక మీరందరు ఆమెకు అనుజ్ఞ నొసంగండి."

ఈవిశేషణాలు, శకుంతలయొక్క "సహజప్రకృతిప్రేమ"కు నిలువుటద్దాలు పట్టుతున్నాయి. మూర్తీభవించిన

ఈప్రకృతిప్రేమే ఆమెలో "వసుధైకకుటుంబక" భావనా రూపం దాల్చి ఆమెను 'భరతమాత'గా పరిణమింపజేసినది కదా! ఇదంతా తపోవనగతపరిష్కృతావరణమహిమ అనక తప్పదు.

ఇక కణ్వర్షి, శకుంతలకోసం తపోవనతరువులనుండి పుష్పాలుతీసుకొని రండని శిష్యులను పంపగా వెళ్ళిన ఆశిష్యులకు, ఒకవృక్షం మంగళకరమైన పట్టుచీరెను ఆవిష్కరించింది. ఇక మరోవృక్షం, శకుంతలపాదాలంకరణగా ఉపయోగించే- (తనకు తగినభర్తతో కలిసి క్రీడించుటకు దోహదమైన) రంజనద్రవ్యాన్ని ద్రవించగా, వనదేవతలు ఆమెకు తగిన అలంకారాలను, తమచేతులుమాత్రమే కనిపించేటట్లు అనుగ్రహించాయి. ఇదంతా కణ్వర్షియొక్క తపశ్శక్తియేకదా! (చూ. శాకుంతలనాటకం 4 అంకం -5 శ్లోకం).

ఇక తపోవనంలో శకుంతల పెంచి పెద్దచేసిన లతలలో ఒకలలితలతకు ఆమె, 'వనజ్యోత్స్న' అని ముద్దుపేరుపెట్టి పెంచింది. ఆమె అత్తారింటికి వెడుతూ ఆలతతో ఇలా అంటూంది. "ఓవనజ్యోత్స్నా! నీవు నీకుతగిన భర్తను (తియ్యమామిడిచెట్టు) సంపాదించి కలిసి ఉన్నావు. ఐనా నాకేసవ్యాపించి ఉన్న నీశాఖాబాహువులతో నన్నొకసారి గట్టిగా కౌగిలించుకో. ఎందుకంటే ఇక, నేను నీకు దూరమౌతాను." A.

---

A. "వనజ్యోత్స్నే! చూతసంగతాపి ప్రత్యాలింగ మామితో గతాభి శ్శాఖాబాహుభిః। అద్యప్రభృతి దూరవర్తినీ ఖలు తే భవిష్యామి" (చూ. శాకుం-అంకం 4 శ్లో 12 తరువాత)



ఇంతటి మహోదాత్తమైన "ప్రకృతిప్రేమసుధ" ఒక్క తపోవనజీవితంలోనే ఆమెకు లభ్యమయింది. ఈప్రేమే 'విశ్వప్రేమ'గా పరిణమించి శకుంతలను 'భరతమాత' అనే మహోన్నతపదవిలో ప్రవేశపెట్టింది.

ఇక గిరిజాకుమారికూడా పరమేశ్వరుని పొందుటకై గౌరీశంకరశిఖరంపై తపస్సు చేస్తూన్నప్పుడు, అచ్చటి తపోవనంలోని చిన్నవృక్షాలను పుత్రప్రేమతో కూడిన "ఘటస్తనప్రస్రవణాలతో" పెంచిందట. చెట్లకు నీరు పోసేటప్పుడు ఆగౌరి, కుండలు అనే స్తనములలోని ప్రస్రవణములు అనగా నీరు స్రవింపజేయడం అని చెట్లవిషయంలో అర్థం వస్తుంది.

ఇక పుత్రునివిషయంలో కుండలజంటవంటి స్తనయుగంలోని ప్రస్రవణాలు అనగా పాలచేపు అని అర్థం. అనగా చెట్లయందుకూడా ఆతపస్విని పుత్రప్రేమవంటి ప్రేమనే చూపించినది. ఇలా ఆమె చూపింది అనడానికి తగిన నిదర్శనం ఏమిటంటే- ఆమెకు వివాహానంతరం పుట్టిన కుమారస్వామికూడా, తనతల్లికి మొట్టమొదట ఆవృక్షములయందు కలిగిన 'పుత్రప్రేమ'ను తగ్గించలేకపోయాడు. (చూ. కుమారసంభవకావ్యం 5-14).

ఈవిధంగా కాళిదాసకవీంద్రుడు తన కుమారసంభవ శాకుంతలకావ్యనాయికలకు తపోవనంలో తపశ్చరణసమయంలోనే ఇట్టి ప్రకృతిప్రేమ సుధామయమైన "విశ్వప్రేమను" విరాజిల్లజేసి శకుంతలను "భరతమాత"గాను, గిరిజాకుమారిని

'జగన్మాత'గాను, రూపొందించి, ప్రపంచచరిత్రలో, 'తపోవన జీవితం'లో తాపసజనమున కేర్పడిన దివ్యశక్తులను, దివ్య మహిమలను తనకావ్యాదర్శాలలో ఆచంద్రతారకంగా వెలయు నట్లు దీపింపజేసినాడు.

ఇట్లే కాళిదాసకవి కావ్యనాయికలయొక్క 'ప్రవిమల ప్రకృతిప్రేమ' సోదాహరణంగా నా తొలికృతి "కాళిదాస హృదయము"లో "కాళిదాసు - ప్రకృతిసహజీవనము" అనే ప్రకరణంలో వివరింపబడింది. ఈసందర్భంలో, కీ. శే. ఆంధ్ర ప్రభుత్వాస్థానకవివర్యులు- "విద్యావారిధి, మహామహోపా ధ్యాయ, కళాప్రపూర్ణ"బిరుదాంచితులు శ్రీమాన్ కాశీకృష్ణా చార్యులవారు ఆనాతొలికృతిపై ఇచ్చిన అభిప్రాయ మిది.

"... మహాశయా! మీ'కాళిదాసహృదయము' అను సంహితను చదివించుకొని నాపొందిన యానందమునకు మితి లేదు. కాళిదాసవిశ్వప్రేమ నాకళించుకొని యారాధించెడి మీయకుంఠప్రతిభ విశ్వాతీతము.

కాళిదాసమహాకవి గంభీరహృదయగతాత్యంతరహస్య బహుముఖార్థములను మీవలె కూలంకషముగ గ్రహించి, ఆస్వాదించి, ఇంత సరససరళమంజులవిమలపంక్తుల వివరించిన పండితులను నాతొంబదియారేండ్ల యనుభవమున నిప్పటి కెందును గని విని యుండనుసుడీ. వయసునమాత్రము పెద్ద నగుట నమస్కరింపబోక, 'కాళిదాసరహస్యసర్వస్వాభిజ్ఞ' బిరుదోపహారముతో మీకు మరల నితోధికాభ్యుదయాభి



వృద్ధి సిద్ధించుగాత మని నాహృదయపూర్వకాశీస్సుల విస్త రించుచున్నాడ." (3-6-66. గుంటూరు)

## భారతీయసంస్కృతిలోని విజ్ఞానము.

ప్రస్తుతం 'సైన్సు' అనబడే శాస్త్రానికి అందని విశిష్ట విజ్ఞానం భారతీయవేదాలలో ఉన్నట్లు, శ్రీ అరవిందయోగి వేదమంత్రాలనుగూర్చి చెప్పిన ఈవాక్యాలు వ్యక్తంచేస్తు న్నాయి.

"వేదమంత్రములు మానవబుద్ధితో ఆలోచించి రచింప బడినవి కావు. 'సత్యము' ఋషుల హృదయమునుండి బయ ల్వెడలినది. అంతర్జ్యోతియే వేదమును ఆవిష్కరించినది. ఆలోచనకాని, బుద్ధికాని ఆవిష్కరింపలేదు. ఆతరువాతకాలము వారు బుద్ధితో ఆలోచించి గ్రంథములను రచించినారు. కనుక వీరి యేగ్రంథమునుకూడ వేదమువలె దోషరహిత మును, నిర్మలసత్యబోధకమునుకాదు...." (చూ. "భారతీయ విజ్ఞానము" 61 పేజీ)

కీ. శే. 'ఆర్షవిద్యాభూషణ' శ్రీ జటావల్లభుల పురుషోత్తము M. A. గారు "భారతీయవిజ్ఞానము" అనే శీర్షికలో వ్రాసిన కొన్నివాక్యాలను (సులభరచనలో) ఇట ఉద్ధరించుచున్నాను.

(పేజీ 70) "భారతీయ జ్యోతిషశాస్త్రమును బట్టి మానవజీవితచరిత్రాంశములను ఎంత చక్కగా తెలుసుకొన వచ్చునో అనేది అనేకులకు తమ అనుభవమునుబట్టి తెలి

సియే ఉండును... సమ్మతగిన మాటలతో యావద్భారత విఖ్యాతిగల అనేకమంది ప్రముఖులు వెల్లడించిన తమ అనుభవమును బట్టి ఈజ్యోతిశ్శాస్త్రమహిమను తెలుసుకొనవచ్చును. అట్టి ఇద్దరు ప్రసిద్ధపురుషుల అనుభవవచనములను ఇట ఉల్లేఖించుచున్నాను. (పండిత మదనమోహనమాలవ్యా జ్యోతిషమహాసభలో 1936)

"నేను పుట్టినపుడు ఒకజ్యోతిష్కుడు, నాతండ్రి ఒక సంవత్సరములో చనిపోవునని చెప్పెను. అట్లే జరిగెను" ఎం. ఆర్. జయకర్.

" భూత భవిష్యద్వర్తమానములను తెలిపెడు విద్యలు మనదేశమున అనేకములు కలవు.

నా అనుభవమున ఒకదానిని నేనిట చెప్పవలసి ఉన్నది. ఒకవేసవిలో నేను మాయింటికి ఈశాన్యభాగమున బావి త్రవ్వించుచు ఆపని పూర్తికాకుండగానే 200 మైళ్ళ దూరములోగల ఒకయూరికి వెళ్ళవలసివచ్చెను. ఆయూరిలో నొకగుప్తవిద్యానిపుణుడు నన్ను చూచి 'మీరు నుయ్యి త్రవ్వించుచు అది పూర్తికాకుండ ఈయూరికి వచ్చినారు' అనిచెప్పెను. నేను ఆశ్చర్యచకితుడనైతిని. ఏశాస్త్రం వలన ఆయన ఇది చెప్పగల్గెను? అనునది, ఆధునికులు నేడు అంగీకరించిన సైన్సుమాత్రము కాదు."

"నాడీజాతకముల మహిమ వర్ణనాతీతము. తలిదండ్రుల పేర్లుకూడ నాడీజాతకములో తెలుపబడియుండును. ఇంకను



ఇతరవిషయములుకూడా ఆశ్చర్యముగా తెలుపబడును. కొన్ని నాడీజాతకములలో జాతకుడు తనజాతకమును చూపించుకొను దినముకూడ ముందుగానే వ్రాయబడియుండును. ఇట్టి జ్యోతిషము ఇతరదేశములలో లేదు..."

అవయవముల స్వరూపమును రేఖలనుబట్టి జీవితమును తెలిసికొనువిద్యను హిందువులే అందరికంటె ముందు కనుగొని, దానికి సాముద్రిక మని పేరుపెట్టిరి...

"గ్రహణములకు మనుష్యజీవితముపై నెట్టిప్రభావమున్నదో హిందువులే కనిపెట్టిరి. ఆవిషయములు నేటికిని సత్యములుగానే యున్నవి. సాముద్రికశాస్త్రమును హిందువుల నుండి క్రమంగా చైనావారు, పారశీకులు, ఈజిప్టువాసులు, గ్రీకులు నేర్చుకొనిరి..."

...పింస్సానన్ అను గ్రీకువిద్వాంసుడు ఈశాస్త్రగ్రంథముయొక్క ప్రతినొకదానిని సువర్ణాక్షరములతో వ్రాయించి 'ఇది, యున్నతమనస్కులును, జిజ్ఞాసువులు ఆదరింపదగిన శాస్త్రము' అను సందేశముతో అలెగ్జాండరుచక్రవర్తికి పంపెను... సంఖ్యాశాస్త్రవిషయములలోకూడ గురుపీఠము భారతదేశానిదే" యని కీరో వ్రాసియున్నాడు.

"నేను తూర్పుదేశసంచారము చేసినపుడు ఒకానొక శాఖకు చెందిన బ్రాహ్మణులవద్ద గుప్తవిద్యాగ్రంథములను చూచితిని. నేను వారివలన అనేకవిషయములను నేర్చుకొంటిని... సంఖ్యయొక్క ప్రాముఖ్యమును, అంతరార్థ

మును, వానికి మానవజీవితముపై గల ప్రభావమును, సంబంధమును నేను వారివలన గ్రహించితిని. తరువాత ఈసిద్ధాంతములను నేను ఉపయోగించితిని. అవి యన్నియు సరియైనవే యని నాయనుభవమువలన తెలిసికొంటిని. ప్రాచీనహిందువులు అట్టివిద్యలలో నిష్ణాతులుగ నుండిరి."

## మంత్రవిద్య.

మంత్రములమహిమను అంగీకరించుట అధునికతకు లోప మనుకొన్నవారు కొందరున్నారు. కాని వీరికి ఈయాధునికత నొసగిన పాశ్చాత్యులే మంత్రమహిమను అంగీకరించవలసివచ్చింది. S ఢిల్లీలో ఇటీవల ప్రలువురకు ప్రత్యక్షానుభవములోనికి వచ్చిన ఒకమంత్రమహిమ వృత్తాంతమును 17-1-56 నాటి హిందూపత్రికనుండి ఇచట నుల్లేఖించుచున్నాను.

"62 సంవత్సరములుగల ఒక దాక్షిణాత్యస్త్రీ (అనంతలక్ష్మి) మంత్రమువలన ఢిల్లీలో నికరోల్ బాగ్‌లో కామెర్లవ్యాధిని కుదుర్చుచున్నది. ఆవితంతువు విఘ్నేశ్వరుని పూజించుచు మంత్రమును పఠించును. ఒకకొబ్బరికాయ, రెండు సూదులు, రెండుపాత్రలుమాత్రమే ఆమెకు పూజలో కావలసివచ్చును. ఆమె చికిత్సవలన రోగముపోగొట్టుకొన్నవారిలో ఉన్నతప్రభుత్వోద్యోగులుకూడ కొందరు కలరు. ఇట్టిమంత్రవిద్య భారతదేశముయొక్క పెన్నిధానములలో నొకటి."



12-7-59 తేదీని శ్రీరంగములోని రంగనాథస్వామికి మహాసంప్రోక్షణము జరిగెను. ఈసందర్భమున 13-7-59 నాటి హిందూపత్రిక తనకు శ్రీరంగమునుండి 12-7-59ని స్వకీయవిశేఖరినుండి వచ్చినవార్తను వివరముగ ప్రచురించినది. అందలి ముఖ్యవాక్యా లివి.

"పాంచరాత్రాగమములో విద్వాంసులైన ప్రధానాచార్యులు స్వర్ణవిమానముమీద ఉదయము 8-30 గంటలకు మహాసంప్రోక్షణము చేయుచుండగా రెండుగరుడపక్షులు విమానమునకు తిన్నగా నెత్తిమీద తిరుగుచూ ఎగిరినవి".

విష్ణ్వాలయసంబంధమైన సంప్రోక్షణము జరుగుచుండగా నటకు గరుడపక్షు లాకర్షింపబడుటలోని రహస్యము మానవబుద్ధికి అందునది కాదు. మంత్రతంత్రముల ప్రభావము సామాన్యబుద్ధులకు అతీతమైనది.

"విష్ణుసంబంధమైన కొన్నిమంత్రముల యనుష్ఠానముయొక్క సౌష్ఠవము, గరుడపక్షి అచటకు ఆకర్షింపబడుటవలన నిరూపితమగునని, మంత్రశాస్త్రగ్రంథములో చెప్పబడియున్నది."

(79పే) "...రోగనివారణము, ధనప్రాప్తి మున్నగు ఇష్టార్థసిద్ధి, పవిత్రగ్రంథపారాయణమువలన కల్గును. మహాత్మాగాంధి తాను స్వయముగా నెరిగిన యొకవిషయము నిట్లు వెల్లడించియున్నారు...."

"మాగృహములో, లోధామహారాజ్ అను బ్రాహ్మ

ణుడు రామాయణమును పఠించుచుండెను. ఆయనకు కుష్ఠ వ్యాధివచ్చెను. నియతముగా రామాయణము పారాయణము చేయుచో ఆవ్యాధి కుదురునని ఆయన నమ్ముచుండెను. తుద కట్లే ఆవ్యాధి కుదిరెను...." (80పే.)

(Mahatma Vd. 11. P . 48 )

## యోగశాస్త్రమునకు ఆధునికుల జోహార్లు.

(81)—సైన్సు ననుసరించి యసంభవములైన యనేక విషయములను యోగశాస్త్రము చేయింపగల్గుచున్నది.

ప్యారిస్‌నగరమునకు చెందిన డాక్టర్ 'తెరెసే బ్రూసే' అను మహిళామణి కొందరితో కలిసి 30వ సం॥రంలో భారతదేశములోని మైసూరుపట్టణమున కేగి యట జగన్మోహన భవనములోని యోగశాలలో శ్రీ టి. కృష్ణమాచార్య అను యోగీంద్రుని యోగప్రదర్శనములను చూచెను. విద్యుద్యంత్రముల సహాయముతో నామె యాప్రదర్శనసమయములలో యోగీంద్రుని బహువిధముల పరీక్షించెను. యోగశాలాదర్శకగ్రంథములో ఆపాశ్చాత్యవనిత ఇట్లు వ్రాసెను.

"సంకల్పశక్తి, శ్వాసకోశముమీదను, రక్తప్రసారముమీదను ఎట్టి ప్రభావమును గల్గియున్నదో సున్నితములైన పనిముట్లతో కనుగొనుటకు మేము ఇచ్చటకువచ్చితిమి. శ్రీకృష్ణమాచార్య మాపరిశోధనలకు లోనగుటయేకాక మమ్ములను సంపూర్ణముగా తృప్తిపరచినారు. హృదయములోని స్థూలసూక్ష్మసంచలనములను ఇచ్ఛానుసారము ఆపి



వేయవచ్చు ననియు, మార్చవచ్చుననియు అసందిగ్ధముగా దానికంటె లోతైన విమర్శకు పునాదులనుగూడ వేసికొన గల్గితిమి. పాశ్చాత్యులు దేని నసంభవ మని తలచుచుండిరో, దాని నీయోగి చేయగల్గెను" (82 పే).

సంస్కృతసాహిత్యమును మథించి బహువిధముల భారతీయవిజ్ఞానమును మెచ్చుకొన్న "హెచ్ - హెచ్ - విల్సన్" 19వ శతాబ్ది మధ్యభాగములో భారతదేశమునకు వచ్చినాడు. ఒకయోగి గాలిలో పండుకొనియుండుట నాతడు స్వయముగా చూచి "హిందువుల మతములు" అను గ్రంథంలో తనయాశ్చర్యమును వెల్లడించియున్నాడు.

(84 పే) "...ఇట్లు ఆధునికసైంటిస్టులకుకూడ తెలియని రహస్యములను వెల్లడించుచు వారిజోహారు లందుకొన్న విద్యలు భారతదేశములోనే కలవు...దూరదర్శనము, దూరశ్రవణము మున్నగు అద్భుతములను, యోగాభ్యాసము వలన సాధింపవచ్చునని మనగ్రంథములలో చెప్పబడినది. వీనిని ప్రత్యక్షముగా నిరూపించువారు నేడున్నారు. సంపూర్ణవికాసము చెందిన మానసికశక్తిని పరతత్త్వముమీదకు ప్రసరింపచేయుచు ప్రపంచవిముఖులై ఆత్మానందము ననుభవించు మహాయోగులు కొందరు నేటికిని భారతదేశములో నున్నారు.

(85) ఆధ్యాత్మికముగాను, మానసికముగానుమాత్రమే కాక, శారీరకముగాకూడ మానవునకు పవిత్రమైనది యోగము. తాను ఆరోగ్యముతోను, దార్ఢ్యముతోను ఉంచు

టకు కారణము, చిరకాలమునుండి చేయుచున్న యోగాభ్యాస సాధనములే యని శ్రీ జవహర్ లాల్ నెహ్రూ చెప్పియున్నారు.

(86) శరీరమునకును, మనస్సునకును, ఆత్మకును అపార శక్తుల నొసగగల యోగము బహువిద్యాపరిజ్ఞానమునకు సాధనమగుటచే నది, కేవల మొకవిద్యగామాత్రమే పరిగణింపదగినదికాదు. అనేకవిద్యలు యోగదృష్టిచే కనుగొనబడినవి. కర్మకును, ఉపాసనమునకును, జ్ఞానమునకుగూడ యోగము సహాయముగా చెప్పబడినది. యోగప్రాప్యమైన ఆత్మానుసంధానము అనిర్వచనీయానందప్రాపకముగా నంగీకరింపబడియున్నది. భారతీయవిద్యల కన్నింటికిప లెనే యోగవిద్యకును పరమేశ్వరప్రాప్తియే పరమలక్ష్యము...."

## భౌతికశాస్త్రములు.

(89 పే) గణితశాస్త్రమును. బీజగణితమును, రేఖాగణితమును మొట్టమొదట కనిపెట్టినవారు హిందువులు. ఈశాస్త్రములను జ్యోతిషశాస్త్రమున కుపయోగించినవారిలో కూడవారే ప్రథములు. (Elphinston - India P. 133) ... (90) .. నేడు యూరపులో ప్రచారములోనున్న యంకెలు, దశాంశ పద్ధతి హిందూదేశమునుండి గ్రహింపబడినవి.

(H. H Wilson Indian Wisdom P. 124)

(91-2) "... నిన్న మొన్నటివరకు పాశ్చాత్యగణితశాస్త్రజ్ఞులకు తెలియని గణితరహస్యము లెన్నియో ప్రాచీనభారతీయులకు తెలియును.



'పూర్ణవస్తువునుండి దేనిని తీసివేసినను పూర్ణమే మిగులు' నని, బృహదారణ్యకోపనిషత్తులో (బ్రహ్మకు పదార్థవర్ణన సందర్భమున చెప్పబడినది."

"పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే ॥"

"...పాశ్చాత్యరేఖాగణితశాస్త్రములో 'పైథాగరస్' సిద్ధాంతమని ప్రసిద్ధిచెందినది యథార్థముగా భారతీయ సిద్ధాంతము. పైథాగరస్‌కు పూర్వకాలమున రచింపబడినదని పాశ్చాత్యులే యంగీకరించిన 'శుల్బసూత్రము'లో నీసిద్ధాంతము కలదు. దానినే పైథాగరస్ గ్రహించెను." (చూ. శ్రీ జటావల్లభుల పురుషోత్తము M. A గారి 'భారతీయవైభవము' 88, 89పుటలు.)

ఇక ఖగోళశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనాదిశాస్త్రములు, ఆయుర్వేదము మున్నగు భౌతికశాస్త్రములనుగురించి ఈ 'భారతీయ విజ్ఞాన' రచయిత ఎన్నెన్నో అద్భుత విషయములను సప్రమాణంగా సోదాహరణంగా తమయీగ్రంథంలో నిరూపించారు. (చూ 94_130 పేజీలు.) (శ్రీనివాసముద్రణాలయము-రాజమండ్రి-ద్వితీయముద్రణం 1962.

ఈవిధంగా మన భారతీయసంస్కృతి ప్రపంచ సంస్కృతు లన్నిటికీ ఆచార్యపీఠమై సహస్రవిధములుగ ప్రపంచమునకు విశిష్టవిజ్ఞానభిక్ష పెట్టిన నిదర్శనాలు ప్రాచ్యపాశ్చాత్య దేశచరిత్రలలో వలసినన్ని దొరకగలవు.

# సాంఘిక ప్రకరణము.

## "లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"

"ప్రపంచగత ప్రజలందరు సుఖసంతోషాలతో తమమనుగడను సాగించెదరుగాక!"

అనే మన హైందవజాతీయ జీవితధ్యేయం, ప్రపంచంలోని మానవసమాజంయొక్క శాంతిసౌఖ్యసంపాదనకు మూలమంత్రంవంటిదై ఉంది. కనుకనే మనుస్మృతికారుడు, "బ్రహ్మర్షి దేశంలో జనించిన అగ్రజాతివారిద్వారా భూమండలంలోని ప్రజలందరు తమతమ ఆచారములను (ధర్మాలను) తెలుసుకొనవలెను" A అని భారతదేశంలోని పుణ్యభూమిని ప్రపంచానికే ఆచార్యపీఠంగా అభివర్ణించినాడు. ఇంతటి విజ్ఞానవంతము, పవిత్రవంతము ఐన భారతదేశం ప్రస్తుతం తనపూర్వశక్తిని గోల్పోయిందంటే, అది తనధర్మాచరణంలో వెనుకబడి ఉందన్నమాట. దీనిఫలితమే నేటి 'అశాంతి'కి ఆదికారణమయింది.

ప్రపంచంలోని ఏప్రభుత్వమైనా, ఏసమాజమైనా సుఖశాంతులతో వర్ధిల్లుటకు స్వధర్మాచరణమే మూలమని సర్వశాస్త్రసిద్ధాంతం. ఈసందర్భంలో- "బ్రహ్మవిద్యాలంకార" బ్రహ్మశ్రీ ముదిగొండ వెంకటరామశాస్త్రిగారి "ధార్మికభారతీయసామ్రాజ్యప్రణాళిక" అనే గ్రంథము

A. "ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్, పృథివ్యాం సర్వమానవాః ॥"
(మనుస్మృతి)



నుండి శ్రీశాస్త్రివర్యుల శాస్త్రీయసూచనలను కొన్ని ఇట ఉదహరిస్తున్నాను. (శ్రీవారి రచనను, సులభరీతిలో తెలిపెదను).

## ప్రజాపరిపాలన సూత్రాలు.

1. "లక్షాధికారి మొదలు భిక్షాధికారివరకు వివిధవృత్తులలో జీవించుచున్న ప్రజలలో —
ప్రతివారిని ప్రభువు అపేక్షితమైన యోగక్షేమాత్మక రక్షణమును గావించుచుండవలెను.
2. ...నిల్వచేయదగినట్టి అధికాదాయము లేనట్టివారికి కావలసిన యోగక్షేమరూపమైన రక్షణము ఒనర్చుచుండవలెను. అంతేకాని అట్టివారినుండి పన్నులు వసూలు చేయరాదు....
3. ఎవరెవరికి జీవికయే దుర్లభమగుచుండునో అట్టివారికి తగినవృత్తులు కల్పించవలెను. ఏవృత్తినిగాని నిర్వహింపజాలని అనాధులను తగురీతిగ ఉచితముగ పోషించవలెను.
4. ...కృషివాణిజ్యాదివివిధవ్యాపారములలో లభించెడి నికరాదాయమునుండి 6వ వంతు పన్ను వసూలుచేయవలెను."

ఇవి ప్రజాపరిపాలన సంగ్రహసూత్రములు.

## రాజ్యాంగనిర్మాణసూత్రములు.

గ్రామప్రభువు, తాలూకాప్రభువు, జిల్లాప్రభువు, రాష్ట్రప్రభువు, యావద్భారతప్రభువు- వీరు పరిపాలకులై

ఉందురు. వీరికి ఆ యా పరిపాలనవిధానములను దెలిపెడి పాఠ్యగ్రంథములు అనగా 'లా' గ్రంథములు, ప్రత్యేకపాఠ్యగ్రంథములు గలవు. ఆయాగ్రంథములలో నుత్తీర్ణులైన వారలే, గ్రామప్రభుత్వము మొదలు దేశప్రభుత్వమువరకు ఆయాస్థానాలలో పరిపాలకత్వమునకు అర్హులగుదురు. ఏకస్వామికప్రభుత్వములో నట్టివారిని ఆదేశప్రభువే నిర్ణయించును. ప్రజాప్రతినిధిస్వామిక ప్రభుత్వములో అట్టివారిని ప్రజలే ఎన్నుకొనెదరు.

## ఎన్నికలవ్యవస్థ.

ప్రజలు ప్రభువును ఎన్నుకొనుటలో గమనించతగిన ఒకవిశేషము కలదు. గ్రామప్రభువును గ్రామ ప్రజలు మాత్రమే ఎన్నుకొనెదరు. అట్టి గ్రామప్రభువులు (2) తాలూకాప్రభువులను, వారు (3) జిల్లాప్రభువులను వారు (4) రాష్ట్రప్రభువులను, వారు (5) దేశప్రభువును ఎన్నుకొనవలెను. ఇట్టి ఎన్నికలే వివేకయుక్తములగును.

## ఎన్నికలవిధానము

(28 పే) ఎన్నికలలో ప్రజాప్రతినిధిగా నుండుటకు అర్హతను కలిగించెడి ఆయాపాఠ్యగ్రంథాలలో ఉత్తీర్ణులై ఆయాస్థానాలలో ప్రజాప్రతినిధిగా నుండదలచినట్లు ప్రభుత్వమునకు తెలిపిన వారిపేర్లను 5 సంవత్సరముల కొకసారి ప్రభుత్వమే ప్రకటించును. అందు ఓటరుకు విశ్వాసముగల వ్యక్తి పేరును, తనకు ప్రభుత్వమిచ్చిన పత్రముమీద లిఖించి, లేక గుర్తించే



చిహ్నమునుంచి (29 పే) ప్రత్యేకపు పోలింగుబాక్సుద్వారముగానే తనఓటుపత్రమును ప్రభుత్వమునకు ఓటరు పంపవలెను. ఈవిధములగు ఎన్నికలలో ద్రవ్యధ్వంసంగాని, నినాదములు, ఊరేగింపులుగాని ఉండనందున, యోగ్యుడగు లక్షాధికారి వలెనే యోగ్యుడగు భిక్షాధికారికూడ గ్రామప్రభుత్వము మొదలు యావద్భారతదేశప్రభుత్వమువరకు పాలకుడుగా వచ్చుటకు వీలుండును. కనుక అదియే నిజమైన ప్రజాప్రతినిధి ప్రభుత్వ మన దగియుండును.

## రాజ్యనిర్వహణసూత్రములు.

-: 17గురు సామాన్యమంత్రుల ఎన్నికలు :-

ఇక సామాన్య (ప్రత్యేక) మంత్రి నిర్ణయ మెట్లనగా : భారతీయార్థశాస్త్రములోని -17- రాజ్యాంగశాఖలలో, ప్రతీ ఒకశాఖానిర్వహణమునకు ఆశాఖను ప్రతిపాదించే శాస్త్రములో స్పెషలిస్టుగా పరీక్షలలో నుత్తీర్ణులైన వ్యక్తులద్వారాగానే ఆయాశాఖలను (30 పే) పరిపాలించవలెనేగాని, అన్యశాఖాశాస్త్రములో, నిపుణుడైనట్లు సర్టిఫికెట్ పొందియున్నను, వేరొకశాఖానిర్వహణములో నాతనిని నియమించరాదు.

## ప్రధానమంత్రి నిర్ణయము.

యావద్భారతదేశ ప్రభుత్వమునకు గురుస్థానీయుడై, -17-అర్థశాస్త్రశాఖాసూత్రములలో నుత్తీర్ణుడై, ఉత్తమ కులములో బుట్టి, జితేంద్రియుడై, సర్వభూతదయకలవాడై,

శత్రుభయంకరుడై, స్వధర్మనిరతుడై యున్న ఉత్తమోత్తమ వ్యక్తినే ప్రధానమంత్రిగా నిర్ణయించుకొనవలెను.

### స్వరాజ్యవిప్లవప్రతీకారములు.

తనపరదేశవిప్లవములకు తగిన కారణములను గూఢచారులు, పురోహితులు, మంత్రులు అనే వీరిద్వారాను, స్వయంగాను ఎప్పటికప్పుడు ప్రభువు తెలిసికొనవలెను. ఇట్లే సామదానభేదదండోపాయములలోను, సంధివిగ్రహాదిషడ్విధశక్తులలోను, చతురంగబలములలోను, తాత్కాలికముగా అవసరమైనవానిని ప్రయోగించుచు, యథోచితసమయోచితప్రక్రియలతో వివిధవిప్లవప్రతీకారములను చేయుచు, ప్రశాంతగంభీరమగు ధార్మికభారతీయసామ్రాజ్య పరిపాలనమును ఒనర్చుచుండవలెను.

### ఆధ్యాత్మిక ప్రబోధనావశ్యకత.

(31) ఆధ్యాత్మికవిజ్ఞానం లేనప్పుడు మానవులకు ఎంతటి యార్థికసంపద సమకూరినను ప్రశాంతి యుండదు. భయము, దుఃఖము తప్పదు. కనుక ముఖ్యముగా భారతీయప్రజలు నిఖిలప్రపంచప్రశాంతిప్రదమగు ఆధ్యాత్మిక విజ్ఞానసంపదను, దీనితోబాటు ఆర్థికసంపత్తిను సమకూర్చుకొనవలెను. కనుక అనేకకోటిబ్రహ్మాండభరితసృష్టిని గావించి, అందలి ఆహారవిహారానందసామగ్రిని అనుభవించుటకు యోగ్యమైన దేహేంద్రియమనోబుద్ధ్యాదులను మన కనుగ్రహించిన, సర్వజీవదయామయుడైన ఆసర్వాంతర్యామికి మనమందరము అన్ని



వేళలలోను అన్నివిధాలైన ఆరాధనలను హార్దికముగా అందించుచుండవలెను.

### శిష్టరక్షణము.

మరియు "శిష్టరక్షణము" అనునది ప్రభుత్వకర్తవ్యములలో ముఖ్యమయినది. 'ఆధ్యాత్మికానందము' అనునది, దుఃఖాంతములైన ఐహికసుఖములకు అతీతమైనది. ఇట్టి ఆధ్యాత్మికానందమును సమకూర్చుటకే ప్రతిమతముగూడ తరగతులవారీగా ఏర్పడినది. కనుక తమతమజాతిమతములను అనుసరించుచు ఎన్నిబాధలకు లోనైనను ఎవరెవరిమతమును వారు సేవించవచ్చును. అట్టి ద్వైత-అద్వైత-విశిష్టాద్వైత-శైవ-శాక్త-వైష్ణవ-బౌద్ధ-జైన- చార్వాక-హిందూ- మహమ్మదీయ, క్రైస్తవాది వివిధమతములవారలకును అభీష్టములయిన- యోగక్షేమరూపమయిన రక్షణములను ప్రభుత్వము సమకూర్చుచుండవలెను.

### దుష్టశిక్షణము.

ఇక ప్రభుత్వమునకు దుష్టశిక్షణావశ్యకతయు చాల కలదు. రాజసతామసప్రకృతులు గలవారు ఆర్థికవిషయములలోను, ఇట్లే పరక్షేత్ర విత్తకలత్రాద్యపహరణప్రవృత్తులు కలవారైనపుడు అట్టి దుష్టులను అర్థశాస్త్రోక్తరీతిగా శిక్షించినట్లే, రాజసతామసప్రకృతులతో దురహంకారములతో పరమతహితవిధ్వంసకప్రవృత్తులుగల దుష్టులనుకూడ ధార్మికభారతీయప్రభుత్వము తప్పక తగినట్లు శిక్షించవలెను.

## అఖిలప్రపంచప్రశాంతి.

(32 పే) ఇక నిఖిలప్రపంచప్రశాంతి చేకూరుట ఎట్లనగా- స్థావరజంగమరూపప్రపంచమంతయు ఒకేఒక పరమాత్మనుండి ఆవిర్భవించినదే. ఐనను ఒకేదేహమునకుసంబంధించిన వేర్వేరు ఇంద్రియములు, వేర్వేరుధర్మములు కలవయినట్లు ఒకే పరమాత్మనుండి ఆవిర్భవించిన మానవులుకూడా ఎవరెవరిధర్మములతో వారు ప్రతినియతులై యుండవచ్చు. ఐనను ఆధ్యాత్మికదృష్టి ననుసరించినపుడు సర్వమతములవారు సర్వమానవసోదరభావముతో- 'వసుధైకకుటుంబకభావము'తో మెలగుట వలన ఈవిధమగు ధార్మికభారతీయ సామ్రాజ్యము నిత్యప్రశాంతమై విశ్వమాంగళ్యసంపాదకమై మహోదారస్వభావముతో నిఖిలప్రపంచప్రశాంతిప్రద మగును."

(ఇవి "బ్రహ్మవిద్యాలంకార" M. వెంకటరామశాస్త్రి మహోదయుల భావాలు.)

ఇక వేర్వేరుమతాలకు చెందిన మానవసమాజాలు ఆయామతాచారాలకు చెందిన కొన్నినిబంధనలకు అనగా కట్టుబాట్లకు లొంగి ఉండవలసిన అవసరం ఎంతేనా ఉంది. ఈసూత్రం ప్రతీఒకమానవుని జీవితానికికూడా వర్తిస్తుంది. లోకానుభవంలోకూడా ఒకనిర్ణీతమార్గంలో అనగా కాలవలలో ప్రవహించిన నీటిప్రవాహమే క్రమంగా వరిపొలాలలో సాగుచేయడానికీ, సస్యాభివృద్ధికీ ఉపయోగిస్తుంది. ఇలా ఒక నియమపద్ధతిలో ప్రవహించని నీరు ఏవిధంగానూ దేనికీ ఉప



యోగించక ఎక్కడికక్కడే ఇంకిపోతుంది. కనుక నియమబద్ధంగా తమజీవికను సాగించిననాడే సర్వవిధక్షేమాలూ సమకూరుతాయనేది నిత్యసత్యవిషయం.

ఒక మానవసమాజజీవితం అభ్యుదయ పథంలో పయనించాలంటే ఆసమాజంలోని వ్యక్తులు తమతమధర్మాలను పాటించేవారుగాను, ఉదారభావం, సేవాభావం, సత్యప్రవర్తన, నైతికప్రవర్తన, పరహితాచరణమందు స్థిరసంకల్పం కలవారుగాను ప్రవర్తించాలి. అట్టి మానవసమాజంవల్లనే దేశశ్రేయస్సు, దేశమునకు కీర్తిప్రతిష్ఠలు చేకూరుతాయి.

కనుక మానవుల జీవితాలను, నైతికంగాను, ధార్మికంగాను తీర్చిదిద్దగలిగిన కొన్ని నైతిక-సామాజిక-ధార్మిక-శారీరకసూత్రాలను ఇక్కడ పొందుపరుస్తాను.

## సాంఘికనైతికాదిసూత్రాలు.

1. "ద్విజోత్తమో జపైర్హోమైః, తరేదాపద మాత్మనః" (మను).

"ఉత్తమబ్రాహ్మణుడు, తనకు ఆపదలు దాపరించినపుడు, జపములు, హోమములు అనే శాస్త్రీయసాధనాల ద్వారా తనకు వచ్చిన ఆపదను తప్పించుకొనవలెను. అట్టి ప్రక్రియవలన, పైగా కర్తకు అభ్యుదయాలుకూడ సంప్రాప్తించును.

2. "న కస్యచిదపి మర్మ ప్రకాశయేత్, నాఽవమన్యేత"

(నీతిసూత్రం)

తన గుట్టును ఏ ఒక్కనికీ తెలుపరాదు; ఏ ఒక్కణ్ణీ కూడా అవమానింపరాదు.

3, "న పరకాంతముఖే దృష్టిం న్యసేత్, పాదయో రేవ"
(ఆపస్తంబధర్మసూత్రం.)

ఇతరభార్యల ముఖమువైపు చూడరాదు. పాదముల వైపు చూడవచ్చును.

4. "న పాణిపాదచపలో, న నేత్రచపలో భవేత్" (మను)

ఉత్తమ సభ్యతకలవాడు, తనచేతులకు, కాళ్ళకు, కళ్ళకు సంబంధించిన చాపల్యాలను, అనగా దుష్టకోరికలను విడిచిపెట్టవలెను.

5. "న వైరం రోచయేత్ ప్రాజ్ఞః, వైరం దుఃఖస్య కారణం" (నీతిశా)

ప్రాజ్ఞుడైనవాడు ఎవరితోను ద్వేషంపెట్టుకోరాదు. తనద్వేషభావం, పరిణామంలో తనదుఃఖమునకే కారణమగును.

6. 'న తత్ పరస్య సందధ్యాత్, ప్రతికూలం యదాత్మనః' (విదురనీతి)

ఏమాట, ఏపని, తనకు అయిష్టంగాను, బాధాకరంగాను ఉంటుందో అటువంటిమాటను, అటువంటిపనిని యెదుటివానివిషయంలో తాను చెప్పరాదు; చేయరాదు.

"ఒరు లేయవి యొనరించిన,
నరవర ! యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి,
పరాయణము పరమధర్మపథములకెల్లన్."
(మహాభారతసూక్తి)



భీష్ముడు ధర్మరాజునకు చేసిన మహోపదేశ మిది. భారతీయసభ్యత కిది మకుటాయమానమైన ధర్మం. సమాజంలోని చాలామంది మానవులీధర్మాన్ని తమ ఆచరణలో పెట్టుకున్ననాడు, సాంఘికముగా ఎదురయే ఎన్నో గడ్డుసమస్యలను ఈభారతధర్మం సులభంగా పరిష్కరించగలదు.

మన నిత్యానుభవంలోకూడా, ఎదుటివానిని మనం గౌరవించినపుడు, ఆవ్యక్తి వెంటనే మనను గౌరవించకుండా ఉండలేడు. ఇది లోకసహజం. ఈవిషయాన్ని- "గౌరవం అనేది- ఇచ్చిపుచ్చుకోవలసినదే" అనే సామ్యం స్పష్టం చేస్తుంది. అంటే పరాయివానిని ముందుగా మనం గౌరవిస్తేనే మనగౌరవం తక్కుతుందన్నమాట.

ఈవిధంగా ఒకరి నొకరు గౌరవించుకున్ననాడు, సమాజంలో భిన్నభావాలుకాని, ద్వేషభావాలుకాని తలలెత్తవు. ఈపద్ధతి సమాజంలో స్థిరపడిననాడు, "వసుధైకకుటుంబకభావన" అనేది స్వయంగా వచ్చి సమాజాన్ని వరిస్తుంది. ఈసమాజకళ్యాణమే దేశకళ్యాణంగాను, ఈదేశకళ్యాణమే విశ్వకళ్యాణంగాను విరాజిల్లి మానవలోకం మాధవలోకంగా పరిణమించే మహాఽభ్యుదయప్రాప్తి లేకపోలేదు. కనుక బాలబాలికలారా! ఇట్టి నీతిసూత్రాలను తాత్పర్యాలతోసహా మీరు మీచిన్ననాడే కంఠస్థం చేయుట మనేది, మీజీవితాలను, మీమాతృదేశాన్ని

ఉద్ధరించి, దేశప్రతిష్ఠను మహోన్నతశిఖరాలకు జేర్చ్చన శ్లాఘతుంది.

7. "న తత్ సత్యం, యచ్ఛలే నాభ్యుపేతం" (విదురనీతి)

ఏదో ఒక 'మిష'తో కూడిన మాట "నిజము" అని పించుకోనదు.

8. 'స పూజ్యమంగలా న్యపసవ్య మభిముఖం వా గచ్ఛేత్'

(ఆపస్తంబధర్మసూత్రం)

పవిత్రసభ్యత కావాలనుకున్నవాడు, పూజింపదగిన వారికి, మంగళప్రదమైన వస్తువులకు, ఎదురుగాగాని, వారికి దక్షిణంవైపుగాగాని వెళ్ళవలదు. ఇలా వెళ్ళినవానికి అమంగళం కలుగును.

9. 'అజల్పన్, న హసన్, తన్మనా భుంజీత' (చరకం)

భోజనంచేసే సమయంలో అనవసరపుమాటలుకాని, అర్థంలేని నవ్వుకాని పనికిరావు. అలా చేసినచో పలకమారుటేగాక భోజనఫలం రాజసగుణంగా పరిణమించును.

10. 'అత్యుష్ణాన్న మతిక్లిన్నం, శీతం శుష్కం న ఖాదయేత్' (చరకం)

ఎక్కువ వేడిగా ఉన్న అన్నమునుగాని, లేక బాగా తడిసిన, లేక బాగా చల్లబడిన, లేక బాగా ఎండిపోయిన అన్నమునుగాని భుజింపరాదు. అట్టి అన్నభోజనం అనారోగ్యానికి ఆదికారణం ఔతూ, సదాచారానికి భంగకరం ఔతుంది.

11. 'అదుష్టాం వినతాం భార్యాం యౌవనే న పరిత్యజేత్'

(ఆపస్తంబధర్మసూత్రం)



దుష్టురాలు కాది, వినయగుణం కలది అయినభార్యను ఆమె యౌవనకాలంలో బొత్తిగా విడువరాదు. అటువంటి భార్యను భర్త అవివేకంతో విడిచినాడు, ఆమె ఉసురుపోసుకొనడమేకాక, ఆమె లేచిపోయే అవకాశం భర్తే కల్పించిన ట్లగును. ఇంకా వైవాహికధర్మహాని, ఇట్టిహాని అనేక అనర్థాలను కలిగించడం, విరహరూపంలో ఆమెక్షోభ భర్తకు తగలడం, అట్టి భర్త తనతరువాతి జన్మలో స్త్రీగా జన్మించి, వైధవ్యశోకాన్ని అనుభవించడం అనే మహానర్థాలుకూడా కలుగును.

12. 'అన్నం దృష్ట్వా ప్రణ మ్యాదౌ ఆపోశానం చ కారయేత్' (మను)

అన్నం బ్రహ్మస్వరూప మని, "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అనే ఉపనిషద్వాక్యం ఉపదేశిస్తోంది. కనుక ఆస్తిక్యబుద్ధికలవాడు అన్నమును చూడగానే ముందుగా భక్తితో నమస్కరించి తరువాత ఆపోశన పట్టవలెను. ఇట్టి సదాచారాలు మన పవిత్రసంస్కృతిలోని ప్రత్యేకతలను ప్రబోధించగలవు.

13. "ఆజ్ఞా గురూణాం హ్యవిచారణీయా" (పరాశరస్మృతి)

ధర్మసూక్ష్మాలు తెలిసిన ఉత్తమగురువులయొక్క-ఆజ్ఞాప్రకారంగానే శిష్యులు మసలుకొనవలెను. "వారి ఆజ్ఞలోని ఆంతర్యం ఏమిటి ?" అని శిష్యులు ఆలోచించి విమర్శించరాదు. "తాటకను వధించుము" అని తనగురువు విశ్వామిత్రుడు ఆజ్ఞాపించగానే ధర్మస్వరూపుడైన శ్రీరామ

చంద్రుడు ఆతాటకను వధించినాడు కదా! కనుక ఈవిష
యంలో అందరకు శ్రీరాముని ప్రవర్తనమే పరమ ప్రమా
ణము.

14. "ఆత్మోత్కర్షస్తథా నిందాం పరేషాం, పరివర్జయేత్" (ధర్మసూత్రం)

ఎంతటివాడైనను ఇతరులయెదుట తనను తానే విశేషంగా పొగడుకొనడమనేదీ, ఇట్లే పరులను దూషించడమనేదీ కూడా ఆత్మద్రోహంతో సమానమగును.

15. "ఇంద్రియార్థేషు సర్వేషు న ప్రసజ్యేత కామతః" (మనుస్మృతి.)

మానవులు, తమతమదశేంద్రియాలకు సంబంధించిన విషయములందు- అనగా శబ్దస్పర్శరూపరసగంధములయందు భౌతికకామప్రవృత్తితో ప్రవర్తింపరాదు. ఈధర్మసూత్రానికి విరుద్ధంగా ప్రవర్తించడంచేతనే, రావణదుర్యోధనాది చక్రవర్తులంతటివారుకూడా తమ బలవన్మరణానికి తామే కారకులయారు. మానవసమాజంయొక్క శ్రేయస్సే ముఖ్యలక్ష్యముగాకల మహర్షుల మహితప్రబోధాలు చెడచెవిని బెట్టినవారికి ఇలాగే మహాపదలు పొంచిఉంటాయి.

కనుక తమజీవితశ్రేయస్సు కోరేవారందరు తమచిన్ననాడే ఇట్టి ధార్మికసూత్రాలను అర్థాలతో సహా కంఠస్థం చేసిననాడు, అట్టివారి భావిజీవితం అనర్థప్రవలలలో చిక్కుకొనదు సరికదా, అభ్యుదయమార్గంలో పయనించగలిగి ఉంటుంది. అట్టిమానవులు కల సమాజము, అట్టి సమాజము కల దేశము సర్వవిధసౌభాగ్యాలతో తులతూగుతూంటుంది.



కనుక మానవులు తమ ఇంద్రియాలను సర్వదాతమస్వాధీనంలో ఉంచుకొనడం అనే అభ్యాసమును తమచిన్ననాటినుంచీ తప్పనిసరిగా చేయడం ముఖ్యాతిముఖ్యం. ఈముఖ్యకర్తవ్యాన్ని నేడు చాలమంది తమ చిన్ననాడు ఆచరించనికారణంచేతనే నేటి రాజ్యసభలలోని కొందరు సభ్యులయొక్కయు, మంత్రులనిపించుకొన్నవారియొక్కయు అసభ్యప్రవర్తనలు దేశానికి శత్రువులుగా పరిణమించి, దేశశ్రేయస్సునకు గొడ్డలిపెట్టుగా పరిణమించినవి. ఇట్టి దుష్టసన్నివేశాలను ప్రస్తుతం మనం పత్రికలలో ప్రతిరోజూ చూస్తూన్నదేకదా!

16. "ఉపర్యుపరి పశ్యంత స్సర్వ ఏవ దరిద్రతి" (హితోపదేశం)

సామాన్యంగా కొందరు తాము మహోన్నతపదవిలో ఉన్నట్లు భావించడంద్వారా పొరబడి, "ప్రతీవాడూ తమవద్దకు వచ్చి తనను సేవించవలెననే దురహంకారములో చిక్కుకొని, కళ్ళు నెత్తిమీద పెట్టుకొని, నిజానికి అట్టివారు అన్నింటిలో వెనుకబడి, అసలైన "దరిద్రులు" అనిపించుకొంటారు. అట్టివారివలన సమాజానికి కీడేతప్ప మేలు వాటిల్లదు.

17. "అర్థహీనోపి ధర్మాత్మా స్వర్గం గచ్ఛతి మానవః"

దరిద్రుడైనను ధర్మాత్ముడైనచో అట్టివాడు స్వర్గసౌఖ్యానుభవానికి అర్హతకలవాడగును.

18 "అశ్వత్థ మగ్ని మర్కంచ పృష్ఠీకృత్య జపే న్నతు"
(ఆపస్తంబధర్మ).

రావిచెట్టుకి, అగ్నికి, సూర్యునికి వెనుదిరిగి (వీనికేసి)

పృష్ఠంఉంచి జపం చేయరాదు. చేసినచో సూర్యాదులను అవమానించినట్లయి వారిఆగ్రహానికి గురికావలసివచ్చును.

19. "అసత్ప్రలాప మనృతం వాక్పారుష్యం విసర్జయేత్"
(మార్కండేయస్మృతి)

చెడుప్రసంగమును, అబద్ధపు మాటలను, కఠినపుమాటలను సభ్యతకలవాడు విడిచిపెట్టవలెను. ఇట్టి అలవాట్లు చిన్ననాడే నేర్చుకొనవలెను. ఇట్టి సభ్యతకలవారే సమాజమునకు క్షేమాన్ని చేకూర్చగలిగి ఉంటారు.

20. "ఆచరేదుషసి స్నానం, తర్పయేద్దేవమానుషాన్"
(జాబాలిస్మృతి)

తనఆరోగ్యఆయుర్దాయవృద్ధులను కోరేవాడు, సూర్యోదయానికి ముందు స్నానం చేసి, దేవపితృతర్పణాలను ఆచరించవలెను.

21. "గాయత్రీం చ జపే త్ప్రాతః తిష్ఠన్ ఆసూర్యదర్శనాత్"
(శంఖలిఖితస్మృతి)

మంచి ఆయురారోగ్యములు కావాలనుకున్నవాడు, సూర్యోదయానికి ముందుగానే సంధ్యావందనం మొదలుపెట్టి సూర్యోదయమయ్యేవరకు నిలుచుండి గాయత్రీమంత్రాన్ని జపించవలెను (మనస్సులో).

22. "గురోర్గతిభాషితచేష్టితాని నానుకరణీయాని" (మను)

మంచిశిష్యుడు, ఉత్తముడయిన గురువుయొక్క నడకతీరును, మాటలతీరును, పనులతీరును అనుకరించరాదు.

23. "దక్షిణముఖో శ్రేయస్కామీ భుంజీత" (చరకం)



తనజీవితశ్రేయస్సును కోరేవాడు దక్షిణదిక్కుకేసి తిరిగి భుజింపవలెను. కారణం- తన ఆయుర్దాయానికి హాని కలిగించే యముడు దక్షిణదిగధిపతి. ఆయనకు కోపం కలిగించేవిధంగా (దక్షిణంకేసి పృష్ఠం) ప్రవర్తింపరాదుగాన.

24. "చత్వారి ఖలు కర్మాణి సంధ్యాకాలేషు వర్జయేత్"

(1) నిద్ర, (2) మైథునం, (3) తిండి, (4) చదువు అనే ఈనాల్గుపనులనుమూడుసంధ్యలసమయాలలోచేయరాదు.

25. "జపే దహరహః జ్ఞాత్వా గాయత్రీం మనసా ద్విజః"

బ్రాహ్మణుడు ప్రతీరోజు గాయత్రీమంత్రాన్ని మనస్సుతోనే జపించవలెను. "ప్రతీరోజూ" అనడంచేత ఆశౌచసమయాల్లోకూడా కేవలం మనస్సుతోనే గాయత్రిని జపింపవచ్చునన్నమాట. పురిటిలోను, శుద్ధిపిమ్మటను ఉన్నది అదేమనస్సుకదా!

26. "త్రిసంధ్యాసు జపే ద్దేవీం, విచ్ఛిత్త్యైవ పదత్రయం"

మూడుసంధ్యాసమయములందును గాయత్రీమంత్రంలోని 3 పాదాలను విడదీసి జపించవలెను. ఎట్లనగా- 1వపాదం 'తత్సవితుర్వరేణ్యం', 2వ పాదం 'భర్గో దేవస్య ధీమహి', 3వ పాదం 'ధియో యో నః ప్రచోదయాత్' అని ఉందికదా!

27. "యామమధ్యే న భోక్తవ్యం ద్వియామం నైవ లంఘయేత్"
(చరకం)

భోజనం చేసినపిమ్మట 3 గంటలలోపులో తిరిగి తినరాదు. ఇట్లే రెండవసారి భోజనమునకు 6 గంటలు దాటనివ్వరాదు.

28. "రత్యాదౌ భోజనాదౌ చ త్యజే దంతర్జలం బుధః"
(వాత్స్యాయనకామసూత్రం)

సంభోగభోజనములకు ముందు, లోపలి జలమును (మూత్రం) విడువవలెను.

29. "మానసైః కర్మదోషై స్తు నరో యా త్యంత్యజాతితాం" (మను)

శారీరకంగా చేసిన దోషాలకంటే, మానసికంగా చేసిన (చెడుభావనలు అనే) దోషాలు ఇంకా పాపప్రదాలయినవికనుక, మానసికదుష్టభావనలచే కలిగిన పాపాల చేతనే మానవులకు చండాలజాతిలో జన్మ కలుగుతుంది.

30. "య దేకోఽపి త్యజే త్పాత్రం శేష మన్నం న భోజయేత్"
(అపస్తంబధర్మసూత్రం)

ఏకపంక్తిలో భోజనంచేస్తూన్నప్పుడు మధ్యలో ఒకడు పంక్తిలోంచి లేచిపోయినచో మిగతావారు శేషించిన అన్నాన్ని తినరాదు. (అట్టిది ఎంగిలివంటి దగును.)

31. "వృత్తం యత్నేన సంరక్షేత్, విత్త మాయాతి యాతి చ'
(విదురనీతి)

ప్రాజ్ఞుడు తన ఉత్తమప్రవర్తనమును మాత్రం సర్వదా సంరక్షించుకొనవలెను. 'ధనం' అనేది మధ్యలో రానూవచ్చు; పోనూవచ్చు. ఇట్లు నిత్యంకాని ఈధనం కంటే, నిత్యమైన ఉత్తమశీలాన్నే మానవుడు విధిగా కాపాడుకొనవలెను.

32. "శిరశ్రవణపాదేషు నిత్యం తైలేన మర్దయేత్" (భోజస్మృతి)

శిరస్సు, చెవులు, పాదాలు వీటిని తైలంతో (అనగా



నువ్వులనూనె లేక వంటఆముదంతో) ప్రతీప్రాతఃకాలమందు మర్దనా చేయవలెను. అలా చేసినచో తలలోని నరాలకు, కళ్లకు పుష్టి కలుగును.

33. "న వ్రణితో దివా నిద్రావశగ స్స్యాత్" (సుశ్రుతం.)

వ్రణంచే బాధపడేవాడు పగలు నిద్రించరాదు. నిద్రిస్తే వాతపిత్తకఫాదులు ప్రకోపించి వాపు పోటు రావచ్చు.

34. "న్యుబ్జాం పార్శ్వగతాం వా స్త్రియం న సంవసేత"
(వాత్స్యాయనకామసూత్రం)

వంకరగాగాని, ప్రక్కగాగాని పరుండిన స్త్రీని కలియరాదు.

35. "పాపం కృత్వా న గూహేత, గూహమానం వివర్ధతే"
(భీష్మధర్మం)

పాపం చేసినవాడు చేసిన తనపాపాన్ని కప్పిపుచ్చరాదు. కప్పినకొద్దీ ఆపాపం బైటపడుతూండును.

36. "న మనస్సాక్షిణో విరుద్ధ మాచరేత్" (అపస్తంబ)

ఒకపని చేయవచ్చునా, కూడదా అనే సందేహసమయంలో తననిర్మలమనస్సుతో ఆలోచించినపిమ్మట తన మనస్సు ఏమని సాక్ష్యమిస్తే అదే కర్తవ్యమనే నిర్ణయం చేసుకోవాలి. అంతేగాని ప్రాజ్ఞుడు తనమనస్సాక్ష్యానికి విరుద్ధంగా ప్రవర్తించరాదు.

37. "న బుద్ధీంద్రియాణాం అతిభార మాదధ్యాత్" (చరకం)

తనబుద్ధికి, ఇంద్రియాలకు ఎక్కువభారాన్ని కలిగించే ఏఒక్కపనినీ వివేకి చేయరాదు.

38. "నాఽస్తి ధర్మాత్పరో బంధుః, నాస్తి ధర్మాత్పరం ధనం"
(బ్రహ్మవైవర్తం)

సర్వులకు సర్వవిధ శ్రేయస్సంధాయకమైన 'ధర్మ'ము'ను మించిన బంధువు కాని, ధనముకాని ఇంకొకటి లేదు.

39. "అర్ఘ్య మేకం ప్రదాతవ్యం మధ్యాహ్నే భాస్కరం ప్రతి"

ప్రాతస్సాయంసంధ్యలలో మూడేసి, మధ్యాహ్నం ఒకటి అర్ఘ్యాలివ్వవలెను.

40. "గర్భిణ్యాః వమనవిరేచననశ్యకర్మాణి న ప్రయోజయేత్"
(చరకసంహిత)

గర్భిణీస్త్రీకి వాంతి విరేచన నశ్యప్రక్రియలు చేయరాదు.

41. "న కశ్చి త్కస్యచి న్మిత్రం, న కశ్చి త్కస్యచి ద్రిపుః"
(చాణక్యనీతి)

మొట్టమొదట (స్వతస్సిద్ధంగా) ఒకడికి మరొకడు మిత్రుడూ కాదు, శత్రువూ కాదు.

42. "పూర్వపుణ్యేన హీయేత ఏకహస్తాభివాదనాత్" (విష్ణుపురాణసూక్తి)

ఒకే చేతితో కాని, ఒకే వ్రేలితోగాని ఎవ్వడూ ఎవరికీ నమస్కరింపరాదు.

ఇట్టి సుమనోహర, మహోపదేశప్రదసూత్రాలు సంస్కృతవాఙ్మయంలో లక్షలమీద ఉన్నాయి. అవి ప్రతీక్షణం, ప్రతీమానవునికి నిత్యజీవితములో కావలసిన సర్వవిధనీతులను, ప్రబోధాలను, ధర్మాలను మహాసందే



శాలను అందిస్తూ అవి, మొత్తం మానవజాతికే ప్రతీక్షణం 'శ్రీరామరక్షగా' పనిచేస్తున్నాయి. వీనిసహాయంతో తమజీవితాలను బాలబాలికలు తమచిన్ననాడే తీర్చిదిద్దుకొన్ననాడు అట్టివారే, 'ఉత్తమభారతపౌరులు'గా తయారగుటలో సందేహం లేదు.

## భూలోకప్రత్యేకత.

అన్నిలోకాలలోను భూలోకం ఒక్కటే ప్రత్యేకమైన "పవిత్రశక్తి"కలది అని వేదం నిరూపించింది. అందులోను "భారతదేశం" విరాట్పురుషునికి "కుక్షి"వంటిది. కుక్షిలోనికి చేర్చిన అన్నరసం, మొత్తం శరీరానికంతకు వ్యాపించి బలపుష్టితుష్టులను కలిగించునట్లు- భారతదేశములో గావించిన యజ్ఞాలు, క్రతువులు మున్నగువాని పుణ్యఫలం ప్రపంచదేశాలన్నిటికీ వ్యాపించి, అది సర్వమానవజాతికీ శాంతిసౌఖ్యాలను చేకూరుస్తుంది. ఇంతటిప్రభావం, శక్తి కల భారతదేశంలో పుట్టిన బాలబాలికలు తమమాతృదేశప్రతిష్ఠను, ప్రత్యేకకీర్తిని కాపాడి సంరక్షించడం వారి కనీస ధర్మమై ఉంది.

"సర్వస్య సద్భావనాఽస్తు, విశ్వస్య కళ్యాణ మస్తు,
"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"

సర్వం శ్రీనివాసార్పణ మస్తు.

ఓమ్

శ్రీ శ్రీనివాసాయ మంగళమ్.

# సంస్కార ప్రకరణము.

## సంస్కారాల స్వరూపస్వభావాలు.

"సంస్కారాలు" అనగా జాతకర్మ, ఉపనయనం, వివాహంవంటివి. ఇవి మానవులకు "సంస్కారమును" అనగా సద్భావన, సత్ప్రవర్తన, సచ్ఛీలాదులను కలిగించే శాస్త్రీయప్రక్రియలు. ఇట్టి సంస్కారక్రియలను ఆచరించడం చేతనే బాలబాలికల దేహేంద్రియమనోబుద్ధులలో దాగిఉన్న ఉత్తమశక్తులు క్రమంగా పైకి వికసిస్తాయి. ఇట్లు ఆ క్రియలు వారిని అచిరకాలంలో భావిభారతపౌరులుగాను, ఉదారభావనాభాసితులుగాను తీర్చిదిద్దుతాయి. 'సంస్కార' శబ్దవ్యుత్పత్త్యర్థం కూడా ఈ విషయాన్నే విశదం చేస్తోంది.

"సంస్క్రియంతే ఏభి రితి సంస్కారాః"

"సంస్కారాలు" అనే శాస్త్రీయక్రియలు, బాలబాలికలలో అంతవరకూ ఉన్న దోషాలను దూరంచేసి అంతకుముందు వారిలో లేని క్రొత్తగుణాలను శక్తులను ప్రవేశపెట్టి తద్ద్వారా వారిని సంస్కరిస్తాయి– అనగా బాగుపరుస్తాయి. కనుక 'సంస్కారాలు' అనేపేరు ఆశాస్త్రీయక్రియలకు చక్కగా సమన్వయించి సార్థకమయింది.

ఇంక ఈసంస్కారాలనేవి అంతకుముందు ఉపయోగంలో లేని రత్నధాన్యాదివస్తువులనుకూడా బాగుపరచి వాటిని మాన



వుల నిత్యజీవితంలో ఎలా ఉపయోగంలోనికి తెస్తున్నాయో ఇక తెలుసుకుందాం.

లోకంలో 'ధాన్యం' అనేవి ధాన్యదశలో ఉన్నంతవరకు అవి మనకు ఆహారంగా ఉపయోగించవు. కనుక అవి మనకు ఆహారంగా ఉపయోగించడానికిగాను వాటికి కొన్ని సంస్కారాలు అనగా "బాగుసేతలు" అంటే వరిధాన్యం కోసి, కొట్టి, ఎగురబెట్టి మిల్లులో బియ్యం సి వండడంవంటి సంస్కారాలు తప్పక చెయ్యాలి. అప్పుడే ఆధాన్యం బియ్యంగా మారి ఆహారంగా మనకు ఉపయోగిస్తాయి. ఇట్లే రత్నాలు, బంగారంవంటి వస్తువులుకూడా స్త్రీపురుషులకు నగలుగా ఉపయోగించాలంటే వాటికి మొదట గనులలో అంటిన మట్టి మలినాదులను కొన్ని "యాసిడ్స్"తో కడిగి పోగొట్టి, తరివిడి పెట్టడంవంటి కొన్ని శాస్త్రీయక్రియలు అనగా బాగుసేతలు చేసిన పిమ్మటే అవి క్రమంగా స్త్రీల ఆభరణాలుగా తయారై అవి మహారాజుల మకుటాలను కూడా అలంకరించే అవకాశం ఏర్పడుతుంది. అలా ఆభరణాలుగా తయారైనపిమ్మట గాని ఆరత్నాలు, మణులు లోకానికి ఉపయోగించవుకదా!

ఇదేవిధంగా మానవులు పుట్టినవేళయొక్క గ్రహస్థితినీ, వారి పూర్వజన్మకర్మలపుణ్యాపాపాలప్రభావాలనుబట్టి వారు పుట్టినప్పుడే సాధారణంగా కొన్నిరకాల బాలారిష్టాది దోషాలు వారికి సంక్రమిస్తాయి. ఆదోషాలు అలాగే ఉన్నంతకాలం వారి సహజశక్తులను అవి వికసించనియ్యవు. ఆకార

ణంగా అట్టివారు నిరుత్సాహంతో ఏపనీచెయ్యలేకుండా ఉంటారు. అట్టివారిజీవితాలను లోకోపకారకంగా తయారు చేయడానికి, వారికి జాతకర్మవంటి శాస్త్రీయసంస్కారాలు తప్పనిసరిగా చేయవలసిఉంది.

ఈసంస్కారాలు యథావిధిగా అనగా శాస్త్రోక్తంగా ఆచరించడంచేత, అంతకు ముందు బాలురమనోబుద్ధీంద్రియాలను, అంతఃకరణమును అంటిపెట్టుకున్న అరిష్టాలు, కామక్రోధలోభమోహాదులు అనే దోషాలు తొలగిపోయి వాటి స్థానే క్రొత్తగా వారిలో విశుద్ధత, పవిత్రత, జాగరూకత, మనోనైర్మల్యంవంటి అనేకశక్తులు ఏర్పడుతాయి. ఈ విధంగా మానవులలోను వస్తువులలోను మొదటఉన్న దోషాలను, మలినాలను పోగొట్టి క్రొత్తశక్తులను పుట్టించడం ద్వారా వారిని లోకోపకారకంగా తీర్చిదిద్దగల జాతకర్మాది శాస్త్రీయక్రియావిశేషాలే 'సంస్కారములు' అని చెప్పబడు చున్నాయి.

'సంస్కారాలు' అనగా 'అలవాట్లు' అనే ఇంకో అర్థం కూడా ఉంది. వీటినే "పూర్వజన్మసంస్కారాలు" అనీ, పూర్వజన్మవాసనలు అనీ కూడా అంటారు. పూర్వజన్మలలో మనం నేర్చుకున్న ఈఅలవాట్లు మంచివైతే మంచిఫలితాలను, చెడ్డవైతే చెడ్డఫలితాలను మనచే అవి అనుభవింపజేస్తూంటాయి. ఉదాహరణకు- ఒక్కొక్క బాలుడు తనచిన్న



తనంలోనే గొప్పగా గానకచేరీలు చేయడమో, లేక ఏగణిత శాస్త్రంలోనో అద్భుతపాండిత్యాన్ని ప్రదర్శించడమో జరిగి నప్పుడు అట్టి ఆదర్శబాలుణ్ణి చూసి, "అది వాడి పూర్వజన్మ సంస్కారం" అని మెచ్చుకుంటాం.

ఇక ఇంకోబాలుడు తనచిన్నతనంలో ఏహింసాప్రవృత్తినో, ఏలోభప్రవృత్తినో తరచుగా కనబరుస్తున్నప్పుడు అట్టిబాలుణ్ణి చూచి మనం 'పూర్వజన్మవాసనలు ఊరికే పోతాయా' అనుకుంటాం. ఇట్లే ఒకపండితసభలో ఉన్న బాలపండితుణ్ణి చూచి మనం 'ఈయనగొప్పసంస్కారి' అంటాం. అంటే అతడు తనపూర్వజన్మలో సంపాదించిన వేదశాస్త్రవిజ్ఞానాదిసంస్కారాలు తరువాతిజన్మలోకూడా సంక్రమించి అవి బాల్యంలోనే అతణ్ణి పండితునిగా చేశాయన్నమాట. కనుక మానవజీవితాలకు సుఖశాంతిగౌరవకీర్తులను కలుగజేసేవి పూర్వజన్మలో సంపాదించిన 'మంచిఅలవాట్లు, అనీ, అపకీర్తి, అశాంతి, దుఃఖాదికష్టనష్టాలను కలిగించేవి పూర్వజన్మకృతదురభ్యాసాలనీ మనం తెలుసుకోవాలి. ఈచెడుఅలవాట్ల దుష్టప్రభావంసోకిన మానవులు, కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలనే అరిషడ్వర్గానికి అధీనులై దుష్ప్రవర్తనతో క్రమంగా దేశద్రోహులుగా తయారౌతారు. ఆకారణంగా అట్టివారు ప్రతినిత్యము దుర్భర కష్టనష్టాదులకు గురిఔతుంటారు.

ఇట్లు మానవజాతికే పరమశత్రువులైన కామక్రోధాది

దోషాలను తొలగించి మానవులలో 'విశుద్ధత'ను, 'పవిత్రత'ను ఏర్పరచడంద్వారా వారిలో 'దైవీసంపద'Aను ప్రవేశపెట్టి వారిని ఆదర్శపౌరులుగా తయారుచేయగలిగినవి, ఉపనయనాది 'శాస్త్రీయసంస్కారాలు' మాత్రమే అని తేలింది. "వీరమిత్రోదయం" అనే ధర్మశాస్త్ర గ్రంథంకూడా ఈ 'సంస్కార' శబ్దానికి నిర్వచనం చేస్తూ, మీదివిషయాలనే ఇలా విశదం చేసింది.

"ఆత్మశరీరాంతరనిష్ఠః విహితక్రియాజన్యః అతిశయవిశేషః సంస్కారః"–

అనగా మానవులలో ఉన్న సర్వవిధదోషాలను మొదలు పోగొట్టి వారిలో క్రొత్తగా మనోవిశుద్ధత, భావపవిత్రతవంటి విమాత్నశక్తులను ఏశాస్త్రీయప్రక్రియలు ప్రవేశపెట్ట గలుగుతాయో అట్టి శాస్త్రీయవిశేషప్రక్రియలే "సంస్కారాలు" అనిపించుకుంటాయి.

## సంస్కారాలద్వారా దుష్టకామాదుల తొలగింపు.

"స్వయం తీర్ణః పరాం స్తారయతి"

అనే సూక్తిని అనుసరించి మానవుడు ముందుగా తనను తాను ఉద్ధరించుకొనగలిగినప్పుడే లోకాన్ని కూడా ఉద్ధరించగలుగుతాడు. "లోకోద్ధరణము" అనే మహాకార్య సాధనకు కావలసిన యోగ్యతలను, శక్తులను మానవులలో

A! చూ. భగవద్గీతలో "దైవాఽసురసంపద్విభాగయోగం.



ప్రవేశపెట్టగల్గినవి "సంస్కారలు" మాత్రమే అని తెలుసుకొన్నాం. ఈవిధంగా కామక్రోధాదు లనబడే మన మనోగతమాలిన్యాదులను మీది సంస్కారాలద్వారా తొలగించుకొన్నమీదటనే మనమనస్సులోని చెడుకోరికలన్నీ పోతాయి

ఇట్లు దోషరహితమయిన మనమనస్సు విశుద్ధమూ, నిర్మలము, నిశ్చలము అయి అటుపిమ్మటనే అట్టి మనస్సులో 'స్వస్థత' (శాంతి) అనే పరిణతి ఏర్పడుతుంది. నిజానికి మన నిత్యజీవితంలోని మనశాంతిసౌఖ్యానందాలన్నీ మన మనస్సుయొక్క 'శాంతిసౌఖ్యాల' మీదను, "స్వస్థత" మీదను ఆధారపడి ఉన్నాయి. ఇట్లు మన మనశ్శాంతి మన మనశ్శుద్ధిమీదను, ఆ మనశ్శుద్ధి సంస్కారాలమీదను ఆధారపడి ఉన్నట్లు తెలుసుకున్నాం. మీద చెప్పినవిధంగా మానవుని మనస్సులోని దుష్టకోరికలు పోయినపిమ్మటే అట్టివాడు పరమేశ్వరతత్త్వాన్ని తెలుసుకొని మోక్షాన్ని పొందగల్గుచున్నాడని కఠోపనిషత్తు ఇలా చాటుతూంది.

"యదా సర్వే ప్రముచ్యంతే కామాయేస్య హృది స్థితాః।
అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥"

## శాస్త్రీయసంస్కారాలు - వాటిప్రయోజనాలు.

## గర్భాధానసంస్కారం.

ఈమొదటి సంస్కారం దంపతుల ఉత్తమసంతాన ప్రాప్తికై ఉద్దేశించబడింది. వివాహానికి ముందు స్త్రీపురుషుల

యొక్క నియమరహితప్రవర్తనచేత చెడుసంకల్పాలచేత సంక్రమించిన వారి రేతోబీజాలకు చెందిన దోషాలు, ఈగర్భ సంస్కారానికి చెందినహోమాలచేతను, జాతకర్మ, చౌల, ఉపనయన సంస్కారాలచేతను తొలగి పోతా యని మనుస్మృతి చాటిచెప్పింది.A.

ఈవిధంగా సంస్కారముల నిర్వహణప్రభావంతో విశుద్ధరేతోబీజములుకల ఉత్తమదంపతుల సంతానమునకు 'ఆజన్మవిశుద్ధత', దీనిద్వారా ఉదారభావసంపదవంటి సుగుణ సంపద, సంస్కారాలద్వారానే సంప్రాప్తమౌతుంది. ఇట్టి సుగుణములు కల మానవోత్తములతో కూడిన సంఘం సర్వవిధాలా శక్తిమంతమై దేశాభ్యుదయసంపాదనకు సామర్థ్యం కలదౌతుంది. ఇట్లు సాంఘికాభ్యుదయం, దేశాభ్యుదయం అనే ఉత్తమప్రయోజనాలు ఈసంస్కారముల కారణంగానే సిద్ధిస్తూన్న విషయం విశదమయిందికదా! ఇంకా, తండ్రికి మూడవఋణముగా మిగిలిఉన్న 'పితృఋణం' అనేది ఉత్తమ పురుషసంతానలాభంచేతనే తీరిపోతుంది. ఇంకా ఈఉత్తమ పుత్రసంతానప్రాప్తిచేతనే తండ్రికి 'పుమ్' అనే నరకంనుంచి విముక్తి లభిస్తుంది. 'పుమ్' అనే నరకంనుంచి తండ్రిని కాపాడడంచేతనే కొడుకునకు 'పుత్రుడు' అనేపేరు ఏర్పడిందని_

A. "గార్భైర్హోమైః, జాతకర్మ చౌలమౌంజీనిబంధనైః ।
బైజికం గార్భికం చైనో ద్విజానా మపమృజ్యతే ॥"



"పున్నామ్నో నరకాత్ త్రాయత ఇతి పుత్రః" అనే వ్యుత్పత్త్యర్థం తెలుపుతూంది.

ఈవిధంగా, "మీదిగర్భసంస్కారం మానవులకు వంశాభ్యుదయంనుండి దేశాభ్యుదయంవరకూ సంపాదించిపెట్ట గల్గిన వంశదేశాభ్యుదయకరవరిష్ఠసంస్కారరాజము" అనే విశిష్టవిషయం విశదమయింది.

## పు మ్ సు వ న ము.

"పుమాన్ సూయతే అనేన సంస్కారకర్మణా ఇతి పుంసువనం." 'సూయతే' అనే క్రియనుబట్టి 'పుంసువనము' అనే వ్యవహారం ఈసంస్కారానికి వచ్చిఉండవచ్చును. ఇక చంద్రుడు పురుషనక్షత్రంతో కూడి ఉన్న రోజున ఈసంస్కారం చేయవలెనని పారస్కరగృహ్యసూత్రకారుడు తెలిపినాడు. భార్యకు 3వ మాసంలో ప్రథమగర్భమునకు మొదటిసారిగా భర్త చేసే సంస్కారమిది. ఇందు భర్త 8 వైదిక మంత్రాలతో హోమాలుచేసి, సహదేవరసంతో కలిపి నూరిన మర్రిచిగుళ్ళరసాన్ని భార్యయొక్క కుడివైపుముక్కురంధ్రంలో ఉంచుతాడు. ఈరసం క్రమంగా స్త్రీగర్భాన్ని చేరి పురుషసంతానం కలిగిస్తుందని ఆపస్తంబగృహ్యసూత్రం, "కర్మణా అనేన సంస్కృతా నారీ పుమాంసం జనయతి" అని తెలిపింది. ఇదీ 'గర్భ' సంస్కారమే

## సీ మ ం త ం.

భార్యకు 6 లేక 8వ మాసంలో ఈసంస్కారాన్ని భర్త

చేస్తాడు. "సీమంతం" అనగా స్త్రీలపాపిడి. ఆపాపిడిలో సంస్కారము చేయడం ఇందు ముఖ్యంగాన దీనికీపేరు వచ్చింది.

భర్త భార్యపాపిడిలో గల సగభాగం జుట్టును పైకి ఎత్తిపట్టి అక్కడ సంస్కారం చేస్తాడు. కనుక ఈతంత్రాన్ని సూచించే ఈసంస్కారాన్ని 'సీమంతోన్నయనం' అనికూడా అంటారు.

"ఆసురీశక్తులు" అనబడే దుష్టరాక్షసశక్తులు మానవుల వినాశానికి విశిష్టకారణ మగుచుండగా, "దైవీశక్తులు" మానవుల జీవితాభ్యున్నతికి ఆదికారణా లౌతూంటాయని భగవద్గీతలో "దైవాసురసంపద్విభాగయోగం" లోని ఒకసూక్తి-"దైవీసంపద్విమోక్షాయ, నిబంధాయాసురీ మతా..." అని విశదం చేస్తుంది.

"ఆసురీశక్తులు" అనబడే కొన్నిదుష్టశక్తులు భార్యయొక్క మొదటిగర్భాన్ని పాడుచేయడానికి పనిపట్టి రాగా భర్త కొన్నివేదమంత్రాలపఠనంతో ఆదుష్టశక్తులను తరిమివేసి భార్యయొక్క ప్రథమగర్భాన్ని కాపాడుతాడు. ఆసందర్భంలో ఆశ్వలాయనమహర్షి చెప్పిన వాక్యాలభావ మిది.

"భార్యమొదటిగర్భాన్ని కబళించాలనే పూనికతో, రక్తపానతత్పరలైన కొందరు రాక్షసస్త్రీలు రహస్యంగా భార్యవద్దకు వస్తారు. కొన్నివేదమంత్రాలపఠనసాధనంతో ఆదుష్టశక్తులను తరిమివేయడానికి భర్త 'సీమంతకరణి' అనే దైవీశక్తిని సమంత్రకంగా ఆహ్వానించి ఈసీమంతసంస్కారంలో



ఆరాధిస్తాడు. ఈవిషయాన్ని విస్పష్టం చేస్తూన్న ఆశ్వలాయన మహర్షి వాక్యా లివి.

"పత్న్యాః ప్రథమజం గర్భం అత్తుకామాః సుదుర్భగాః ।
ఆయాంతి కాశ్చ ద్రాక్షస్యః రుధిరాశనతత్పరాః ॥
తాసాం నిర్హరణార్థాయ శ్రియ మావాహయే త్పతిః ।
సీమంతకరణీ లక్ష్మీః తా మాహ్వయతి మంత్రితః ॥"

ఇట్టిదైవీశక్తిప్రభావంచేత, తత్పత్నిగర్భం రక్షితమౌతుంది. 'దైవీశక్తులు' లోకసంరక్షణంకోసమే సహాయపడుతూంటాయికదా! మనహైందవప్రజలయొక్క దైనందిన కర్మాచరణంలోని వైదికసంప్రదాయాలు, సదాచారాలు నేడు సన్నగిలిపోవడం కలికాలప్రభావమే అనాలి. ఐనా-"ఆస్తిక్యబుద్ధితో, భక్తిశ్రద్ధలతో వీలున్నంతవరకు 'స్వధర్మాచరణం' శ్రద్ధగా చేసేవారికి ఏకాలంలో ఐనా శ్రేయస్సులు తప్పక లభిస్తాయి" అనే విషయాన్ని బుజువుపర్చగలిగిన శ్రుతి స్మృతిప్రమాణాలు మనపవిత్రసంస్కృతిలో విరివిగానే లభిస్తాయి. ప్రస్తుతంలో 5 లేక 7వ మాసంలో స్త్రీకి గాజులు పెట్టడంవరకే ఈ 'సీమంత'సంస్కారం మిగిలి ఉంది.

## జాతకర్మ.

మగశిశువునకు బొడ్డుకోయ్యకుండానే తండ్రి ఈసంస్కారం శిశువునకు చెయ్యవలసిఉన్నట్లును, పూర్వకాలంలో ఈవైదికసంప్రదాయం వ్యవహారంలో ఉన్నట్లును-

"ప్రాఙ్నాభికృంతనా త్పుంసో జాతకర్మ విధీయతే"

అనే మనుస్మృతివాక్యం నిరూపిస్తూంది. ఇది పూర్వకాలవిషయం. ఈసంప్రదాయం ప్రస్తుతం లోకవ్యవహారం నుంచి భ్రష్టమయింది.

పుత్రుడు పుట్టాక తండ్రి పుత్రముఖాన్ని చూడటం అనేది మరొక వైదికసంప్రదాయం. ఈసంప్రదాయం వెనుక, ఎంతో వైదికభావన దాగి ఉంది. ఎట్లనగా, పుత్రముఖదర్శనంతో తండ్రికి అప్పటికి మిగిలిఉన్న 'పితృఋణం' A అనే ఆఖరిఋణం తీరిపోతుంది. కనుక 'ఇక నాకు ఋణం లేదు.' అని తండ్రి విశ్వసించడానికి ఈపుత్రముఖావలోకనం అనేది ప్రత్యక్షసాక్ష్యంవంటి దగుచున్నది. ఇట్టి పుత్రముఖదర్శనంతో ఋణవిముక్తిని పొందిన తండ్రి కట్టుకున్న బట్టతోనే స్నానం చెయ్యాలి. దీనినే, 'సచేలస్నానం' అంటారు. B స్నానసమయంలో తండ్రి ఎగిరి మొగ్గవేసినట్లు చెరువులోనికి దుమికి స్నానం చెయ్యడం, మరో వైదికసంప్రదాయం. దీనిలో ఉన్న వైదికభావన ఇది. ఈస్నానసమయంలో పైకి చిమ్మబడిన నీటిబిందువులు అతడి పితృదేవతలకు ఆహారంగా ఉపయోగిస్తాయి. ఎట్లనగా ఆశిశువు పెరిగి పెద్దవాడై పితృదేవతలను ఉద్దేశించి అతడు చేసే శ్రాద్ధతర్పణాదిక్రియలద్వారా వారు తృప్తిపొందుతారు. కనుక ప్రస్తుతం పైకి చిమ్మబడిన

A "ఋణా త్పితా విముచ్యేత పుత్రస్య ముఖదర్శనాత్"

(చూ. కపర్దికారికలు)

B "పుత్రే జాతే పితుః స్నానం సచేలం తు విధీయతే"



నీటిబిందువులు పితృదేవతల భావితృప్తికి సూచకాలన్న మాట. అలా స్నానంచేసి వచ్చిన తండ్రి పురిటింటిగుమ్మంవద్ద అగ్నిని ఉంచి అందులో తౌడు, ఆవాలు కలిపిన ద్రవ్యంతో 'ఫలీకరణహోమం' చేస్తాడు. మీదిద్రవ్యం సమంత్రకంగా హోమం చేయగా అది అగ్నిలో హుతమౌతూన్న (కరుగుతూన్న) ప్పుడు వచ్చినధూమం తాకిన శిశువులకు పురిటి పదిరోజులలోగాని, తరువాతగాని, భూతపిశాచాదులవలన వచ్చే పీడలు కలుగవని ఆహోమమంత్రార్థాలు తెలుపుతున్నాయి. ఈమంత్రార్థాలభావం, 30 ఏళ్ళక్రితంవరకు అమలులో ఉన్న 'యెన్నెమ్మకథలు' తెలుపును. ప్రకృతిశాస్త్ర, వైద్యశాస్త్రాల నిర్ణయంకూడా అదే.

ఈసంస్కారంవలన కలిగే ప్రయోజనాలు :—

మగశిశువునకు వారిపుట్టుకవేళనుబట్టి ఏర్పడిన దోషాలను 'జాతారిష్టాలు' అంటారు. ఈ'జాతకర్మ' సంస్కారంతో సంస్కృతులైన శిశువులకు, అట్టి అరిష్టరూపదోషాలు అంతరిస్తాయి. రానున్నరోగాలు తరచుగా రావు. దీర్ఘాయుర్దాయం, సంపత్సమృద్ధి మొదలైన భౌతికాభ్యుదయాలు ఈసంస్కారనిర్వహణంవలననే ప్రాప్తిస్తాయి. ఇంకా దీనివలన అశుభయోగాలంతరిస్తాయి. ఈచెప్పిన ప్రయోజనాలన్నీ ఈజాతసంస్కారంవలన సంక్రమిస్తాయని 'బార్హస్పత్యసంహిత' ప్రకటిస్తూంది. A

A "జాతస్యాఽరిష్టనాశాయ నీరోగత్వాయ సర్వదా ।
దీర్ఘాయుష్యాయ చాన్యత్ర సర్వసంపత్సమృద్ధయే ॥
జన్మ న్యశుభయోగానాం వినాశాయ విశేషతః ॥"

ఇట్లీసంస్కారాన్ని తండ్రి చేసినపిమ్మట తల్లి తన కుడి వైపున గల స్తనమును హిరణ్యోదకంతో కడిగి దానిని ఇలా అభిమంత్రిస్తుంది.

"యస్మై త్వగ్గ్ స్తన ప్రప్యాయాయు ర్వర్చో యశో బలం"

అనగా 'ఓపయోధరమా! నీవు ఈబిడ్డడికి దీర్ఘాయుర్దాయము, శరీరకాంతి, కీర్తి, బలములను ప్రసాదించగల పాలను స్రవించి ఈఅనుగుబిడ్డను అనుగ్రహించుము". అని అభిమంత్రించి ఆతల్లి తన కుడిస్తనమును **ముందుగా** తనముద్దుల బిడ్డడికి గుడుపుతుంది.

ఇప్పటికి 50 ఏళ్ళక్రితంవరకూ శిష్టకుటుంబాలకు చెందిన ఆంధ్రస్త్రీలలో ఈవైదికాచారం కొంత నిలిచిఉంది. ఈసదాచారం వారికీ, వారిసంతానమునకూ 'శ్రీరామరక్ష'గా పనిచేసేది. అసలు 'సదాచారం' అనేది మానవులకు పరమధర్మంగా పరిణమించి అది వారి జీవితకళ్యాణసిద్ధికి కమనీయ కారణ మౌతుందని, "ఆచారః పరమో ధర్మః, నృణాం కళ్యాణకారకః" అనే సూక్తి సుస్పష్టం చేస్తుంది. ఈసూక్తిలోని 'నృణాం' అనే పదప్రయోగం, **మానవజాతి** కంతటికీ సమంగా సమన్వయిస్తూ ఇది మన మహర్షులదూరదృష్టికి, విశ్వకళ్యాణకరదృష్టికి నిత్యనిదర్శనంగా ఉంది.

ఇట్లు **మానవజాతియొక్క** మహితశ్రేయఃప్రాప్తికి 'పుట్టినిల్లైన' మన "సదాచారాలు", "సత్సంప్రదాయాలు" సన్నగిలిపోవడంతో బాటే నేడు, 'ప్రజాశ్రేయస్సు' కూడా సన్నగిలిపోతోంది. (శాంతం పాపం)



ప్రస్తుత జాతకర్మసంస్కారంలోని ఈ "ఫలీకరణహోమ" సంప్రదాయం, ఇప్పటికి ముప్ఫైయేళ్ళక్రితంవరకూ ఆచారంలో ఉన్న 'యెన్నెమ్మకథల'లోను, ఆడవాళ్ళ పాటల్లోను నిలిచి ఉందనడానికి ఈక్రిందిఆడవాళ్ళపాటే పరమ నిదర్శనం. ఇది జానపదగేయానికి చెందినది.

"...ఉల్లీ పొట్టూ తౌడావాలూ ఉగిదరొ పొగవైమా..." (ఇది శ్రీకృష్ణుని 'పుట్టుకపాట'లోని భాగం)

ఆ "ఫలీకరణహోమం"లోని 'తౌడు-ఆవాలు' అనేవే, మీదిపాటలో "ఉల్లీ పొట్టూ తౌడావాలు"గా అవతరించాయనడానికి సందేహంలేదు. మొత్తంమీద ఈ'జాతకర్మ' సంస్కారం, శిశువుల అరిష్టాదిదోషాలను అంతరింపజేస్తూ వారి భావిజీవితవికాసానికి కావలసిన సర్వశక్తులను, యోగ్యతలను వారికి కలిగిస్తూన్నట్లు స్పష్టమయింది. ఈసత్యాన్నే చాటుతూ కాళిదాసకవీంద్రుడు తన రఘువంశమహాకావ్యంలో, "వసిష్ఠమహర్షి దిలీపచక్రవర్తికుమారునికి 'జాతకర్మ' సంస్కారం చేయగానే ఆరఘుబాలుడు, వజ్రపుపొగరతో రాపిడిపెట్టపంవంటి సంస్కారములు పొందిన రత్నమువలె పూర్వాధికముగా ప్రకాశించినాడు" అని వర్ణించినాడు (3-18). కనుక ఈజాతకర్మసంస్కారం బాలురలో లీనమై ఉన్న సహజశక్తులను అచిరభావిలో పైకి వికసింపజేస్తూ వారిని ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దడానికి సర్వవిధాలా సమర్థవంతమై ఉందని ప్రకటితమయింది.

## నామకరణం.

బాలబాలికలకు, వారుపుట్టిన పదకొండవరోజున 'నామకరణ' సంస్కారం చేయడం శిష్టాచారమై ఉంది. A

స్త్రీలపేరులోని అక్షరాలు బేసిసంఖ్యలోను, పురుషుల పేరులోని అక్షరాలు సరిసంఖ్యలోను ఉండాలి.

పిల్లలు పుట్టినప్పటిమాసంపేరు, పుట్టినప్పటినక్షత్రం పేర్లు మొదట పెట్టాక తండ్రి తనబిడ్డలకు లౌకికవ్యవహారానికి పనికివచ్చే "వ్యావహారికనామ" పిమ్మట పెట్టవలసిఉంది.

ఈనామకరణసమయంలో తల్లిదండ్రులు పఠించవలసి ఉన్న వేదమంత్రాన్నిబట్టి వారు పుత్రునికి 'వేద'నామకరణం ముందుగా చేయడం, దానిఫలితంగా పుత్రుడు భావికాలంలో బ్రహ్మజ్ఞానసంపన్నుడై నూరేళ్ళు జీవించడం అనే మహత్తర ప్రయోజనంకూడా ఈసంస్కారంవలన ప్రాప్తిస్తుందని-

"వేదో వై పుత్రనామాసి సజీవశరదశ్శతం" అనే వేద మంత్రం తెలుపుతూంది. మాస, నక్షత్రవ్యావహారికనామములకంటే ముందుగానే తమపుత్రునికి ఈవేదనామధేయం పిల్లవానికుడిచెవిలో రహస్యంగా చెయ్యవలెనని "పుత్రస్య నామ దధాతి తద్రహస్యం భవతి..." అనే వైదికకారిక వ్యక్తం చేస్తుంది.

"వేదయతీతి వేదః" అనే నిర్వచనమునుబట్టి 'వేద'

A "ఏకాదశేఽహని నామకరణం కుర్యాత్" అని
—ఆపస్తంబగృహ్యసూత్రం.



శబ్దం ధర్మమును, బ్రహ్మను ప్రతిపాదించడమే కాకుండా ఇది వేదవేద్యుడగు పరమాత్మనుకూడా బోధిస్తుంది.

ఇంకా 'విద్లలాభే' అనే ధాతువుకూడా వేదశబ్దం పుట్టడానికి మూలంకనుక 'వేదం' అనేది నాల్గుపురుషార్థములయొక్క లాభమునకుకూడా సాధనమాతుంది. దీనివలన కలిగే మహత్తరప్రయోజనం ఇది. 'వేదః' అనగా వేదనం, అంటే జ్ఞానం అని అర్థం. మొత్తంమీద జ్ఞానస్వరూపమైన పరమాత్మతత్త్వం అని భావం. ఈతత్త్వమే ప్రతిజీవునియొక్క వాస్తవస్థితి. ఈస్థితిని తెలుసుకున్ననాడే జీవియొక్క జీవితానికి ధన్యత చేకూరుతుంది. ఇంతటి పరమార్థంకల పరమాత్మతత్త్వాన్ని శిశువుగాఉన్నప్పుడే జీవికి ఉపదేశించడమనే ఆర్షసంప్రదాయంలో, జగత్కల్యాణకరమైన- పరమేశ్వర భావనాభాసితమైన- లోకశ్రేయస్సు ఇమిడి ఉందనడంలో ఏమాత్రము సందేహం లేదు. ఇట్లు తల్లిదండ్రులు తమపుత్రులకు వారి వ్యావహారికజీవితంలోకూడా మంచి పేరుప్రఖ్యాతులు, దీర్ఘాయుర్దాయము కలగాలనే సద్భావనతోనే వారు ఈనామకరణసంస్కారం చేస్తూన్నట్లు-

"మమ కుమారస్య ఆయుష్యాభివృద్ధ్యర్థం, సద్వ్యవహారార్థం
నామ ధాస్యావహే ॥"

అనే నామకరణ సంస్కారగతసంకల్పమే స్పష్టం చేస్తూంది.

ఇక పుత్రులపేరులో మొదటి 2 అక్షరాలు, 3-4 అక్షరాలు ఎటువంటివై ఉండాలో 'ఆపస్తంబగృహ్యసూత్రం'

తెలిపింది. కనుక భావ్యభ్యుదయం అనేది వారిపేరులోగల అక్షరాలశక్తి మీదను, ఆఅక్షరముల కూర్పు నేర్పుమీదను కూడా ఆధారపడిఉన్నట్లు స్మృతివాక్యాలు చాటుతున్నాయి.

ఇంకా మహర్షులు, దేవతలు, వంశంలోని ప్రఖ్యాత పురుషులు, ఇట్టి మహనీయులపేర్లు తమపుత్రులకు పెట్టడమనే సత్సంప్రదాయంకూడా, భావికాలంలో పిల్లలపేరుప్రఖ్యాతులకు కారణాలౌతాయని మహర్షులమతం.A ఇక ఈ'నామకరణ' సందర్భంలో తల్లిదండ్రులు సమంత్రకముగా పిల్లవాని కుడి చెవిలో మెల్లిగా మంత్రం పఠించడం, పిల్లవాని శిరస్సును ముద్దుపెట్టుకోవడంవంటి వైదికసంప్రదాయాలుకూడా భావికాలంలో బాలుర ఆయురభివృద్ధ్యాదులకు మంచిసాధనాలౌతున్నాయని ఇందలి మంత్రాలలోని అర్థాలు తెలుపుతూన్నాయి.

## అన్నప్రాశన.

"అన్నప్రాశన మర్భకస్య శుభదం మాస్యేష యుగ్మే శుభే,
షష్ఠాదావథ పంచమాదివిషమే మాసే వధూనాం శుభే ।"

అనే "పూర్వకాలామృత" గతవాక్యాన్నిబట్టి మగపిల్లలకు సరినెలల్లోను, ఆడపిల్లలకు బేసినెలల్లోను (సంవత్సరకాలం దాటకుండా) అన్నప్రాశనసంస్కారం జరిపించవలెనని

A "ఋష్యణూకం దేవతాణూకం వా యథా వైషాం పూర్వపురుషాణాం నామాని స్యుః" అణూకం, అనగా పేరు అని అర్థం.



తెలుస్తుంది. ముఖ్యంగా మగపిల్లలకు 6వమాసంలోనే అన్నప్రాశనం చేయడం ముఖ్యమనీ, ఈముఖ్యకాలంలో ఈసంస్కారం చేయని శిశువు భావికాలంలో గుణహీనుడై బలహీనతవంటి దోషాలుకలవాడౌతాడని స్మృతివాక్యాలు తెలుపుతున్నాయి. ముఖ్యకాలంలో చేసే మంచిపని అచిరకాలంలోనే సిద్ధించి విశేషంగా అది ఫలప్రదమౌతూన్న విషయం మన అనుభవంలోనిదే కదా!

ఈఅన్నప్రాశనసంస్కారంలో తల్లిదండ్రులు తమబిడ్డలకు పెరుగు, తేనె, నెయ్యి అనే ఆయుర్దాయకరద్రవ్యాలు మూడూ కలిపిన అన్నమును బంగారపుటుంగరముతో సమంత్రకముగా 'ప్రాశన' చేయించాలి. ఇందలిమంత్రాల అర్థాన్నిబట్టి పిల్లలకు మీది నాలుగుద్రవ్యాలు దీర్ఘాయుర్దాయప్రదాలు, మంగళకరాలు అని తెలుస్తూంది.

## చౌలం.

"చౌలం" అనగా పిల్లవానితలపైని శిఖలు ఉంచడం అని అర్థం. పుట్టినదిమొదలుకొని మూడవసంవత్సరంలో తండ్రి పిల్లవానికి ఈసంస్కారం చెయ్యాలి. A ప్రస్తుతకాలంలో ఏపాతికేళ్ళ వయస్సులోనో చేస్తూన్న ఉపనయనంకి ముందు చేస్తూన్న ఈచౌలసంస్కారంలో వటువునకు తండ్రి పంచశిఖలు పెడుతున్నాడు.

A "జన్మనోఽధితృతీయే వర్షే చౌలం పునర్వస్వోః"
(ఆపస్తంబగృహ్యసూత్రం)

ఈసంస్కారాన్ని "ఆయుష్కర్మ" అనికూడా అంటారు. కారణం దీనిసంకల్పంలో- నాకుమారునికి ఆయుర్దాయాభివృద్ధి కొరకు ఈచౌలసంస్కారం చేస్తూన్నానని తండ్రి సంకల్పిస్తాడు.

## ఉ ప న య న ం.

'ఉప' అనగా సమీపం, 'నయనం' అనగా చేరదీయడం. అంటే తండ్రి తనకుమారుని శుభకరసమయంలో తనవద్దకు చేరదీసి వానికి వానిబ్రహ్మచర్యవ్రతనిర్వహణకాలంలో కావల్సిన విధులను, నియమాలను మంత్రసంస్కారపూర్వకముగా ఉపదేశించడాన్ని 'ఉపనయనం' అంటారు.

ఈసంస్కారం చెయ్యనంతవరకూ పుత్రుడు నియమరహితప్రవర్తనతో శూద్రతుల్యుడుగా ఉంటాడు. ఈసంస్కారం చేశాక పుత్రుడు బ్రహ్మచర్యవ్రతనియమాలకు బద్ధుడై 'ద్విజుడు' లేక 'ద్విజన్ముడు' A అనిపించుకుంటాడు. దీనిని బట్టి ఈసంస్కారం, పిల్లలభావిజీవితానికే మహాభ్యుదయకరమయిన మార్పును తీసికొనివస్తుందన్నమాట.

ఉపనయనమునకు ముఖ్యకాలం :—

పుత్రులకు, గర్భాష్టమసంవత్సరంలోనే ఈసంస్కారం చెయ్యాలనీ, ఇదే ముఖ్యకాలమనీ- 'గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత' అనే ఆపస్తంబగృహ్యసూత్రం (10-2) తెలుపు

A "ద్వే జాతీ జన్మనీ యస్య సః ద్విజన్మా...." "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః"



తుంది. అనగా తల్లిగర్భంలో ఉన్న 9 మాసాలుకూడా కలిపి లెక్కిస్తే పిల్లవానికి ఎన్మిదవసంవత్సరం వచ్చినప్పటికి "గర్భాష్టమసంవత్సరం' వస్తుంది. అనగా ఏడుసంవత్సరాల 3మాసాలకు 9 గర్భమాసాలు కలుపగా గర్భాష్టమం ఔతుంది. ఈసమయం బ్రాహ్మణబాలురకు వడుగుచేయడానికి ముఖ్యకాలమన్నమాట.

మీాది ఆపస్తంబగృహ్యసూత్రంలోని 'అష్టమేషు' అనే బహువచనప్రయోగబలంచేత "గర్భషష్ఠ, గర్భసప్తమ, గర్భాష్టము" సంవత్సరాలు మూడూకూడా వడుగునకు ముఖ్యకాలం అనే అర్థం వస్తుంది. శిశువు గర్భంలోఉన్న 9 మాసాలతో సహా జన్మసమయానికి 5 సంవత్సరాల 3 మాసాలు కలుపగా పిల్లవానికి 'గర్భషష్ఠ' సంవత్సరం వస్తుంది. ఇట్లే గర్భసప్తమ, గర్భాష్టమసంవత్సరాలుకూడాను. కాన 5 సంవత్సరాల 4 మాసాలకాలం మొదలుపెట్టుకొని, 8వ సంవత్సరాంతంవరకూ బ్రాహ్మణబాలుర ఉపనయనసంస్కారనిర్వహణకు ముఖ్యకాలమని తేలింది.

కామ్యసంవత్సరాలు :—

బాలురకు 7వ సంవత్సరంనుండి 12వ సంవత్సరంవరకూ ఉండే ఈమధ్యకాలంలో ఏయేసంవత్సరాల్లో పిల్లవానికి వడుగుచేస్తే ఏయేఫలితాలు కలుగుతాయో తెలిపేవే "కామ్యసంవత్సరా"లంటారు. ఈలెక్కనుబట్టి 7వ సంవత్సరంలో వడుగుచేసిన పిల్లవాడు బ్రహ్మవర్చస్సుకలవాడౌతాడు. ఇట్లే తనకుమారునికి మంచిఆయుర్దాయం కావాలనుకున్న తండ్రి తనపిల్లవానికి 8వ సంవత్సరంలోను, శరీర

తేజస్సు కావాలనుకున్నవారు పదోసంవత్సరంలోను, ఇంద్రియకామునకు పదకొండవయేటను, పశువృద్ధిని కోరినవారికి 12వ యేటను వడుగుచెయ్యవచ్చునని కామ్యసంవత్సరాల విభాగంలో స్మృతివచనం తెలుపుతూంది. కనుక పిల్లలకు 8 సంవత్సరాలవరకూ వడుగుచేయడానికి ముఖ్యకాలమనీ, పిమ్మట 9 నుంచి 11వ సం॥రంవరకూ కల కాలం మధ్యమఫలాన్నిచ్చే కాలమనీ, 12 నుంచి 16వ సంవత్సరంవరకూ అధమకాలమనీ, 16వ సంవత్సరంకూడా దాటినపిల్లలకు గాయత్రీమంత్రోపదేశానికైనా యోగ్యత ఉండదనీ స్మృతిగ్రంథాలు ఇలా చాటి చెప్పాయి.

‘ఆషోడశాత్ బ్రాహ్మణస్య అపతితా సావిత్రీ, అత ఊర్ధ్వం పతిత సావిత్రీకా భవంతి”

మీదవిధంగా ఉపనయనసంస్కారనిర్వహణకు చెప్పిన ముఖ్యకాలాన్నిగూర్చి మనమహర్షులు చేసిన కట్టుదిట్టాలు, నిబంధనలు, ఈసంస్కారంయొక్క ప్రత్యేకప్రభావాన్ని, కాలనియమాన్ని గూర్చిన ఆవశ్యకతను, ఆవశ్యకర్తవ్యతను ప్రకటిస్తూనే ఉంటాయి. లోకంలోకూడా, యుక్తమైన కార్తెలలో ఊడ్చిన చేను ఫలించినట్లు ఇతరకార్తెలలో ఊడ్చినది ఫలించకపోవడం మనం చూస్తున్నదేకదా !

అనుపనీతప్రాయశ్చిత్తం :—

మీద చెప్పినరీతిలో తండ్రి ముఖ్యకాలంలో పటువునకు వడుగు చేయనందుకుగాను చేయవలసిన ప్రాయశ్చిత్తాన్ని “అనుపనీతప్రాయశ్చిత్తం” అంటారు. లౌకికంగా చూచినాకూడా ఈప్రాయశ్చిత్తం యుక్తమైనదే అని బుజా



వౌతుంది. ముఖ్యకాలంలో ప్రభుత్వానికి కట్టని కొన్నిముఖ్యమైన పన్నులను ‘ఫైన్’తో సహా చెల్లించడం తప్పదుకదా! ఈప్రాయశ్చిత్తంకూడా అటువంటిదే.

ఈప్రాయశ్చిత్తవిధానం :—

ఈప్రాయశ్చిత్తం చేయగోరినప్పుడు తండ్రి ఏర్పాటు చేసిన పండితసభను ఉద్దేశించి తండ్రి ఇలా అంటాడు.

“ఓపండితవర్యులారా! నాకుమారునకు ముఖ్యకాలంలో చేయవలసిన ‘జాతకర్మ’ మున్నగు సంస్కారాలు సకాలంలో చేయకపోవడంవలన పిల్లవానికి కలిగిన దోషాలు పోవుటకును, ఇంకా నాపుత్రుడు చేసిన మాతృస్తన్యపానం, నిలుచుండి మూత్రవిసర్జన చేయడం, ఇష్టే ఎంగిలి కూడు తినడం, ఇతరజాతులవారితో కలిసి భుజించడం, నియమరహితంగా ఇచ్చవచ్చినట్లు మాట్లాడి ప్రవర్తించడం, తినకూడనివాటిని తినడం, చేయకూడనిపనులు చేయడంవంటి పనులలో (నాపుత్రుడు) పవిత్రనియమాలను పాటించకపోవడం వలన కలిగిన దోషాలు పోవుటకును, గాయత్రీమంత్రోపదేశానికై నాకు యోగ్యత కలుగుటకును, ఆమహామంత్రాన్ని గ్రహించుటకు నాపుత్రునకు ‘అర్హత’ అబ్బుటకును ఈపండితపరిషత్తు నాకు తగినప్రాయశ్చిత్తాన్ని తెలిపి, నా పుత్రునకు ఉపనయనాధికారసిద్ధి సిద్ధించవలెనని మీరు ఆశీర్వదించెదరుగాక” అని తండ్రి ఆపరిషత్తునకు తగిన ‘దక్షిణ’ ఇచ్చి కుమారునికి, ‘శరీరవిశుద్ధత విలసిల్లుటకై స్వర్ణ, ఆజ్య, ధాన్యములను ఉత్తమవిప్రునకు దానం చేస్తాడు. ఇటుపైనుండి ఉపనయనతంత్రం ప్రారంభమౌతుంది.

దీనినిబట్టి ఈసంస్కారము చేసే తండ్రికి, చెయ్యబడే పిల్లవానికి ప్రాయశ్చిత్తపూర్వకమైన ఎంతటి 'విశుద్ధత', పవిత్రత కావలెనో ప్రకటితమౌతుంది. దీనిచేత, "హైందవధర్మసంరక్షణ" విషయంలో మన ఆర్యమహర్షులు ఎంతటికట్టుదిట్టాలు చేశారో, ఎంతటి 'జాగ్రత్తలు' తీసికొన్నారో, ఎంతటి మెలకువ చూపారో తెలియవస్తూనే ఉంటుంది.

బ్రహ్మచర్యాశ్రమంయొక్క ప్రత్యేకత :—

హైందవసంప్రదాయానుసారంగా నాల్గు వర్ణాలు, నాల్గు ఆశ్రమాలు లోకశ్రేయఃప్రాప్తికై ఈశ్వరునిచే ఏర్పరుపబడినాయి. (చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః "గీత) వీనినే 'వర్ణాశ్రమధర్మా'లనీ, 'వర్ణాశ్రమాచారా'లనీ అంటారు. మానవుల 'జాతీయాభ్యుదయం' అనేది వీనిమీదే ఆధారపడి ఉంది. కనుకనే, ధార్మికులైన నాటి క్షత్రియప్రభువులు ఈధార్మికాచారాలను ప్రత్యేకశ్రద్ధతో పర్యవేక్షణచేస్తూనే రాజ్యపాలన చేస్తూండేవారు. దీనితో నాడు, సాంఘిక దేశాభ్యుదయాలు సులభంగా చేకూరేవి.

మానవసంఘంలోని ప్రజలందరు తేజఓజోబలవీర్యపుష్టితుష్టి యథాలాభసంతుష్ట్యాదిసంపదలు కలవారైనప్పుడే అట్టివారు కల ఆసంఘం, అట్టిసంఘాలు కల దేశముకూడా ద్రఢిష్ఠంగానూ, బలిష్ఠంగానూ, తేజోవంతంగానూ, ప్రభావవంతంగానూ తయారౌతుంది.

ఇట్లు మానవుల జీవితాభ్యుదయాలకు, తద్ద్వారా దేశాభ్యుదయానికి పరంపరాకారణసామగ్రియైన మానవుల తేజఓజోబలవీర్యపుష్టితుష్టిమేధాశక్తిసంపదల ప్రాప్తికి 'బ్రహ్మ



చర్యాశ్రమం' 'పుట్టినిల్లు'గా ప్రపంచప్రశస్తిని పొందినది. కారణం, మానవుని భావిజీవితవికాసానికీ, పూర్ణజీవితసిద్ధికీ మూలసాధనాలైన సర్వవిధశక్తులూ, సర్వవిధయోగ్యతలూ ఈప్రథమికాశ్రమంలోనే ప్రాదుర్భవించవలసిఉన్నాయి. కనుక మానవుని ఐహికాముష్మికాభ్యుదయసిద్ధికి ఈమొదటి ఆశ్రమం మూలాధారంగానూ, మిగతా 3 ఆశ్రమములకు ముఖద్వారంగానూ ఉందనడంలో సందేహంలేదు.

బ్రహ్మచర్యం :—

బ్రహ్మ' అనగా 'వేదం', చర్యం అనగా ఆవేదాధ్యయనంలో ప్రవర్తించడం అని అర్థం. బ్రహ్మచారి తన ఈ మొదటి ఆశ్రమంలో ఉన్నంతవరకూ 'వేదప్రవచనం' చేయడం ముఖ్యంగాన ఈ ఆశ్రమానికి 'బ్రహ్మచర్యాశ్రమం' అనే పేరు వచ్చింది. ఉపనయనతంత్రానికి చివరభాగంలో 'ఆచార్యుడు' అనబడే తండ్రి, కొడుకునకు ఈ ఆశ్రమనియమాలను బోధిస్తాడు. ఇక వేదాధ్యయనం పూర్తిచేశాక ఆ బ్రహ్మచారికి వేదగురువు, అతడు గృహస్థాశ్రమంలో ఆచరించవలసిన ముఖ్యప్రవర్తన నియమాలను, 'శిక్షావల్లి' బోధించినట్లు ప్రబోధిస్తాడు. ఈబ్రహ్మచర్యవ్రతకాలంలో చెప్పబడిన ప్రతి ఒకనియమంకూడా అచిరభావిలో బ్రహ్మచారియొక్క 'వీర్య'పరిణతికి, వీర్యపరిపోషణాపటుత్వములకు ముఖ్యసాధనమై అది అతడిభావిజీవితాభ్యున్నతికి, జీవితవికాసానికి ఎంతగా తోడ్పడుతూందో ఇక సంగ్రహంగా తెలుసుకొందాం.

బ్రహ్మచారియొక్క పూర్ణజీవితవికాసానికి 'వీర్యపరిణతి' అనేది ప్రాణంవంటిది. ఇది, ఇంద్రియనిగ్రహం, వీర్యసంరక్షణం అనేవాటిపై ఆధారపడిఉంది. బ్రహ్మచర్యవ్రతనియమపాలనమునకు "క్రుంగటివేరు" అనతగిన "ఇంద్రియనిగ్రహం" ప్రాణతుల్యంకాగా, ఈ నిగ్రహానికి "బ్రహ్మచర్యవ్రతపాలనం" "మూలమంత్రం" అనదగిఉంది.

ఈవ్రతపాలనం చేతనే బ్రహ్మచారికి, మిగిలిన తన మూడుఆశ్రమధర్మాలను నిర్వహించడానికి అవసరములైన- అపేక్షితములైన- సర్వవిధశక్తులు, యోగ్యతలు ఈ బ్రహ్మచర్యాశ్రమములోనే బ్రహ్మచారికి బీజప్రాయంగా ప్రాప్తిస్తున్నాయి. ఇంకా ఈశక్తులు భావిలో బ్రహ్మచారియొక్క భావిజీవితవికాసానికీ, అతడి పూర్ణజీవితసిద్ధికీ సాధనము లౌతూ అవి అతడిశరీరానికి మంచి తేజఓజోబలవీర్యపుష్టితుష్ట్యారోగ్యసంపదనుకూడా అవి అమరచేస్తున్నాయి. వీటన్నింటికీ మూలం- "వీర్యపరిణతి" అనేమాట మరవరానిది. ఇది బ్రహ్మచారియొక్క శరీరభాగాలన్నింటినీ వ్యాపించి ఉంటూ అతడి జీవితధారణానికి సర్వవిధశక్తుల ప్రాదుర్భావానికి ప్రథమసాధనముగా ఉందని, వాగ్భటపండితుడు "వాగ్భటము" అనే తనవైద్యశాస్త్రగ్రంథంలో నిరూపించినాడు. (...మరణం బిందుపాతేన)

ఇట్లు సర్వవిధాలా మనజీవితధారణకు మూలాధారమైన "వీర్యసంరక్షణము"నకుగాను బ్రహ్మచారి చేసే బ్రహ్మచర్యవ్రతనియమపాలనమే "బ్రహ్మచర్యం" అనిపించు



కొంటుంది. ఇది "ఇంద్రియనిగ్రహవిధానం"కి మూలమంత్రం వంటిదని శాస్త్రకర్తలందరును ఏకకంఠ్యంగా దీనిని అంగీకరించడంచేతనే ఇది త్రికాలాబాధ్యమైన సత్యమనీ, సనాతనధర్మరూపమనీ సిద్ధాంతమయింది. ఇది మనజాతీయజీవనవిధానమునకు "జీవనాడి".

వీర్యధాతువు ఏర్పడేరీతి- దానిస్థానం :—

'శుశ్రుతుడు' అనే మనఆయుర్వేదవైద్యశాస్త్రనిపుణుడు "శుశ్రుతము" అనే తన వైద్యశాస్త్రగ్రంథంలో "వీర్యోత్పత్తిని"గూర్చి చెప్పిన వాక్యాలభావం ఇది.

"మనం ఆరగించిన అన్నరసాన్నుంచి రక్తం ఏర్పడుతుంది. ఈరక్తంనుంచి మాంసం, ఈమాంసంనుండి మేధస్సు, దీనినుండి 'శుక్రం' అనబడే 'వీర్యం' ఏర్పడుతాయి. వీనినే 'సప్తధాతువు' లన్నారు. ఈవీర్యం క్రమపరిణామం చెంది తేజోరూపంతో మనశరీరాన్నంతా ప్రకాశింపజేస్తుందని మహర్షులనిర్ణయం.

మనం ఈరోజున తిన్న ఆహారపదార్థాలు క్రమంగా మార్పులుచెంది ఒక నెలకు 'వీర్యం'గా మారుతాయి. అంటే, మనం ఒక నెలకాలంలో తిన్న 40 శేర్ల భోజనం ఆయా మార్పులుచెంది సారరూపంలో 1 శేరురక్త మౌతుంది. మొత్తం ఈ శేరురక్తం క్రమపరిణామాలతో తులన్నర వీర్యమౌతుంది. ఎక్కువపాలలో- (సారరూపంగా) 'నెయ్యి' దాగిఉన్నట్లును, చెరకురసంఅంతటిలో బెల్లం వ్యాపించి కనిపించకుండా ఉన్నట్లుగాను, మనశరీరంఅంతటా 'వీర్యం'

వ్యాపించి ఉంది." అని ఈశ్రుతిసూక్తి ఇలా సాక్ష్య మిస్తోంది.

"యథా పయసి సర్పిస్తు గుడ శ్చేక్షురసే యథా ।

ఏవం హి సకలే కాయే 'శుక్రం' తిష్ఠతి దేహినామ్" (శుశ్రుతం)

వీర్యసంరక్షణావశ్యకత :—

మీాద చూపిన శాస్త్రీయప్రమాణవచనాలనుబట్టి చూస్తే 'శుక్రం' అనబడే ఈ 'రేతస్సు' ఒక్కొక్కబిందువుదగ్గర నుంచీ శక్తిమంతమై మనశరీరమంతా వ్యాపించి మొత్తం శరీరానికి బలకాంతిపుష్టిశక్తిసామర్థ్యాదులను సర్వదా కలిగిస్తూంటుందని తేలింది. ఇట్లు మనశరీరప్రాణధారణకు, మన మనుగడకు మూలమై క్షణక్షణం మన ఆనందమయజీవికకు అత్యవసరమైన ఈశుక్రధాతువు క్రమాభివృద్ధి చెందడానికి కావలసిన సర్వవిధసాధనసంపద "బ్రహ్మచర్యనియమ పాలనం"లో మాత్రమే స్థిరంగా నిలిచిఉన్న సంగతి స్మృతి నిదర్శనాలద్వారా ఋజువయింది.

కనుక ప్రతిజీవికీ ప్రాణశక్తిప్రదమైన ఈశుక్రధాతువు తాలూకు ఒక్కబిందువునుకూడా దాని అపరిణామదశలో ఏ ఒక్కడూ నష్టపరచకూడదనీ, ఈముఖ్యధాతువుతాలూకు 'బిందుపతనం' జీవితపతనంవంటిదనీ, ఈశుక్రంతాలూకు "బిందుధారణం" జీవితధారణంవంటిదనీ వాగ్భటగ్రంథం వ్యక్తంచేసిందికదా! ఈవిశిష్టవిషయాన్ని 'శివసంహిత' లోని సూక్తికూడా ఇలా అనువదించింది.



"మరణం బిందుపాతేన, జీవితం బిందుధారణాత్ ।

తస్మా దతిప్రయత్నేన, కురుతే బిందుధారణమ్ ॥"

ఈవిధంగా సర్వవేళలా సర్వవిధాలా సర్వప్రయత్నాలతో చేసిన వీర్యసంరక్షణమే, అనగా ఇంద్రియనిగ్రహమే నిజమైన, శాస్త్రోక్తమైన, సర్వశ్రేయస్సంధాయకమైన 'బ్రహ్మచర్యం' అనిపించుకొంటుందని సారాంశంగా తేలిన సిద్ధాంతం.

వీర్యసంరక్షణవిధానం :—

మానవుని బంధమోక్షాలకు అతడిమనస్సే ముఖ్యకారణ మౌతుందని 'మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అనే స్మృతివాక్యం చాటుతూంది. కనుక తనజీవితశ్రేయస్సును కాంక్షించేవాడు తనమనస్సును దుష్టసంకల్పాలనుండి దూరం చేసి, సత్సంకల్పాలకేసి తనమనస్సును మరల్చడం ఎంతో అవసరమై ఉంది.

ప్రస్తుతంలో బ్రహ్మచారియొక్క "శుక్రసంరక్షణం" 'శుక్రపతనం' అనేవికూడా అతడి మానసికస్థైర్యంమీాదను, మానసికభావాలపైనను ఆధారపడిఉన్నాయి. దుష్టసంకల్పాలకు మనమనస్సు అధీనమయినప్పుడు అట్టిచిత్తం చాంచల్యం చెంది పటుత్వం, స్థిరత్వం తప్పిఉండడం సహజం. తత్ఫలితంగా స్వప్నాలలో తరచుగా 'వీర్యస్ఖలనం' కలుగుతూండడం, దాని ఫలితంగా ఆచంచలచిత్తుని శారీరకమానసికబౌద్ధికశక్తులు క్రమంగా క్షీణించడం వంటివి మొదలయి, అట్టిజీవితం అసర్థ

పరంపరలో చిక్కుకుంటుంది. దుష్టసంకల్పాలప్రభావమే అంతటిది.

కనుకనే దుష్టవిషయములకు చెందిన స్మరణాదులు బ్రహ్మచారికి ప్రబలశత్రువులవంటివని తెలుసుకొన్న మహర్షులు వాటిని, ఈవ్రతనిర్వహణకాలంలో పూర్తిగా నిషేధించారు. అట్టి దుష్టస్మరణాదులను 'అష్టవిధమైథునాలు' అంటారు. వాటిస్వరూపం ఇలా ఉంటుంది. తరచుగా స్త్రీసంబంధమయిన స్మరణం, ఆమెకుచెందిన మాటలు, జవ్వనితో కలసి ఆడుతూన్నట్లు భావించడం, ఆమెకు చెందిన చిత్రాలు ఆసక్తితో చూస్తూండడం, ఆమెతో రహస్యసంభాషణం తత్సమ్మేళనభావనలు, ఆభావనలు మనస్సులో దృఢం చేయడం, వీటిని క్రియారూపంలోకి తెచ్చినట్లుగా భావించడం, అనే ఇవి 'అష్టవిధమైథునాలు' అని ఆలంకారికులు ఇలా నిర్ణయించారు.

"స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తి రేవ చ ॥
ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః ।
విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః ॥"

ఈ 8 దుష్టభావాలను తనమనస్సులోనికి రానీయక బ్రహ్మచారి ఆదుష్టస్మరణాదులను దూరంగా పారద్రోలి వీటికి విపరీతమైన పవిత్రవేదాఽధ్యయనాదులతో తనమనస్సును నిర్మలంచేసి తన్మూలకమైన 'ఇంద్రియనిగ్రహాన్ని',



చిత్తస్థైర్యాన్ని అలవర్చుకొని తద్ద్వారా అతడు తన "వీర్య సంరక్షణం" చేసుకోవలసిఉంది. ఈవిధానం కర్తకు వీర్య పటుత్వసంపాదకమై అదే క్రమంగా అతడిమోక్షప్రాప్తికి కూడా కమనీయకారణ మౌతుందని-

" యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే"

అనే గీతాసూక్తి చాటుతూంది. మన పగటిభావనలే రాత్రి స్వప్నాలుగా మారి అవి తమకు తగిన ఫలితాలనే కర్తచే అనుభవింపజేయడం మన అనుభవంలోనిదేకదా!

కనుక బ్రహ్మచారి తనబ్రహ్మచర్యాశ్రమానికి విరుద్ధమైన దుష్టస్మరణాదులను పూర్తిగా విసర్జించి, ప్రవిమలపవిత్రభావనాప్రేరకాలైన వేదాధ్యయన, అధశ్శయన భైక్షాచరణ (మధుకరవృత్తి), క్షారలవణవర్జన, సాత్త్వికాహారాదికఠోర బ్రహ్మచర్యవ్రతనియమపాలనంతో తనమనస్సును, ఇంద్రియాలను నిగ్రహించడంద్వారా వాటిని తనస్వాధీనంలోనికి తెచ్చుకొనడమే 'వీర్యసంరక్షణమునకు' శాస్త్రోక్తవిధానమని విశదమయింది.

ఇంకా దీనిసంరక్షణకు ఉపయోగించే ఎన్నో శాస్త్రీయ ప్రక్రియలను మనమహర్షులు లోకశ్రేయస్సంపాదన ధ్యేయంతో ఈప్రథమాశ్రమానికి ఆధారమైన ఉపనయనసంస్కారాంతభాగంలో శాసనరూపంలో విధించారు. A ఈప్రక్రియ

A "బ్రహ్మచార్యసి, అపోశాన, కర్మ కురు, మాసుషుప్థాః । (దివాభాగే) భిక్షాచర్యం చర, ఆచార్యాఽధీనో భవ" మొదలైనవి.

లన్నీ బ్రహ్మచర్యవ్రతనియమపాలనకు పరమసహకారులై, బ్రహ్మచారియొక్క “ఇంద్రియనిగ్రహ” రూపక్రియాసిద్ధికి పూర్తిగా దోహదం చేస్తాయి. ఆనియమాలలో మరికొన్ని ఇవి—

బ్రహ్మచారి :— “తాంబూలం వేసుకోనరాదు; అతడు అద్దంలో తనముఖాన్ని చూసుకోనరాదు; పరుపుమీద పరుండరాదు; పుష్పమాలలను ధరించరాదు; తనశరీరమునకు మంచిగంధాదులను పూసుకోనరాదు. ముట్టుతలతో మాట్లాడరాదు; తనమనస్సునకు, ఇంద్రియాలకు ఆవేశాలను, ఉద్దీపన ఉద్రేకాలను కలిగించే ఏ ఒకపనినీ చేయరాదు; ఇంద్రియోత్తేజకాలయిన మాటలనుకూడా మాట్లాడరాదు; గురు, గురుపత్నుల ఆజ్ఞలను మీరరాదు; వారి ఆసనాలపై కూర్చుండరాదు; ముఖ్యంగా మధుకరవృత్తితో సంపాదించిన భిక్షాన్నమునే ఆరగిస్తూ రాజసాహారాన్ని పూర్తిగా విసర్జించాలి.”

ఇంకా ఇట్టి నియమాలెన్నిటినో బ్రహ్మచారి ప్రతీరోజూ పాటిస్తూ వీనిప్రకారంగా తనదైనందినజీవితప్రవర్తనను మలచుకోనవలసిఉంది. ఇట్టి పరిస్థితిలో యువతీయువకులు కలిసి ఒకేస్కూలులో చదవడమనే నేటి “కో ఎడ్యుకేషన్” విధానం బ్రహ్మచారులకు ఎన్నోవిధాలుగా పరమశత్రువు వంటిదే ఔతుందనడంలో సందేహంలేదు.

మహర్షులచే విధింపబడిన మీదినియమాల స్వరూపస్వభావాలను పరిశీలించినచో బ్రహ్మచారియొక్క ఇంద్రియ (వీర్య) చలనస్ఖలనోత్తేజనాదులకు కారణమైన ఏఒక్కపనినీ



అతడు చేయరాదని మనమహర్షులమహితాశయమై ఉన్నట్లు స్పష్టమయింది. శుక్రమునకు అపరిణామదశయైన బ్రహ్మచర్యంలో బ్రహ్మచారికి బిందుపతనం మరణంవంటిదే ఔతుందని తెలుసుకొన్నాంకదా! ఈవిశిష్టవిషయాన్ని ఋజువుపరచే లౌకికనిదర్శన మిది.

గాలిదెబ్బతినక చెట్టునముగ్గి పరిపక్వదశను పొందిన కొబ్బరిపండు విత్తనంగా పాతబడినచో ఆవిత్తనంతాలూకు చెట్టు తిరిగి బాగా కాచి మంచిఫలాలను ప్రజలకు ప్రసాదిస్తుందికదా! ఇదేవిధంగా బ్రహ్మచారుల ‘వీర్య’ మనే విత్తనంకూడా స్ఖలనంవంటి దెబ్బలు- అనగా ఆఘాతాలు పొందనిదై శాస్త్రీయబ్రహ్మచర్యనియమపాలనం ద్వారా బాగా పరిపక్వదశను చెందినచో అట్టి పరిణత వీర్యవంతులైన దంపతులు ఉత్తమమైన- ఆరోగ్యవంతమైన- సంతానమును మానవసంఘానికి ప్రసాదించగలుగుతారు.

ఈవిధంగా శాస్త్రీయమైన బ్రహ్మచర్యవ్రతపాలన మనేది క్రమంగా సాంఘికదేశీయాభ్యుదయాలసిద్ధికి మూలమౌతుంది. ఇక దుష్టభావనలకారణంగా స్ఖలనాద్యాఘాతాలకు గురియైన బ్రహ్మచారియొక్క అపరిణతవీర్యం, అనారోగ్యగ్రస్తమైన- తేజోవిహీనమైన- దుర్బలదూషితమైన నీరససంతానమునే సంఘానికి సమర్పించగలుగుతుంది. ఇట్టిమానవులు కల సంఘంకూడా దుర్బలమై సాంఘికశ్రేయస్సంపాదనాది విషయాలలో అట్టిసంఘం అసమర్థమే ఔతుంది.

కనుక సాంఘిక దేశీయాభ్యుదయాలదృష్టితో పరిశీలించినా కూడా ఈ ప్రథమాశ్రమగతనియమపాలనం, స్వజీవితాభ్యుదయసిద్ధికీ, తద్ద్వారా సాంఘిక దేశీయాభ్యుదయములసిద్ధికీ మూలమౌతుందని అన్ని విధాలా ఋజువయింది.

మీద చెప్పినరీతిలో మనమహర్షులు, విశ్వశ్రేయస్కామనతో హైందవధర్మసంప్రదాయ సంరక్షణదీక్షాదీక్షితులై భారతజాతిసౌధానికి మొదటి ఆశ్రమంలోనే బలంగా పునాదులువేసి, యుగయుగాలకేనా సడలని బలాన్ని, ప్రౌఢత్వాన్ని చేకూర్చినారని స్పష్టమయింది.

ఇక, మీదచెప్పిన విషయాలను ఉపనయన మంత్రార్థాలుకూడా ఋజువుపరుస్తూన్న విషయాలను సంగ్రహంగా విలోకించుదాం.

ఉదాహరణకు- నూతనవటువు, ముంజగడ్డితో ముప్పేటగా పేనిన మొల్త్రాడును మూడుపేటలుగా ధరించేటప్పుడు పఠించే మంత్రంలోని భావమిది. ఇవి బ్రహ్మచారిమాటలు- "ఈ మొల్త్రాడు (కర్త) మాభాషణములలోని దుష్టత్వాన్ని నశింపజేసేది. శ్రేష్ఠమయిన మాగృహమును పవిత్రింపజేస్తూ మావద్దకు వచ్చినట్టిది. ఇంకా ఈమేఖల, ప్రాణఅపానములకు బలమును కలిగించేది. దేవతలకు ప్రియమైనది. సురూపం కలది. సత్యమును, తపస్సును పూర్తిగా రక్షించేది- రాక్షసశక్తులను హింసించేది. శత్రువులను అవమానించునది. ఇట్టి విశిష్టగుణములతో కూడిన ఓ మేఖలమా! మంగళస్వరూపిణివైన నిన్ను



ధరించుటచేత మేము సమధికసామర్థ్యంతో ఈ ఆశ్రమాన్ని శాస్త్రోక్తరీతిలో నిర్వహించెదముగాక !" A

మీదిమంత్రగతభావాన్నిబట్టి వటువులో ఇంతకు ముందులేని క్రొత్తఅర్హతలు (శక్తులు) ఈ మేఖలాధారణరూప సంస్కారనిర్వహణానంతరమందే (వటువులో) ప్రవేశించాయని ప్రకటితమౌతుంది. ఇక చర్మయజ్ఞోపవీతాన్ని ధరించేటప్పుడు వటువుచెప్పే మంత్రంలోని భావం ఇది.

నల్లఇర్రిచర్మాన్ని జందెముగా తయారుచేసి ధరిస్తూన్న బ్రాహ్మణవటువుయొక్క మాట లివి.

"ఈచర్మయజ్ఞోపవీతం (ధరించినవానికి) దీర్ఘాయుర్దాయప్రదమై B ధరించినవానికి అది తేజస్సును, బలమును, కీర్తిని కలిగించేది. ధూర్తబాలుర కీజందెం ధరింపరానిది. కండువాగా ధరింపబడినదై ఇది మానవజీవితాన్ని ఒడుదుడుకులులేని మంచిమార్గంగుండా వార్ధక్యదశను చేర్చగలిగినది; అన్నసమృద్ధిని కలిగించేది. ఇట్టి ఈ 'చర్మయజ్ఞోపవీతమును, శరీరాన్ని చుట్టుతిరిగి ఉండునట్లు ధరిస్తున్నాను. C" 'చర్మయజ్ఞోపవీతధారణం' అనే ఈసంస్కారంచేత సంస్కరింపబడిన వటువులకు ముఖ్యమైన ఇన్నిప్రశస్తప్రయోజనాలు ప్రాప్తిస్తున్నాయన్నమాట మరపరానిది.

---

A "ఇయం దురుక్తాత్పరి.... మారిషామ."

B "అజినోత్తరీయో హి దీర్ఘాయుష్మాన్ భవతి"

C 'మిత్రస్య చక్షుః.... పరీదం వాజ్యజినం దదేఽహమ్"

ఇక ఆచార్యు డనబడే తండ్రి తనకుమారుని జీవిత రక్షణకై కడుపారా కన్న ఆబాలనూత్నవటువును సూర్యాది దేవతలకేకాక యమధర్మరాజునకు, మృత్యుదేవతకు, రోగ దేవతకుకూడా అప్పగిస్తాడు. విపరీతంగా కనిపించే ఈవైదిక క్రియలోని ఆంతర్య మిది. లోకంలో ఒకరితోటలోని ఫల సాయాన్ని కొందరు గజదొంగలు పూర్తిగా అల్లరిచేస్తూండగా తెలివికల ఆతోటకావందు, అల్లరిచేస్తూన్న ఆదొంగలకే తనతోటను అప్పజెప్పి ఆవిధంగా తనతోటకు రక్షణ కల్పిస్తాడు. ఇదేవిధంగా తనకొడుకుశరీరానికి రోగాలు,అపాయాలు కలిగించే యమాదులకే తనకుమారుని అప్పగిస్తే అటుపైన వానికి రోగాదులవలన కలిగే కష్టనష్టా లుండవుకదా! ఇట్టి గొప్పలోకజ్ఞానంతో ఇట్టివైదికసంప్రదాయాలను ఏర్పాటు చేసిన మనఆర్యమహర్షుల లోకశ్రేయస్కరదృష్టి, దూరదృష్టి విశ్వమాంగల్యసంపాదనదృష్టి అనేవి ఇచ్చట చక్కగా సంప్రకాశితాలౌతున్నాయి. కనుక మనఆర్యమహర్షులు అందరకు ప్రాతస్స్మరణీయులే ఔతారు.

ఇక సుముహూర్తసమయంలో తండ్రి కుమారుని కుడి చెవిలో రహస్యంగాచెప్పే బ్రహ్మోపదేశమంత్రభావమిది. A "కుమారా! నీవు గృహస్థాశ్రమంలో ఉత్తమసంతానం పొందడానికి కావలసిన సర్వవిధశక్తులను, యోగ్యతలను వీర్యపరిణతిని

A "ముహూర్తకాలే ఆత్మన స్సమీప మానయతి 'సుప్రజా' ఇతి దక్షిణే కర్ణే జపతి" "సుప్రజాః ప్రజయా భూయాః"



ఈబ్రహ్మచర్యాశ్రమంలోనే సంపాదించుము. ఇట్లే నీభావి గృహస్థాశ్రమంలో వీరులైన పుత్రపౌత్రులతో కలిసి, నీవు కూడా వీరుడ వనిపించుకొనడానికి తగిన అర్హతలను ఈబ్రహ్మచర్యవ్రతనియమపాలనసమయంలోనే సంపాదించుము. ఇట్లే కుమారా! అచిరభావిలో నీవనుష్ఠించవలసిన గృహస్థాశ్రమ ధర్మాలను ఆచరించడానికి అత్యావసరంగా కావలసిన వీర్య పుష్టిపరిణతులను నీవు ఈబ్రహ్మచర్యాశ్రమంలోనే సంపాదించి తద్ద్వారా తేజస్వివి, వర్చస్వివి కావలెను".

తండ్రి చేసిన ఈబ్రహ్మోపదేశాన్నిబట్టి పరిశీలించినపుడు, గృహస్థ వానప్రస్థ సన్యాసము లనే తరువాతి మూడుఆశ్రమాలలోని ధర్మాలను సమర్థవంతంగా నిర్వహించడానికి కావలసిన సర్వవిధయోగ్యతలను, సర్వవిధశక్తులను సంపూర్ణంగా ప్రసాదించేది ఒక్క 'బ్రహ్మచర్యవ్రతనియమపాలనమే' అనేది త్రికాలాబాధ్యమైన సత్యమని స్పష్టమయింది.

ఇక తండ్రి నూత్నవటువునకు యథావిధిగా గాయత్రీ మహామంత్రాన్ని ఉపదేశించినవెంటనే ఆవటువులో అపూర్వమయిన- అద్భుతమైన మహత్తరశక్తి ప్రవేశించడంచేత ఆ నూతనవటువు అదనంగా వందలరెట్లు బరువెక్కుతాడు. అట్టి కుమారుణ్ణి తండ్రి సూర్యపరమాత్మసందర్శనమునకు తీసికొని వెళ్ళడానికై కూర్చున్నచోటినుండి లేవదీయలేక అపుడు, తండ్రి కొడుకుతో చెప్పేమాట లివి.

"కుమారా! నిన్ను ఇచ్చటనుండి లేవదీయుటకు, నాజీవితకాలంలో గల శక్తినంతను ఒకచోటికి కేంద్రీకరించి

ప్రయత్నించి నాకూడా నిన్ను కూర్చున్నచోటినుంచి లేవదీయలేకపోయాను. కనుక ఓషధులను, మేఘములను ప్రార్థించి వాటినుండి గ్రహించిన రసజలరూపశక్తులను నాయావచ్ఛక్తితో జోడించి ఆమొత్తంశక్తితో, నిన్నిటనుండి దేవతాసందర్శనమునకై లేవదీయుచున్నాను" A. అని ఆమంత్రార్థం. కుమారునిలో ఇంతకు ముందు లేని ఇట్టి అద్భుతశక్తులెన్నో కుమారునిలో ఈపవిత్రసంస్కారంచేతనే ప్రవేశించినట్లు, ఇందలి మంత్రార్థాలు చాటుచున్నాయికదా!

## వి వా హ ము.

"వివాహము" అనగా, నూత్నవధూవరులకు వారి గృహస్థాశ్రమానికి సంబంధించిన విధులను, ధర్మాలను కన్యాదాత అగ్నిసన్నిధిలో మంత్రసంస్కారయుతంగా వారికి ప్రబోధించే పవిత్రసంస్కారవిశేషం.

"విశేషేణ వాహయతీతి వివాహః"

అనే వివాహశబ్దవ్యుత్పత్త్యర్థంకూడా మీది అర్థాన్నే అభివ్యక్తంచేస్తూంది.

ధర్మ,అర్థ,కామ,మోక్ష పురుషార్థాలసరససమ్మేళనరూపమే 'వివాహసంస్కారం' అనిపించుకొంటుందని మొత్తంమీద చెప్పవలసిఉంది. కనుక, అభ్యుదయప్రదములైన ఐహిక ఆముష్మికప్రయోజనములతోకూడి, నూత్నవధూవరులలో అంతకు ముందులేని పవిత్రశక్తులను, యోగ్యతలను కొత్తగా వారిలో ఉదయింపజేసే శాస్త్రీయక్రియాకలాపానికే 'వివాహం' అనేపేరు చెల్లుతుందని తేలింది.

---

A "ఉదాయుషా—ఉదస్థా మమృతాగ్ం అను"



ధర్మయుతమైన అర్థకామముల శ్రేయస్కరత్వం :—

ధర్మాన్ని అనుసరించి ప్రవర్తిస్తూన్న అర్థకామముల శ్రేయస్కరత్వాన్నిగూర్చి ప్రత్యేకముగా ప్రబోధించిన మనమహర్షి పుంగవులప్రబోధాలలో- "రమ్యరమణీయవిశ్వకళ్యాణకరవిశిష్టభావన" విశ్వచరిత్రలో విశ్వవంద్యంగా విరాజిల్లుతూనే ఉంటుంది. ఇట్లు మానవజాతికంతటికీ సర్వకాల సర్వావస్థలలో హితంకరములు, ప్రియంకరములు, క్షేమంకరములు ఐన మహర్షులమహితప్రబోధాలను 'తోసిరాజు' చేసి ప్రబలిన అర్థకామాలకు దాసులైన మానవులకు వినాశం పొంచిఉంటుందనే సత్యాన్ని కౌరవులయొక్క, రావణకీచకుల యొక్క జీవితచరిత్రలు, చరిత్రఉన్నంతకాలం చాటుతూనే ఉంటాయి. ఇట్లు ధర్మరహితమై ప్రబలిన అర్థకామాలవలన లోకమునకు కలిగే అనర్థాలను బాగా తెలిసినవారు కనుకనే మహర్షులు, వివాహంలో, కన్యాదాతచేత నూత్నవరునికి శాసనరూపంగా ఇలా చెప్పిస్తారు.

"దాతా- ధర్మార్థకామేషు త్వయైషా నాతిచరితవ్యా"

"ఓనూత్నవరా! వివాహానంతరం నీవీమెతోకూడి ధర్మ అర్థకామపురుషార్థాలను సమానాదరభావంతో, అనగా సమానప్రాధాన్యభావంతోనే సేవించవలెను (శాసనం). అంతేకాని అర్థకామాలను మాత్రమే ప్రత్యేకంగా సేవించరాదు (నిషేధం). అంటే గృహస్థాశ్రమంలో నీవు (వరుడు) సేవించబోయే అర్థకామాలు ధర్మాన్ని పురస్కరించుకొని దాని అడుగుజాడల్లోనే ప్రవర్తించవలెను."

ఇట్లు మామ చెప్పిన శాసననిషేధాలను వరుడు అంగీకరిస్తూ 'నాతిచరామి' అని మామగారికి హామీ ఇచ్చిన పిమ్మటే మామ, వరునికి కన్యాదానం చేస్తాడు. దీనినిబట్టి ధర్మయుక్తంకాని విశృంఖలకామం మానవజాతికి అనర్థప్రద మౌతుందనీ, ధర్మయుతమైన దంపతులకామం సత్సంతాన ప్రదమౌతూ అట్టి కామంక్రమంగా సాంఘిక దేశాభ్యుదయముల సంపాదనకు చక్కని సాధనమౌతుందనీ తేలింది. ఇచ్చట ఒక పరమార్థం తెలుపవలసి ఉంది. వరుడు తాను వివాహముచేసుకోవడంలో గల తనముఖ్యధ్యేయాన్ని తనమిత్రులముఖతః కన్యాదాతకు మొదటనే ఇలా తెలుపుతాడు.

"ధర్మప్రజాసంపత్త్యర్థగ్గం స్త్రియ ముద్వహే"

"గృహస్థాశ్రమధర్మాలను ఆదినుండీ ఆసక్తితో ఆచరించడానికీ, సత్సంతానమును పొందడానికీ ఈ రెండుధ్యేయాలతోనే నేను అగ్నిసాక్షికంగా స్త్రీని, పరిణయమాడదలచాను." వరుని ఈవివాహధ్యేయాలలో మొదటిది 'స్వీయ ధర్మాచరణం'; తరువాతది 'సత్సంతానలాభం'. ఇట్లు సత్సంతానప్రాప్తికి మూలమైన వరునికామం, మొదటిదైన ధర్మాన్ని పురస్కరించుకొని ప్రవర్తించడంచేతనే అది దంపతుల పవిత్రపరిణయసిద్ధికీ, అట్టి పరిణయమునకు ఫలరూపమైన సత్సంతానలాభానికీ, ఆలాభం సాంఘిక శ్రేయస్సునకు పరంపరాకారణమయింది. కనుక, మనపురుషార్థాలలోని అర్థ కామాలు ధర్మపూర్వకముగానే ప్రవర్తిల్లవలెనని మనవైవాహికధర్మాలు, మనపవిత్రసంప్రదాయాలు శాసించినవి.



ఇట్లు మానవుల "కామపురుషార్థం ధర్మాన్ని పురస్కరించుకొనే ప్రవర్తిల్లవలెను" అనే భారతీయవైవాహిక ధర్మంలో ఉండే సత్యాన్ని పార్వతీదేవి పరిణయగాథ ఇలా ప్రకాశింపజేసింది. గిరిజాకుమారి శారీరకసౌందర్యం- విశ్వాతీతమైనదని కాళిదాసకవి- "ప్రపంచంలో ఉండే సౌందర్యసర్వస్వాన్నంతా ఒకేస్త్రీలో చూడాలనే అభిలాషతో బ్రహ్మ గిరిజాకుమారిని సృజించినాడా ? అన్నట్లుండె"నని వర్ణించినాడు. అంతటి ఆమెసౌందర్యం మన్మథునిసమ్మోహనాస్త్ర సహాయం ఉండికూడా మహేశ్వరుణ్ణి వశం చేసుకోలేకపోయింది.

కారణం ఏమిటనగా- అప్పటి గిరిజయొక్క సౌందర్యం భౌతికమై ఉండటం, మహేశ్వరుడు ఆధ్యాత్మికశక్తి సంపన్నుడుకావటం- కనుక ఆగిరిజాకుమారి వ్యర్థమైన అప్పటి తనభౌతికసౌందర్యాన్ని కఠోరతపస్సు (గౌరీతపస్సు) చేసి ఆధ్యాత్మికసౌందర్యంగా మలచుకొని అట్టి ఆధ్యాత్మిక సౌందర్యశక్తితో మహేశ్వరుణ్ణి పతిగా చేసికొని, అప్పటి పవిత్రప్రేమశక్తితో మహేశ్వరుని అర్ధశరీరంలో నిత్యనివాసం కల్పించుకొనగలిగింది. అంటే ఆపరమేశ్వరునికి 'అర్ధాంగి' అయిందన్నమాట. ఆనాటి ఆగౌరీతపస్సే నేటికీ మనకన్యాజనం తమవివాహానికి మొదట చేసే 'గౌరీపూజ'గా నిలిచింది. కాని ఆమెకు అబ్బిన 'అర్ధాంగి' ధర్మం మనకన్యకల 'గౌరీపూజ'లో కనబడదు. పిండికొద్దీ రొట్టెకదా !

ఇంతకూ చెప్పేదేమంటే భారతీయుల వైవాహికసంప్ర

దాయాలు 'ఆధ్యాత్మికశక్తి'తో ఉత్తమోత్తమప్రయోజనాలు పొందుతూంటాయనీ, అంతటి ప్రయోజనాలు పొందడానికి, భారతీయవివాహసంప్రదాయాలలో వారి కామపురుషార్థం ధర్మంతో కూడిఉండడమే మూలకారణమనీనావిశ్వాసం. కనుకనే గంధర్వకాంత ఐ ఉన్న వరూథినియొక్క అంతటి సమ్మోహనకరసౌందర్యశక్తికూడా అసలు ప్రవరాఖ్యుణ్ణి వశంచేసుకోలేకపోయింది. కారణం ఆమె కామపురుషార్థం ధర్మరహితంకనుక. ఈవిధంగా భారతీయ వివాహ సంప్రదాయంలో మొదట్లోనే మనకామపురుషార్థం ధర్మంతో కూడిన కారణంచేతనే అది దంపతుల జీవితశ్రేయస్సంపాదనకు మూలమయింది.

కామప్రవృత్తినిరోధాలు - మహర్షుల మధ్యేమార్గం :—

భౌతికదృష్టిలో "కామప్రవృత్తి" అనేది యౌవనసమయంలో ప్రతిప్రాణికీ సహజంగా ఉండే ప్రవృత్తి. ఈసహజప్రవృత్తిని ఒక్కసారి బలవంతంగా నిరోధించడంవలన, మానసికోన్మాదం (పిచ్చి), మూర్ఛవంటి భయంకరవ్యాధులు బయలుదేరుతాయనీ, అట్టివ్యాధులు కలవాడు ఏపనీ చేయలేని హీనదీనస్థితికి దిగజారుతాడనీ మనస్తత్వశాస్త్రవేత్తలు చాటిచెపుతున్నారు. ఎంతటివారైనా ఈకామప్రాబల్యాన్ని అణచుకోలేరు. అణచుకోలేముకదా అని స్వేచ్ఛాకామప్రవృత్తిని, గాలి పడవనువలె దాని స్వేచ్ఛాప్రవృత్తిలోనికి విచ్చలవిడిగా విడిచిపెట్టరాదు. విడిచిపెట్టితిమా ఆదుష్ట కామవేగం అట్టివారిని సర్వవిధాలా పతితులను చేసి క్రమంగా



నశింప జేస్తుంది. కనుక పూర్తిగా కామనిరోధంకాని, పూర్తిగా కామస్వేచ్ఛాప్రవృత్తికాని మానవులకు ఏవిధంగాను ఉపయోగించకపోవడమే కాక పైపెచ్చు అట్టిది, అనేకవిధాలైన అనర్థాలకు ఆదికారణమౌతుంది. ఈలోకస్వభావాన్ని బాగా తెలుసుకున్నవారు కనుకనే ఆర్యమహర్షులు ప్రబలకామాన్ని పూర్తిగా నిరోధించనూలేదు; స్వీకరించనూలేదు. మధ్యేమార్గంగా ఆకామాన్ని ధర్మంతో జోడించి శుద్ధిచేసి దాన్ని లోకక్షేమకరంగా మలచినారు.

ధర్మయుతమైన కామం సృష్టికి మూలం :—

సృష్టివిధానం అంతా 'కామం'పై ఆధారపడి ఉన్నట్లు వేదశాస్త్రవచనాలు చాటుతున్నాయి. 'కామం' అనగా "కోరిక" అనికూడా అర్థం ఉందికనుక, ఏవిధమయిన పని చేయాలన్నా ముందుగా ఆపనికి సంబంధించినకోరిక (కామం) మనలో జనించాలి. "భార్య కావాలి" అనే కోరిక పుట్టిననాడే వివాహం చేసుకొనడం అనే పని ప్రారంభమౌతుంది. ఇట్లే 'ధనం భాగా సంపాదించాలి' అనేకోరిక మనలో కలిగినప్పుడే ధనార్జనకు కావలసిన ప్రయత్నాలు చేయబడతాయి. ఈ విధంగా ఈభౌతికప్రపంచంలో ప్రతిగంటలో జరిగే పనులన్నింటికీ ఆపనులకు సంబంధించిన కోరికలే మూలకారణాలౌతున్నాయి. తనకూ, తనపితృదేవతలకూ పుణ్యలోకప్రాప్తి కావాలనే కోరికచేతనే కన్యాదాత కన్యాదానమనే క్రియను వ్యయప్రయాసలకోర్చి చేయగల్గుచున్నాడు. కన్యాస్వీకర్తకూడా ముఖ్యంగా, కామవాంఛాతృప్తిమూలక

మైన సంతానప్రాప్తికొరకే కన్యకను స్వీకరిస్తున్నాడు. కనుక, కన్యకను దానంచేయడం, ప్రతిగ్రహించడం అనే రెండుపనులూ కామమూలకాలే A. మీది నిదర్శనాలన్నీ జీవసృష్టికీ, క్రియాసిద్ధికీ 'కామం' అనేది మూలమై ఉన్నట్లు ధృవపరుస్తున్నాయి. కాని ఈకామం ధర్మయుతం కావాలి.

ధర్మరహితమైన కామోద్రేకం అనర్థావహం :—

ఇట్టికామం స్వేచ్ఛాప్రవృత్తితో ప్రాబల్యం వహించి ఎప్పుడైతే ధర్మపురుషార్థాన్ని 'తోసిరాజు' చేస్తుందో అప్పుడు అట్టి ప్రబలకామం మానవుని పతనానికి, వినాశానికి ప్రత్యేకకారణమౌతుంది. రావణాసురుడు, కీచకుడు, దుర్యోధనుడువంటివారు ధర్మరహితమైన అర్థానికీ, కామోద్రేకానికి పూర్తిగా లొంగిపోవడంచేతనే వారిని మృత్యుదేవత యవ్వనదశలోనే వరించిందికదా! అంటే వారికామం పూర్తిగా ధర్మరహితం కావడమే వారివినాశానికి మూలమయిందన్నమాట. ఈసత్యాన్ని రుజువుపరచే లోకనిదర్శన మిది. మండోదరి తనభర్త యగు రావణాసురుని నాశం విని ఇలా విలపిస్తుంది.

"ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా ।
స్మరద్భి రివ తద్వైర మింద్రియై రేవ నిర్జితః ॥"

(వాల్మీకిరామాయణం-యుద్ధకాండ).

A "కామో దాతా, కామః ప్రతిగ్రహీతా । కామేన త్వా ప్రతిగృహ్ణామి...."



"ఓపతిదేవా! నీవు నీఇంద్రియాలను నీస్వాధీనంలో ఉంచుకొని నీకామపురుషార్థాన్ని ధర్మపూర్వకముగా నడిపించినంతకాలము నీకు, ముల్లోకములను జయించడమనే అద్భుతకార్యసాధనం సాధ్యమయింది.

ఇక నీవు కామోద్రేకానికి వశుడవై ధర్మమార్గాన్ని విడిచిపెట్టి సీతాసాధ్విని ఎప్పుడు అపహరించినావో ఆసమయమే నీనాశనక్రియకు నాంది అయింది. నీనాశనక్రియకై పొంచి ఉన్నట్లున్న నీఇంద్రియాలచేతనే నాథా! నీవు జయించబడి నడివయస్సులోనే నాశం పొందితివా?" అని మండోదరి మీది శ్లోకంద్వారా విలపిస్తుంది. ఇది త్రికాలాబాధ్యమైన, అనగా భూతవర్తమానభవిష్యత్కాలాలలో మార్పులేని సత్యమని ఈగీతాసూక్త్యర్థం ఇలా చాటుతూంది. తన "ఇంద్రియాలను జయించలేనివానికి, వానిమనస్సుతో కూడిన వాని ఇంద్రియాలే ప్రబలశత్రువులౌతాయి. స్వాధీనంచేసికొన్నవాని ఇంద్రియాలే వానికి బంధువులవంటివౌతాయి.

"బంధు రాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥"

(భగవద్గీత— 6-6)

కనుక సృష్టికి మూలమైన 'పవిత్రప్రేమ' కామోద్రేకరూపంలో ధర్మరహితము, దూషితము కాకూడదనీ, అట్టి దూషితకామం సృష్టివికాసానికి కాక సృష్టివినాశానికే విశిష్టకారణ మౌతుందనీ మీదిచర్చద్వారా ఋజువయింది.

ధర్మసహితమయిన కామం :—

కనుక, కామపురుషార్థం ధర్మపురుషార్థంతో కలిసి దాని అడుగుజాడల్లో ప్రవర్తించినప్పుడే ధర్మసమలంకృతమైన అట్టి కామం మానవుల దైనందినజీవితాని కది మంగళదాయక మౌతుంది. అంటే ధర్మసహితమయిన కామంవలన మానవులకు ఏవిధమయిన అనర్థం పుట్టదన్నమాట. అట్టి ధర్మమూలక కామంవలన జనించిన ప్రేమ స్త్రీపురుషుల అన్యోన్యానురాగానికి మూలమౌతూ ఎట్టిక్లిష్టపరిస్థితులలోను అట్టిది చెక్కుచెదరకుండా ఉంటుంది. దీనికి ముఖ్యనిదర్శనం సీతారాముల ప్రేమ. వీరిప్రేమకు మూలమయిన వీరికామం వీరి స్వధర్మానికి విధేయమయి ఉంది. ఎట్లనగా, 'ప్రజానురంజనం' అనేది రాజుయొక్క ముఖ్యధర్మం. ఈధర్మాన్ని ఈశ్రీరామచంద్రుడు ఎట్టిపరిస్థితిలోనూ విడిచిపెట్టలేదు.

అసలు 'ప్రజారంజనం' అనే స్వీయధర్మసంరక్షణకోసమే శ్రీరాముడు ప్రాణాధికఐన తనసీతాదేవిని అడవిలోనికి పంపేశాడు. పతియొక్క పవిత్రప్రేమలోని తత్త్వాన్ని తెలుసుకున్నది కనుకనే ఆసాధ్వీమతల్లి అడవులపాలుచేయబడిఉండికూడా భర్తకు లక్ష్మణునిద్వారా ఇలా వార్తనంపుతుంది- "తిరిగి నా అరణ్యవాసానికి నాకర్మే కారణంకాని శ్రీరామచంద్రుడు కారణంకాదు; కనుక తనకై దుఃఖించక శ్రీరామచక్రవర్తి, ప్రజారంజనరూపస్వధర్మాన్ని నిర్విఘ్నంగా కొనసాగించవలెను." అని సీతాదేవి తనమాటగా తనప్రాణేశ్వరునికి విన్నవించుమని లక్ష్మణుని వేడుకొంటుంది.



దీనినిబట్టి అడవులలో విడిచిపెట్టబడిన సీతాదేవియొక్క పవిత్రపతిప్రేమ, కారడవులపాలుచేయబడినప్పుడుకూడా చెక్కుచెదరలేదన్నమాట. దీనికి ముఖ్యకారణం- సీతాదేవియొక్క కామం, "పాతివ్రత్యం" అనే ఆమెధర్మానికి వశమై ఉండడమే. ఇట్లే అడవులలో సీతను దిగవిడిచినప్పుడుకూడా ఆసీతకై శ్రీరాముడు విలపించడంచేత, అట్టి విషమసన్నివేశములోకూడా శ్రీరాముని పత్నీప్రేమ ప్రవృద్ధమే అయింది. దీనికి కారణం శ్రీరాముని కామం "ప్రజారంజనం" అనే రాజధర్మానికి వశమై ఉండి.

ఇట్లు భార్యాభర్తలకామం వారివారి ధర్మాలకు అధీనమై, ధర్మంయొక్క అడుగుజాడల్లో నడచుకొనడంచేతనే ఆ ఆదర్శదంపతుల పవిత్రప్రేమను ఏవిషమకరసన్నివేశమూ చలింపచేయలేకపోయింది. లౌకికప్రపంచంలోని దంపతులయొక్క కామంకూడా సీతారాములకామంవలె వారి ధర్మాలకు వశమై ఆధర్మాన్ని అనుసరించి ప్రవర్తించిననాడు అట్టి దంపతులకు అట్టి ధర్మయుతకామం శ్రేయస్కరమే ఔతుందనాలి.

మీద తెలిపిన విధంగా 'కామ' పురుషార్థంయొక్క స్వరూపస్వభావాలను వేలాది సంవత్సరాలకు పూర్వమే పూర్తిగా తెలుసుకొన్న మనమహర్షులు ఆకామాన్ని పూర్తిగా నిరోధించనూలేదు. ఆప్రబలకామవేగానికి మానవుణ్ణి దాసునిగా చేయనూలేదు. ఇక ఆమహనీయులు సర్వవిధ

విషమసమస్యలకు పరిష్కారమార్గంగా ఉండేటట్లు మధ్యే మార్గంగా 'కామాన్ని' ధర్మబద్ధం చేశారు. దీనితో ప్రబల కామంయొక్క విషమయవిశృంఖలత్వవేగం అంతా విలుప్తమై ఆకామం సంఘశ్రేయస్సంపాదనకు సమర్థమయిన చక్కని సాధనంగా తయారయింది. శుద్ధిచేయబడిన నాభికూడా అందరకు ఆరోగ్యప్రద మౌతుందికదా!

ఇట్లు నియమరహితాలైన మానవుల కామోద్రేక రూపప్రళయంకరనదీప్రవాహాలు భారతీయుల ప్రవిమలపవిత్ర ప్రేమసాగరంలో సంగమించి, అవి పవిత్రప్రణయభావరూప పరిణతితో పరిపూర్ణతను లోకక్షేమంకరత్వమును పొందవలెననియే మనమహర్షుల పవిత్రధ్యేయమై ఉన్నట్లు ప్రస్ఫుటమయింది. ఇట్టి ధ్యేయంతోనే వారు భారతీయులవివాహ సంస్కారాన్ని జగన్మాంగళ్యకరంగా మలచినారు. ఇట్టి సంస్కారనిర్వహణవలన స్త్రీపురుషులకు పూర్ణజీవితవికాసము, వంశాభివృద్ధి, సాంఘికశ్రేయస్సు, ఆధ్యాత్మికపరిణతి, మోక్ష ప్రాప్తి అనే మహత్తరప్రయోజనాలు వరుసగా సిద్ధించినవి.

ఇట్లు సంస్కారాలన్నింటిలో ఆద్య మనిపించుకొన్న 'గర్భాధాన'సంస్కారానికికూడా "వివాహసంస్కారం" మూల మయి ఉండడంచేతనే ఈవివాహసంస్కారంయొక్క ప్రత్యేకత, ప్రాధాన్యప్రభావాలు ప్రకాశితము లౌతున్నాయి.

వివాహంలో ధర్మప్రధానమయిన ప్రయోజనాలు :—

వరుడు, తాను వివాహం చేసుకోదలచిన కన్యక యొక్క తండ్రివద్దకు తన ఆత్మీయమిత్రులు నల్గురను పంపిస్తూ



తనవివాహధ్యేయాన్నిగూర్చి వారిముఖతః కన్యాదాతకు వరుడు తెలిపే వరవాక్యంలోని భావ మిది-

(1) "ధర్మ, సత్సంతానముల సంపదకై నేను వివాహము చేసుకొనదలిచినాను."[A] అని అతడు తెలుపుతాడు.

ఇక కన్యాదానం చేయబోయేముందు వరునివిషయంలో కన్యాదాతచేసే శాసనవాక్యంలోని భావ మిది.

(2) "ఓనూత్నవరా! నీగృహస్థాశ్రమంలో, నీవీమెతో కూడి నీఅర్థకామాలను ధర్మపూర్వకంగానే సేవించవలెను. అనగా ధర్మంతో కూడిన అర్థాన్ని, ధర్మంతో కూడిన కామాన్ని మాత్రమే నీవీమెతో కూడి సేవించవలెను. అంతే కాని ధర్మరహితమయిన అర్థకామాలను నీవు ఈమెవిషయంలో ప్రయోగింపరాదు. B."

ఇక నూత్నవరుడు తనవివాహాదిలో చేసే సంకల్ప వాక్యంలోని భావం ఇది. వరుడు నూత్నవధువుతో ఇలా అంటాడు.

(3) "ఓకళ్యాణీ! ఇటుపై మనమిద్దరం కలిసి 'గృహస్థాశ్రమధర్మక్రియలను' శ్రద్ధగా ఆచరిస్తూ ఈధర్మక్రియా

---

A. "ధర్మప్రజాసంపత్యర్థం స్త్రియ ముద్వహే" ఇతి వరః కన్యాదాతృ సమీపం చతురో వరాన్ ప్రేషయతి.

B. "దాతా- ధర్మార్థకామేషు త్వయైషా నాఽతిచరితవ్యా."

చరణ ఫలరూపంగా క్రమంగా సత్సంతానమును బడయవలెను." A.

ఈమూడవసూత్రములో చెప్పబడిన "ధర్మక్రియలు" దంపతుల గృహస్థాశ్రమధర్మాలకు చెందినవే. ఈవిధంగా మీాది మూడుసూత్రాలలో 'ధర్మ' శబ్దానికే మొట్టమొదటి స్థానం ఇవ్వబడింది.

ఇట్లు హైందవవివాహానికి చెందిన నిబంధనలు, నియమాలు, కట్టుబాట్లు మొదలయినవన్నీ మొదటినుంచీ 'ధర్మంతో' ముడిపెట్టబడి- అవి ధర్మపూర్వకంగాను, తత్కారణంచేతనే అవి లోకశ్రేయస్సంపాదకాలుగాను మలచబడినట్లు స్పష్టమాతూంది. ఈసత్యాన్ని సంపూర్ణంగా నిరూపించే నిదర్శనా లెన్నో వివాహమంత్రాలలోను, ఆసూత్రాలలోను మహితరీతిలో భద్రపరుపబడిఉన్నాయి.

ఇక, ఇంకో ధార్మికసూత్రం - 'వివాహక్రియలు ధర్మమూలకాలయిన' విధానాన్ని ఇలా విశదం చేస్తూంది.

(4) "గృహస్థాశ్రమధర్మనిర్వహణంకోసమే శాస్త్రీయంగా వివాహం చేసుకోబడి, 'ధర్మపత్ని' అనే యోగ్యత (డిగ్రీ) సంపాదించిన భార్య, భర్తతో కూడి అటు యజ్ఞాది ధార్మికక్రియలలో పాల్గొనుటకూ పనికివస్తుంది; ఇటు 'రతి' క్రియకూ పనికివస్తుంది.

కాని ప్రత్యేకముగా 'రతి'కోసమే ఉద్దేశించబడిన

A "ఆవాభ్యాం కర్మాణి (గృహస్థాశ్రమధర్మకర్మాణి) కర్తవ్యాని, ప్రజా శ్చోత్పాదయితవ్యాః"



భోగకాంత, ఒక్క 'రతి' కోసమే కాని, ధర్మక్రియాచరణమునకు పనికిరాదు. కారణం, శాస్త్రీయవివాహసంస్కారంలేని స్త్రీకి 'ధర్మపత్ని' అనే యోగ్యతలేదు. "...యా ధర్మార్థా సైవ రత్యర్థా; యా రత్యర్థా సా ధర్మార్థా న భవతి" అని పార్థసారథిమిశ్రపండితుడు తన "పూర్వమీమాంసాశాస్త్రదీపికలో" తెలిపినట్లు "మీమాంసాశాస్త్ర ప్రవీణ" బ్ర॥ శ్రీ రేమిళ్ళ సూర్యప్రకాశశాస్త్రిగారు "హిందూ వివాహము" అనే గ్రంథంలో తెలిపినారు.

ఈధార్మికనిబంధనకూడా వివాహం "ధర్మప్రధానమైనదే కాని భౌతికభోగప్రధానమయినది (మాత్రమే) కా" దని నిరూపించి నిశ్చయిస్తూంది.

ఇక కన్యాదాత వరునికి కన్యాదానంచేస్తూ అతడితో-

(5) "ఓవరా! ఈకమనీయకన్యాదానం నీకు ఎందుకు చేస్తున్నానంటే మొదట్లో నీవీమెతో కలిసి యజ్ఞాదిధర్మకార్యాలు ఆచరించడానికీ, పిమ్మట సత్సంతానమును నీవీమెయందు పొందడానికిగాను నీకీకన్యాదానం చేస్తున్నాను" అంటాడు. దీనిని బట్టి శాస్త్రోక్తరీతిలో వివాహసంస్కారం జరిపినపిమ్మటే స్త్రీకి 'సహధర్మచారిణి' 'ధర్మపత్ని' అనే యోగ్యత కలుగుతుంది. ఈయోగ్యత ఉన్నస్త్రీయే భర్తప్రక్కని కూర్చొని భర్తచేసే యజ్ఞాదిధర్మక్రియలలో పాల్గొనడానికి పనికివస్తుంది.

ఈవిషయాన్ని వ్యాకరణశాస్త్రానికిచెందిన ఒకపాణినీయ

వ్యాకరణసూత్రం ఇలా ధృవపరుస్తూంది. A. దీని అర్థమిది. 'పతి'శబ్దానికి యజ్ఞంతో సంబంధం ఉన్నప్పుడే 'న'కారాదేశం వచ్చి ఆపతిశబ్దం 'పత్నీ' శబ్దంగా మారుతుంది. ఉదాహరణకు- 'వసిష్ఠునిపత్ని' అన్నప్పుడు ఆపత్ని "వసిష్ఠుడు చేసే యజ్ఞంతాలూకు ఫలాన్ని అనుభవించే అర్హతకలది" అనే అర్థం వస్తుంది.

ఎలా వస్తుందంటున్నారా? శాస్త్రీయమయిన వివాహ సంస్కారంతో "దంపతులు" అనిపించుకున్నవా రిద్దరికి, వారి అంశం, యవ్వనజనితమైన ఆనందం మొదలైనవన్నీ, ఇద్దరూ కలిసి సరిసమానంగా అనుభవించే పూర్తిహక్కు- వారిద్దరికీ ఆసంస్కారప్రభావంచేతనే వస్తుంది. కనుక, "భార్యతో కలిసి ధర్మక్రియలు ఆచరించడానికే కన్యాదానం" అనే కన్యాదాతమాటలోనే "హైందవవివాహసంస్కారం ధర్మప్రాధాన్యం కలది" అనే పరమార్థం- వ్యాకరణసూత్రం ద్వారాకూడా ఋజువయింది. ఈపరమార్థాన్ని ఋజువుపరచే మరోనిదర్శన మిది.

(6) "ధర్మపత్ని తన ప్రక్కనలేని పురుషుడు యజ్ఞం చేయరాదు."

"అయజ్ఞో వా ఏషః । యోఽపత్నీకః"

అని తైత్తిరీయబ్రాహ్మణం అనబడే శ్రుతి- తెలుపు

A "పత్యు ర్నో యజ్ఞసంయోగే" పతిశబ్దస్య నకారాదేశ స్స్యాత్, యజ్ఞేన సంబంధే వసిష్ఠస్య పత్నీ, వసిష్ఠకర్తృకయజ్ఞఫలభోక్త్రీ త్యర్థః- దంపత్యో స్సహాధికారాత్ ॥ (చూ. సిద్ధాంతకౌముది)



తూంది. ఈశ్రుతివాక్యంలోని "అపత్నీకుడు" అనే పదానికి శాస్త్రీయ వివాహ సంస్కారంద్వారా 'ధర్మపత్ని' అనే యోగ్యతను పొందిన 'పత్ని లేనివాడు' అని అర్థం. యజ్ఞం చేసే భర్తప్రక్కన ఉండి యజ్ఞంలో పాల్గొనతగిన స్త్రీకి మాత్రమే 'పత్ని' అనేపేరు చెల్లుతుందని వ్యాకరణసూత్రం నొక్కివక్కాణించిందికదా! ఇక "వివాహసంస్కారంకల స్త్రీపురుషులకు మాత్రమే 'పతిపత్నులు' అనేపేర్లు చెల్లుతాయి" అని సప్తపదిలోని మంత్రాలు తెలిపినవి. ఎలా చూసినా స్త్రీకి వివాహసంస్కారంచేతనే 'ధర్మపత్ని' అనేపేరు వస్తుంది. కనుక "భోగకాంతను ప్రక్కన బెట్టుకొన్నవానికి యజ్ఞాచరణ యోగ్యత ఉండదు". అని మీది శ్రుతివాక్యంలోని భావం. ఈభావంకూడా వివాహసంస్కారంయొక్క ధర్మప్రాధాన్యాన్ని ఋజువుపరుస్తుంది. ఇక 'సంస్కారరత్నమాల' అనే ధర్మశాస్త్రగ్రంథంలోని ఒకసూత్రభావం ఇది.

(7) "దేవఋణాన్ని, పితరులఋణాన్ని పూర్తిగా తీర్చివేయడమనేదే వివాహానికి ఫలం."

"వివాహస్య ఫలం దేవపితృర్ణాఽపాకరణం"

(సంస్కారరత్నమాల 403 పే.)

ఈసూత్రార్థాన్నిపట్టి చూసినా కూడా, "హిందూ వివాహసంస్కారం ధర్మప్రాధాన్యంకలది" అనే పరమార్థం ప్రస్ఫుటమాతూంది.

(8) ద్విజునకు పుట్టుకతోనే ౩ ఋణములు (బాకీలు) ఏర్పడుతాయి. ఇవి ఋషి, దేవ, పితృఋణములు

అనబడుతాయి. సలక్షణంగా 'బ్రహ్మచర్యమును' ఆచరించడంచేత ఋషిఋణం తీరిపోతుంది. యజ్ఞములను యథోక్తంగా ఆచరించడంచేత దేవఋణం అనేది; సత్సంతానమును పొందడంచేత పితౄణము అనేవి తీరిపోతాయి. ఇట్లు తన 3 బాకీలు మీదివిధంగా తీర్చేసిన పురుషుడే, భౌతికబంధములనుండి విముక్తుడై పిమ్మట మోక్షప్రయత్నమునకు యోగ్యతకలవాడౌతాడు. ఇట్టి యోగ్యత ముఖ్యంగా "వివాహం" చేతనే పురుషునకు ప్రాప్తిస్తుందిగాన, సర్వవిధాలా, "వివాహం ధర్మప్రాధాన్యంకలది" అని సిద్ధాంతమయింది.

వివాహం-ఆధ్యాత్మికప్రయోజనాలు :—

ఇంతకుముందు చెప్పినట్లు ఋణవిముక్తి పొందిన విప్రుడే మోక్షప్రయత్నానికి పాత్రుడౌతాడనీ, అలా ఋణత్రయాన్ని తీర్చకుండా, మోక్షప్రాప్తికి ప్రయత్నించిన ద్విజుడు 'పతితుడు' ఔతాడనీ మనుస్మృతి ఇలా చాటిచెప్పింది.

"ఋణాని త్రీణ్యపాకృత్య, మనో మోక్షే నివేశయేత్ ।
అనపాకృత్య మోక్షం తు సేవమానః పత త్యధః ॥"

కనుక, హైందవవివాహసంస్కారంతో ద్విజుడు ధర్మార్థకామమోక్షరూప చతుర్విధపురుషార్థసేవనరూపంలో పూర్తిగా స్వధర్మాన్ని ఆచరించినవాడై క్రమంగా మోక్షప్రాప్తిరూపంలో ఆధ్యాత్మికప్రయోజనమునుకూడా అతడు పొందగలుగుచున్నాడు. ఇక సత్సంతానము పెరిగి పెద్దదైన పిమ్మట ఆసంతానమునకు తనఆస్తిని పంచిఇచ్చినపిమ్మటే



తండ్రి హైందవధర్మాన్ని అనుసరించి వానప్రస్థసన్యాసాశ్రమాలలో ప్రవేశించి క్రమంగా మోక్షాన్ని పొందవలసిఉంది. ఈహైందవసంప్రదాయప్రకారంగా చూసినా మన "వివాహము" మానవుల మోక్షప్రాప్తికికూడా పరంపరాసాధనమౌతూన్నవిషయం ఋజువయింది. ఇట్లే పరమాత్మను తెలుసుకొనుటకు వేదప్రవచనము, యజ్ఞాలు, దానము, నిష్కామమైన తపస్సు అనేవి మోక్షానికి సాధనాలుగా ఉపయోగిస్తాయని బృహదారణ్యకోపనిషత్సూక్తి ఇలా తెలుపుతూంది. A

ఈవేదాధ్యయనయజ్ఞాదులు మనఆత్మయందు క్రమంగా సంస్కారమును, చిత్తశుద్ధిని కలిగించి తద్వారా అవి ఆత్మజ్ఞానమును మనలో ఉదయింపజేయుటకు సమర్థాలై ఉన్నాయి. ఈవిధంగా ఆత్మజ్ఞానప్రదాలైన యజ్ఞదానాదుల నిర్వహణకు యోగ్యతను కలిగించే "వివాహం" క్రమపరిణతితో మానవులకు ఆధ్యాత్మికప్రయోజనములనుకూడా ప్రసాదింపగలిగి ఉన్నట్లు ప్రస్ఫుటమయింది.

ఇట్లే, గార్హస్థ్యధర్మాలలో ప్రాముఖ్యం వహించినది "యజ్ఞనిర్వహణం"కదా! దీనిద్వారా దేవతలు తృప్తిచెంది యాగకర్తలకు వారు సర్వవిధాభ్యుదయాలను సమకూరుస్తారు. ఇంకా ఈయజ్ఞనిర్వహణంవలన, సోమయాజి సోమిదమ్మదంప

---

A "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన"

తులలో దైవీగుణసంపద యేర్పడి దానిద్వారా వారికి క్రమంగా మోక్షం లభిస్తుందని-

"దైవీసంపద్విమోక్షాయ, నిబంధాయాసురీ మతా"

అనే గీతాసూక్తి చాటుతూంది. ఇట్లే దేవపూజ అతిథిపూజ, పంచమహాయజ్ఞనిర్వహణంవంటి ధర్మాలను యథోక్తంగా ఆచరించడంచేత అట్టిదంపతులమనస్సు పరిశుద్ధమై తన్ముఖమున, స్వార్థాహంకారకామక్రోధాదిదోషవర్జితమయి, సర్వభూతదయ 'సంతతదైవీభావన'వంటి ఉదారభావసంపదతో సమలంకృతమైన కారణంచేత 'వివాహము' అనేది మానవుల 'ఆధ్యాత్మికభావన'కుకూడా మూలమని ఋజువయింది.

వివాహంద్వారా సామాజిక దేశాభ్యుదయాలు :—

వివాహసంస్కారంద్వారా 'భార్యాభర్తృత్వ' మనే ధర్మాన్ని (డిగ్రీ) పొందినదంపతులకే ఉత్తమసంతానం కలుగుతుందనీ, అట్టి సంతానం బ్రహ్మవర్చస్సుకలిగి శిష్టజనులకు ప్రియమయిన దౌతుందనీ, ఇక సంస్కారంలేని స్త్రీపురుషుల సంతానం క్రూరబుద్ధితో అసత్యభాషణం, కూటసాక్ష్యం, అన్యాయార్జితంవంటి పాపపుపనులకు పాల్పడి వేదధర్మాలను, భూదేవతలను, దేవతలను, ధార్మికక్రియలను నిందిస్తూ భూభారంగాను, లోకకంటకంగాను బ్రతుకుతూంటుందనీ, కనుక మనసామాజికవ్యవస్థయొక్క భవ్యభావి అంతా శాస్త్రీయమైన మనవివాహవ్యవస్థమీదనే ఆధారపడిఉందనీ, కనుక, సంస్కారాలు చెడినచో మీద చూపిన విధంగా దౌర్జన్యదోషదూషితమైనదుష్టసంతానంప్రబలి, తద్ద్వారా మానవసమాజం,



తద్ద్వారా దేశం దెబ్బతింటాయని ఈస్మృతివాక్యం ఇలా సాక్ష్యమిస్తూంది.

"బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః ।
బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్టసమ్మతాః ॥
ఇతరేష్వేవ శిష్టేషు నృశంసాఽనృతవాదినః ।
జాయంతే దుర్వివాహేషు బ్రహ్మకర్మద్విష స్సుతాః ॥"

కనుక, మనపవిత్రసంస్కారాలు చెడినపుడే మన సమాజం, దేశం చెడి పతితమౌతాయనీ, ఈకారణంచేత మనసామాజిక దేశాభ్యుదయాలు మనపవిత్రసంస్కారాల నిర్వహణంమీదనే ఆధారపడి ఉన్నాయనీ అభివ్యక్తమయింది.

ఇక, ఆదర్శదంపతుల సత్సంతానమునుండి వచ్చిన జనులు త్యాగశీలంకలిగి సర్వవిధాలా సామాజికోన్నతికి, దేశాభ్యుదయానికి సహకరించే ఉత్తమపౌరులుగా తయారౌతారు. ఇట్టి ఉత్తమపౌరులలోంచి శ్రీరామునివంటి ధర్మమూర్తులు, ధర్మప్రభువులు, శివాజీవంటి వీరశిఖామణులు, రాధాకృష్ణపండితునివంటి తత్త్వవేత్తలు, గాంధీ, పటేల్, రాజేంద్రప్రసాద్‌వంటి నాయకోత్తములు, లాల్‌బహదూర్ శాస్త్రివంటి త్యాగమయఅమరజీవులు, రుద్రమదేవి, లక్ష్మిబాయివంటి వీరనారీమణులు, సీతాఽనసూయలవంటి పతివ్రతామతల్లులు మొదలైనవారు అట్టి ఆదర్శదంపతుల ఉత్తమసంతానంలోంచే తయారౌతారు. అట్టివారు తమతల్లి దేశమునకు ఎనలేని కీర్తిప్రతిష్ఠలు సంపాదించి దేశభావిని ఉన్నతశిఖరాలకు చేర్చగలిగిఉంటారు. అట్టి ఆదర్శపౌరులు ఆదర్శదంప

తులకే జనిస్తారు. ఆదర్శదాంపత్యానికి శాస్త్రీయవివాహ సంస్కార నిర్వహణమే మూలం. ఈవిధంగా "వివాహ సంస్కారం" సామాజికదేశీయాభ్యుదయాలసిద్ధికి మూలమై ఉన్నట్లు శాస్త్రీయనిదర్శనాలద్వారా ఋజువయింది.

సప్తపది :—

"వివాహసంస్కారం" అనే ముత్యాలహారంలో "సప్తపదీసంస్కారం" "నాయకమణి"వంటిది. ఈసంస్కారంలో వరుడు వధువుయొక్క చేయిపట్టుకొని అగ్నిసన్నిధిలో ఆరునొక్క అడుగులు నడిపిస్తాడు. ఏడవఅడుగు వేసినవెంటనే వధువు తనతండ్రిగోత్రాన్ని విడిచిపెట్టి భర్తగోత్రాన్ని స్వీకరిస్తుంది. A. "స్వగోత్రభ్రంశం, అన్యగోత్రస్వీకరణం" అనే అపూర్వమైన యీఅద్భుతపరిణామాన్ని వధువులో ప్రవేశపెట్టగలిగినది 'సప్తపది'లోని ఒక్క 'మంత్రసంస్కారం' మాత్రమే అని అందరు అంగీకరించక తప్పదు. ఈసత్యాన్ని ఋజువుపరచే నిదర్శనాలెన్నో ఈసంస్కారాలలో కనిపిస్తాయి. ఉదాహరణకు కొన్నినిదర్శనాలు చూపుతాను. వరుడు వధువులోగల 'అలక్ష్మి' అనే దోషాన్ని తొలగించడానికి గాను దర్భలతో ఆమె పాపిడిగుండా తుడుస్తూ చెప్పేమంత్రంలోని భావం ఇది.

"ఓకళ్యాణీ! నీభర్తకు హానికలిగించే 'అలక్ష్మి' అనే దోషాన్ని ఈదర్భలతో తుడిచి తొలగిస్తున్నాను" B ఇచ్చట

---

A "స్వగోత్రాద్భ్రశ్యతే నారీ వివాహాత్సప్తమే పదే" (స్మృతివచనం)

B "ఇద మహం యా త్వయి పతిఘ్నీ అలక్ష్మీ స్తాం నిర్దిశామి"



మొదట వధువులో ఒకవిధమైన దోషంఉంది. ఇచ్చట పఠించే మంత్రంయొక్క ప్రభావంచేత ఆదోషం మొదట తొలగింపబడి తద్వారా ఆమెమనస్సు నిర్మలంగా మలచబడుతూంది. దానితో నిర్మలమైన ఆమెమనస్సులో పవిత్రభావన యేర్పడి తద్వారా ఏకాగ్రత, పతిభక్తి వంటి శక్తులు క్రొత్తగా ఆమెమనస్సులో ఏర్పడుతున్నాయి. ఇట్లు మానవులలో ఉండే దోషాలను ముందు తొలగించి, అంతకు ముందులేని క్రొత్త శక్తులను వారిలో ప్రవేశపెట్టగల వైదికక్రియలే 'సంస్కారములు' అనిపించుకుంటాయి. A అని మనం ఈప్రకరణంమొదట తెలుసుకున్నాం.

ఈనిర్వచనప్రకారంగా ప్రస్తుతంలో ఇచ్చట, మంత్రోచ్చారణపూర్వకంగా దర్భలతో తుడిచెయ్యడం అనే వైదిక క్రియాచరణం లేక సంస్కారంద్వారా తనలోని దోషం పోయి 'మనోనైర్మల్యం' అనే విశేషం పుట్టింది. ఇట్టివన్నీ 'సంస్కారములు' అనే పదమునకు లక్ష్యాలుగా (నిదర్శనాలుగా) ఉంటాయని తేలింది. ఇట్లే బండికాడిరంధ్రంగుండా మంగళసూత్రంనుండి నీటిబిందువులు వధువుశిరస్సుమీద స్రవింపజేయుట అనే 'సంస్కారం' చేయడంచేత, వధువులో ఉండే కొన్నిరకాలరోగాలు పోయి తద్వారా ఆమెశరీరం సూర్యవర్చస్సుకలదిగా తయారౌతుంది.

ఈసంస్కారంయొక్క ప్రత్యేకతను తెలిపే, 'అపాల'

---

A "ఆత్మశరీరాంతరనిష్ఠః విహితక్రియాజన్యః అతిశయవిశేష స్సంస్కారః" (వీరమిత్రోదయం)

అనే ఆమెకు చెందిన ఒకగాథ ఇది- 'అపాల' అనేస్త్రీ తన శారీరకరోగాన్ని శాంతింపజేయుమని ఇంద్రుణ్ణి ప్రార్థిస్తుంది. అతడు తనరథచక్రంయొక్క ఆకులమధ్యరంధ్రంగుండా ఆమెశరీరంపై పడునట్లు మూడుసార్లు నీటిధార విడిచిపెట్టడం అనే సంస్కారం ద్వారా ఆమెను సూర్యవర్చస్సు కలదాన్నిగా మలుస్తాడు. A

ఈగాథను స్మరింపజేస్తూ ప్రస్తుతం వధువుశిరస్సుపై బండికాడి ఉంచి దానిరంధ్రంగుండా నీరు పోయడం అనే సంస్కారం చేయబడుతూంది. ఇట్టి ఈసంస్కారప్రభావంతో వధువుశరీరంకూడా అపాలశరీరంవలె మలచబడుతుంది. ఇట్లే సంస్కారాలు మానవులలో క్రొత్తశక్తులను ప్రవేశపెడతాయన్నమాట.

ప్రస్తుతవిషయమైన సప్తపదీసంస్కారం శాస్త్రోక్తంగా నిర్వహించడంచేత, అంతకుముందు వధువులో ఉన్న భిన్నభావన మొదలైన దోషాలు పోయి వానిస్థానే వరునిభావంతో కలిసిన ఐక్యభావన, పతిగోత్రంలో ప్రవేశం, పతిఆస్తులపై హక్కు, ఇంకా జన్మాంతరాలవరకూ సడలని- స్నేహరూప ప్రేమబంధం మొదలైన శక్తులు ఏర్పడతాయి. అప్పటి ఆ 'ప్రేమబంధం' 'ఎన్నెన్నోజన్మలబంధం'గా ఈసప్తపదిలోనే వధువులో ఏర్పడి అది వారిద్దరినీ ఏడడుగులకాలంలో ఏకం చేస్తుంది.

సఖ్యం సాప్తపదీనం :—

ప్రేమమయమైన అట్టి పవిత్రస్నేహం, ఉత్తమ

A "....అపాలా మింద్రః త్రిః పూత్వ్యకరత్ సూర్యవర్చసం"



భావాలుకల ఇద్దరువ్యక్తులమధ్య అపురూపంగా అల్పవ్యవధిలోనే, అనగా 7 మాటలు మాట్లాడుకొనేటంత అల్పవ్యవధిలోనే ఏర్పడుతుంది. అట్టి పవిత్రప్రవిమలస్నేహాన్ని "సఖ్యం సాప్తపదీనం" అనే సార్థకనామంతో మనవారు వ్యవహరించారు. ఈవైదికసంప్రదాయాన్ని కాళిదాసకవీంద్రుడు తన కుమారసంభవమహాకావ్యంలో ఇలా ప్రకాశింపజేశాడు.

"....యత స్సతాం సన్నతగాత్రిసంగతం,
మనీషిభి స్సాప్తపదీన ముచ్యతే ॥" (కు. సం.)

ఇక్కడ 'సతాం' అనే పదప్రయోగంద్వారా కాళిదాసకవి 'సప్తపది'లోని వైదికభావనను వ్యక్తంచేశాడు. ఎట్లనగా- 'సంస్కారాలు' అనేవి వ్యక్తులలోని దోషాలను తొలగించి వారి మనస్సులను వినిర్మలంగా చేయడంద్వారా అవి వారిని సత్పురుషులుగా తీర్చిదిద్దుతాయి. ప్రస్తుతం కాళిదాసకవియొక్క- 'సతాం' ప్రయోగంలో, ఇంతటి వైదికభావన భాసిస్తూందని నాభావం. ఇట్టి కమనీయగంభీరభావాలు నా- 'కాళిదాస-హృదయం'లో (66 సం॥లో) ప్రకాశితాలై ఉన్నాయి. ప్రస్తుతంలో వధూవరులభావాలు కొన్నిసంస్కారాలతో నిర్మలములైనపిమ్మటే అట్టిభావాలలో 'సాప్తపదీన'మైన సఖ్యం ఏర్పడి అది వధూవరులలో "భార్యాభర్తృత్వం" వంటి అపూర్వధర్మాలను నూత్నంగా ప్రవేశపెడుతుందని ఫలితాంశం.

భార్యాభర్తృత్వసిద్ధి :—

సప్తపదీసంస్కారం జరపడానికి ముందు వధూవరులలో 'స్త్రీపురుషులు' అనే ధర్మంమాత్రమే ఉంది. కాని ఈసంస్కారంలో వధువు వరునిసహాయంతో అగ్నిసన్నిధిలో ఏడవ అడుగు వేయగానే వధువునకు "భార్యాత్వము", వరునకు "పతిత్వము" అనే క్రొత్తధర్మాలు (యోగ్యతలు) అనగా శక్తులు ఏర్పడుతున్నాయి. ఈపరమార్థాన్ని తెలిపే స్మృతి ప్రమాణం ఇది.

"నోదకేన నవా వాచా కన్యాయాః పతి రుచ్యతే ।
పాణిగ్రహణసంస్కారా త్పతిత్వం సప్తమే పదే ॥"

అంటే- ఫలానావారికి కన్యక నిస్తానని తండ్రి మాట ఇవ్వడం మాత్రంచేతనే అతడు కన్యకకు 'పతి' కాజాలడు. ఇట్లే ఉదకధారాపూర్వకంగా చెప్పినాకూడా అతడు 'పతి' అనిపించుకోనడు. ఇక అగ్నిసన్నిధిలో మంత్రసంస్కారపూర్వకంగా వరుడు వధువుచేయిపట్టుకొని, అనగా 'పాణిగ్రహణసంస్కారం' చేసి అగ్నిసాక్షిగా వధువును ఆరున్నొక్క అడుగులు నడిపించిననాడే వరునిలో 'పతిత్వరూపధర్మం' యేర్పడుతుంది. ఈపతిపత్నిత్వధర్మమే వధూవరులకు 'భార్యాభర్తృత్వ'సిద్ధిని చేకూరుస్తుంది. ఈ 'పత్నిత్వ'సిద్ధివలన వధువునకు భర్తఆస్తులను చెరిసమానంగా అనుభవించేహక్కు భార్యకు ఏర్పడుట అనేది ఈ "సప్తపది"లోనే జరుగుతుంది. ఈవైదికసత్యాన్ని ఒక లౌకిక నిదర్శనంద్వారా ఋజువు చేస్తాను.



ఇప్పటికి సుమారుగా పాతికేళ్ళక్రితంనాటిమాట. పెళ్ళిలోనే కాపురంచెడి కోర్టుకెక్కిన స్త్రీని అప్పటి 'న్యాయాధికారి' 'నీపెళ్ళి సప్తపదీసంస్కారం' వరకు జరిగిందా? లేదా? అని అడిగి, ఆసంస్కారం జరిగినపక్షంలోనే అట్టిస్త్రీకి 'భర్తఆస్తిపై హక్కు ఏర్పడింది' అని తీర్పు ఇస్తూండేవాడని అభిజ్ఞులు చెప్పగా విన్నాను. ఈలౌకికనిదర్శనానికి మూలమైన మరో శాస్త్రనిదర్శనం చూపుతాను.

"యజ్ఞంతో సంబంధం ఉన్నప్పుడే పతిశబ్దం 'పత్ని' శబ్దంగా మారుతుం" దని వ్యాకరణసూత్రం తెలిపినట్లు తెలుసుకొన్నాంకదా! సప్తపదీసంస్కారం చేయడంచేతనే వధువునకు 'పత్ని' అనేపేరు 7వ అడుగు వేసినపిమ్మటే యేర్పడుతుందని "...పతిత్వం సప్తమే పదే" అనే శాస్త్రవచనం తెలిపింది.

ఇక "....సప్తసప్తభ్యో హోత్రాభ్యో విష్ణు స్త్వాఽన్వేతు" అనే సప్తపదిలోని మంత్రంయొక్క భావం ఇది.

"ఈయేడవఅడుగు (కర్త) ఓకళ్యాణీ! 'సప్తహోత్రలు' అనేవారు ముఖ్యులుగా కల యజ్ఞమును నిర్వహించే యోగ్యతను, తద్ద్వారా 'పత్నిత్వ' యోగ్యతను (ఈయేడవఅడుగు) నీకు కలిగించుగాక! దీనితో యజ్ఞసంబంధం పత్నిత్వాన్ని కల్పించింది. ఇదే! యజ్ఞసంబంధం ఉన్నప్పుడు పతిశబ్దం పత్నిగా మారడం అంటేను.

ఈవిధంగా వివాహానికి పరమప్రయోజనమైన భార్యా

భర్తృత్వసిద్ధి, ధర్మపత్నీత్వసిద్ధి అనేవి ఈ "సప్తపది"లోనే సంప్రాప్తాలౌతున్నాయి.

ఇట్లే 'సప్తపదీ' సంస్కారంచేతనే వధూవరులకు 'పతి పత్నీత్వసిద్ధి కలగడంచేతను, "వివాహం" అనే పదానికి 'పాణి గ్రహణం' అనే పదం పర్యాయపదంగా ప్రసిద్ధమై ఉండడం చేతను, ఈ'సప్తపదీసంస్కారం' పూర్తిఅయింది- అంటే వివాహం పూర్తిఅయినట్లే అనే భావన యేర్పడింది. ఇక-

"పాణిగ్రహణా త్సహత్వం కర్మసు, తథా పుణ్యఫలేషు చ ॥"

అనే స్మృతివచనమును అనుసరించి 'పాణిగ్రహణము' అనేది భర్త చేసే యజ్ఞాదిధర్మకార్యాలలో భర్తతో సమానంగా పాల్గొనే యోగ్యతను స్త్రీకి కలిగిస్తూ ఇంకా 'సహధర్మచారిణి' అనే డిగ్రీనికూడా ఆమెకు సంక్రమింపజేస్తుంది. దీనితో ఆమెకు యజ్ఞాదిధర్మకార్యాచరణమువలన పుట్టేపుణ్య ఫలాన్నికూడా భర్తతో అనుభవించే 'అర్హత' అబ్బుతుంది. ఈసందర్భంలో 'సప్తపది'లోని మంత్రభాగంయొక్క వాక్యములు కొన్ని తెలిపే అర్థాన్ని ఇక్కడ తెలుపుతాను. ఇవి వరుడనే మాటలు.

"...ఓకళ్యాణీ! ఈసంస్కారంవలన మన ఉభయులకూ గొప్పఆస్తిగా సంక్రమించిన ఈపవిత్రస్నేహంనుండి మన మెప్పుడూ విడిపోకూడదు. ఏపనిచేయడానికైనా సరే మన మిద్దరం సమంగా సంకల్పించాలి. మనచిత్తాలను చిగురింపజేసే ప్రత్యేకప్రేమభావంతో మనమనస్సులను ఏకంచేసి మన ఆస్తులను (ధనమును), యౌవనానందమును సమానంగా



అనుభవించాలి. మనశరీరములకు సంబంధించిన బాహ్యేంద్రియక్రియలతో మనమనస్సులను ఏకంచేయడంద్వారా అన్ని విషయాలలోకూడా మనమిద్దరం 'ఒకటి' కావాలి... నేను (వరుడు) మనస్సువంటివాడను; నీవు (వధువు) వాక్యంవంటి దానవు. అంటే, మానవులమనస్సులో పుట్టిన సంకల్పాన్ని వారివాక్యం ఆసంకల్పాన్ని పూర్తిగా అనుసరిస్తూ ఉన్నదున్నట్లుగా పైకి తెలుపుతుంది. ఇదేవిధంగా నీవు పూర్తిగా నా భావాలతో ఏకీభవించి ప్రవర్తించాలి..."

ఈనిదర్శనాలన్నీ ఇద్దరికీ అన్నిటిలోను 'సమానమైన హక్కు'ను తెలుపుతాయి.

ఈవిధంగా 'సప్తపదీసంస్కారం' నూతనవధూవరులను భార్యాభర్తలుగాను, అన్నింటిలో సమానంగా హక్కు కలవారినిగాను ఏకంచేసి ఆసంస్కారం జన్మాంతరాలలో కూడా వారిద్దరిని కలుపుతూంటుంది. A.

ఇట్లు మనపవిత్రసంస్కారాలకు మానవులదైనందిన జీవితాలపై ఇంతటి ప్రత్యేకప్రభావం ఉంది అని (ఇంతవరకూ చెప్పిన శాస్త్రనిదర్శనాలతో) ప్రతిఒక్కభారతీయుడూ గమనించిననాడే మనదేశంయొక్క పూర్వపుఔన్నత్యాన్ని తిరిగి మనం తిలకించగల్గుతాం.

## వైదికసంస్కృతిలో స్త్రీయొక్క స్థానం.

నూతనవధువుయొక్క "పాణిగ్రహణం" చేసే సందర్భంలో వరుడు పఠించేమంత్రంలోని భావం ఇలా ఉంది.

---

A "పూర్వజన్మని యా నారీ, పూర్వజన్మని యద్ధనం ।
పూర్వజన్మని యా విద్యా, అగ్రే ధావతి ధావతి ॥"

"ఓకళ్యాణీ! ఉత్తమమైన సంతానప్రాప్తికోసమే నీ హస్తమును నేను గ్రహించుచున్నాను. భగుడు, అర్యముడు, సవిత మున్నగుదేవతలు నిన్ను నాకు అనుగ్రహించారు. ఎందుకు అనుగ్రహించారంటే- ముఖ్యంగా గృహస్థాశ్రమ ధర్మాలను సక్రమంగా నీతోకూడి ఆచరించడంకోసమే." ఈభావం కల మంత్రం ఇది.

"గృభ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం.... భగో అర్యమా
సవితా పురంధి ర్మహ్యం త్వా అదుః గార్హపత్యాయ దేవాః ॥"
(పాణిగ్రహణసంస్కారంలోని మంత్రభాగం)

ఈమంత్రంలోని 'సుప్రజాస్త్వాయ' అనే పదానికి దేవపితృకర్మలు ఆచరించడానికి అర్హతగల సంతానం అని అర్థం. శాస్త్రీయమైన వివాహసంస్కారంతో సంస్కరింపబడిన దంపతులకే ఇట్టి ఉత్తమసంతానం కలుగుతుంది. ఇట్టి సంస్కారంలేని దంపతులకు దుష్టభావదూషితమైన దుర్మార్గులు పుడతారని యాజ్ఞవల్క్యస్మృతివాక్యాలు చాటుతున్నాయి. A

ఇట్టి దుష్టసంతానం ప్రబలిననాడు ఇట్టివారితో కూడిన సమాజం, దేశంకూడా చెడి దెబ్బతింటాయి.

దీనినిబట్టి తేలిన సారాంశం :— హిందూవివాహసంస్కారపూర్వకంగా పతిపత్నీత్వయోగ్యత నందిన దంపతులకుమాత్రమే 'ఉత్తమసంతానప్రాప్తి' 'గృహస్థాశ్రమధర్మ నిర్వహణలాభం' అనే రెండు మహితప్రయోజనాలు సిద్ధిం

A "....ఇతరేష్వేవ శిష్టేషు నృశంసానృతవాదినః ।
జాయంతే దుర్వివాహేషు బ్రహ్మకర్మద్విష స్సుతాః॥" (యాజ్ఞ. స్మృతి)



చాయి. ఈరెండూ భావిలో పరుని మోక్షప్రాప్తికి ముఖ్య సాధనా లౌతాయి. ఈపాణిగ్రహణమంత్రంలోని పరమార్థం ఈమనుస్మృతివాక్యాలలో ఇలా ప్రకాశితమయింది.

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతి రుత్తమా ।
దారాఽధీన స్తథా స్వర్గః పితౄణా మాత్మన శ్చ హ ॥
ప్రజనార్థం మహాభాగా పూజాఽర్హా గృహదీప్తయః ।
స్త్రియ శ్శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన ॥"

అనగా "ఉత్తమసంతానం, అగ్నిహోత్రం పతిసేవ, కామవాంఛాతృప్తి, తనకూ, తనపితృదేవతలకూ స్వర్గప్రాప్తి అనే ఇవన్నీ భార్యఅధీనములో ఉన్నాయి. అంటే ఈమహాప్రయోజనాలన్నీ భర్తకు భార్యవలననే సిద్ధింపవలసి ఉన్నాయి.

ఇట్లు సత్సంతానాదులద్వారా పతికి మహోపకారం చేస్తూన్న మహిళామణుల్లులు పతిగృహాలకు రత్నదీపాలవంటివారు. 'ఇంటికి దీపం ఇల్లాలు' కదా. కనుక స్త్రీలకు శ్రీలకు (మహాలక్ష్ములకు) భేదంలేదు. కనుకనే మహాలక్ష్ములవలె వారును పూజార్హాలు."

ఇట్టిస్త్రీలు ఆదరగౌరవాలతో సంతోషితస్వాంతలయి ఏగృహంలో పూజింపబడతారో ఆగృహంలో దేవతలు సంతోషిస్తూ ఉంటారనీ, ఏగృహంలో స్త్రీలు పూజింపబడరో అట్టి గృహంలోనివారు చేసిన పుణ్యకార్యాలు నిష్ఫలము లౌతాయనీ ఒకసూక్తి ఇలా స్పష్టంచేస్తూంది.

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః ।
యత్ర నార్య స్త్వపూజ్యంతే సర్వా స్తత్రాఫలాః క్రియాః ॥"

ఇట్లు హైందవసంస్కృతికి శిరోభూషణమైన, హైందవ ధర్మక్రియాచరణమునకు మూలమైన, హైందవజాతికీర్తిప్రతిష్ఠలకు ఆధారమైన (వివాహసంస్కారసంస్కృతిలైన) మహిళామతల్లులకు వివాహమంత్రాలు ప్రసాదించిన ప్రత్యేక స్థానాన్ని ఇక ఇట చూపుతాను. తనపత్నిని తనగృహానికి తీసుకొనివెడుతూన్నప్పుడు పతి పఠించే మంత్రంలోని భావ మిది. ఇవి పతియొక్క మాటలు-

"నాగృహస్థజీవితానికి ప్రకాశప్రతిష్ఠలను కలిగించే ఓ కళ్యాణీ! ఇటుపైని సర్వవిషయాలలో ప్రత్యేకబాధ్యతలను వహించిన నీవు అన్నిపనులలో నాకు చక్కనిసలహా లిస్తూ నాకు శిరోభూషణంగా- చక్రవర్తినిగా ప్రవర్తించాలి. ఇట్లే అత్తమామలు, ఆడపడుచులు, మరదులు, బావగార్లు, తోడికోడళ్ళు వగైరా నాకుటుంబసభ్యులందరి క్షేమాలను కోరి, వారికి సర్వవిధశ్రేయస్సులు సంపాదించుటలో నీవు ఆధిపత్యం వహించి, మాకందరికి చక్రవర్తినిగా (సమ్రాజ్ఞివిగా) ఉండుము. మొత్తంమీద నాకుటుంబముయొక్క కీర్తిప్రతిష్ఠా శ్రేయస్సులు నీచేతిలోనే ఉన్నాయి. కనుక ఇటుపైనుంచి నీవు నానీడవలె సర్వకాలసర్వావస్థలలో నన్ను అనుసరించవలసిఉంది. కనుక ఉత్తమసంతానం కని నీవు నాకు 'నెత్తిమీద దేవతవు' కావలెను" A.

A "....సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్రువాం భవ । ననాందరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధిదేవృషు । స్నుషాణాం శ్వశురాణాం ప్రజాయాశ్చ ధనస్య చ । ....సజాతానాం విరా డ్భవ "
(వివాహమంత్రం)



ఇట్లు మనసమాజశ్రేయస్సు అంతా ఉత్తమగృహిణిపై ఆధారపడిఉన్నసంగతి ఈ చెప్పిన నిదర్శనాలతో ఋజువుచేయబడింది. కనుక పురుషుని గృహస్థాశ్రమజీవితానికి చెందిన అన్నివిషయాలలో 'గృహిణి' ముందు, తరువాత 'గృహస్థుడు' అని చెప్పవలసిఉంది. ఈసత్యాన్ని ఈక్రింది మనుస్మృతివచనం ఇలా ధృవపరుస్తూంది.

"....అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్"

"పురుషుడు, తాను సంపాదించి తీసికొనివచ్చిన సొమ్మును భద్రపరచడంవిషయంలోను, దానిని అవసరంవెంబడిని ఖర్చుపెట్టడంవిషయంలోను కూడా భర్త తనగృహలక్ష్మినే నియోగించవలెను."

ఇట్లు మనసంస్కృతి స్త్రీకి ఇంతటి మహోన్నతస్థానం ఇచ్చినసంగతి తెలియనివారు "మనవాళ్ళు స్త్రీకి స్వాతంత్ర్యం ఇవ్వలేదు" అంటారుకదా! వారిమాటలో 'సత్యం' ఎంతో మీదిస్మృతివచనాలు తెలుపగలవు. ఇట్లు మనఆర్యమహర్షులు సమాజశ్రేయస్సంపాదనమును పరమధ్యేయంగా దృష్టిలో పెట్టుకొని చెప్పినధర్మాలు, చేసిన నిబంధనలు సర్వవిధసమాజశ్రేయస్సంపాదనమునకే అంకితమై ఉన్నాయి. కనుక అధర్మాలన్నీ యుగయుగాలవరకూకూడా మానవసమాజానికి "శ్రీరామరక్ష"గా సహకరిస్తూనే ఉంటాయని చెప్పవలసిఉంది.

ఇన్నివిధాలుగా సమాజకళ్యాణానికి సహకరిస్తూన్న స్త్రీరత్నాన్ని పతి ఎంతగా కాపాడవలెనో, ఎంతటి ఆదరగౌర

హాలతో, ఎంతటి పవిత్రప్రేమభావనతో ఉపయోగించుకొనవలెనో, ఎంతటి పూజ్యభావన చూపవలెనో తప్పక గమనించవలసిఉంది.

ప్రస్తుతవిషమసమస్య-పరిష్కారమార్గం :—

పరమార్థపరిస్థితి ఇట్లుండగా, ఆర్థికసంబంధమైన ఆశాపాశాలలో చిక్కుకొన్న కొందరు నేడు, తమగృహాలక్ష్ములను "పుట్టినింటికి వెళ్ళి సొమ్ము తీసికొనిరమ్మ"ని వేధించి పీడించి బాధించడమనేది, ఆస్త్రీలవిషయంలో పురుషుడు చేస్తున్న-ప్రాయశ్చిత్తంలేని- 'మహాఽపరాధం' అనక తప్పదు. ఈ 'అధికవరకట్నపిశాచి', పవిత్రసంస్కారప్రభావాన్ని కాలదన్ని, ప్రస్తుతసమాజానికి విషమకరవిపత్కరవిషతుల్య సమస్యగా పరిణమించి, సమాజాన్ని పీల్చి పిప్పిచేస్తూ కొన్ని కుటుంబాలనే బలిగొంటూంది. అసలు ఇట్టిసమస్యలు సమాజంలో వ్యాపించడానికి బలమైన కారణాలు ఉండనే ఉంటాయి. వానిలో ముఖ్యంగా ముందుగా కనిపించేది, ఎక్కువసంఖ్యలో మానవుల "నైతికజీవితపతనం" అనేది.

స్త్రీవిత్త మధమాఽధమం :—

లోకంలో 'పురుషకారం' కలవాడే 'పురుషుడు' అనిపించుకొంటాడు. 'పురుషకారం' అనగా ఏవిధంగానూ తను ఇతరులమీద ఆధారపడక, తనసుఖమయజీవితనిర్వహణకు అవసరమయిన ఆర్థికపుష్టిని స్వశక్తితో న్యాయంగా సంపాదించి, తనతోబాటు తనపరివారాన్నికూడా పోషించగల



పురుషుని సామర్థ్యవిశేషాన్ని 'పురుషకారం' అంటారు. ఈవిధంగా తనసొంతశక్తితో, న్యాయమార్గాన్ని విడనకుండా సంపాదించినధనమునే 'ఉత్తమధనం' అని అంటారు. ఈసందర్భంలో ఒకసూక్తి మన కిలా మహితప్రబోధాన్ని ప్రసాదిస్తూంది.

"ఉత్తమం స్వార్జితం విత్తం, మధ్యమం పితురార్జితం ।
అధమం భ్రాతృవిత్తం చ, స్త్రీవిత్త మధమాధమమ్ ॥"

"పురుషుడు స్వశక్తిసామర్థ్యాలతో న్యాయంగా సంపాదించిన ధనంతో జీవించడం ఉత్తమమైనది. తండ్రి సంపాదించినధనంతో జీవించడం మధ్యమతరగతికి చెందినది. సోదరుల ధనం అధమం. స్త్రీసంపాదించిన ధనంతో పురుషుడు జీవించడమనేది అధమాధమమైనది."

ఉదారోత్తమభావాలు కలవాడు ఉత్తమపద్ధతిలో జీవించదలచినప్పుడు, నీచభావాలు కలవాడు నీచంగానే జీవించడానికి ప్రయత్నిస్తూంటాడు. ఇది లోకసహజం. కాని సమాజదృష్ట్యా చూచినపుడు, ఆసమాజంలో ఉన్న స్త్రీపురుషుల ఉత్తమాధమలక్ష్యాలమీదనే సమాజంయొక్క కీర్తిప్రతిష్ఠలుకాని, అపకీర్తులుకాని ఆధారపడి ఉంటాయి.

నేటిమానవసమాజంలో యెక్కువమంది అధికవరకట్నదాహానికి వశులై ఉన్న పరిస్థితిలో సామాజికజీవితం కూడా అనర్థపరంపరలో చిక్కుకొనక తప్పదు. కనుక సమాజం శాంతికీర్తిప్రతిష్ఠలతో మనగలగాలంటే సమా

జములోగల యెక్కువమంది నైతికసూత్రాలను పాటిస్తూ ఉత్తమభావాలతో, ఉత్తమాదర్శాలతో జీవించడమనేది ఎంతో అవసరమై ఉంది. ఇట్టి పరిస్థితిలో, నాగరికత అనే పేరుతో నేడు చాలమంది 'అధికవరకట్న' మనే సాంఘిక దురాచారానికి దాసులై ఉండటంచేత, ఆదురాచార ఫలితంగా దాపరించిన ఆపదలకు వేలాదికుటుంబాలు గురికాక తప్పడంలేదు. నేటిపత్రికలు తెరవగానే వరకట్నమూలకాలైన స్త్రీలచావువార్తలు పఠితలహృదయాలను ఉవ్వెత్తుగా కలిచేస్తున్నాయి. హానికరమైన ఇట్టి ఆపదలలోంచి సమాజం బైటపడాలంటే ఒకటేమార్గం శరణ్యంగా ఉంది.

"మనవివాహధర్మాలను అమలులో పెట్టడ" మనేదే ఆమార్గం. ఆమార్గాన్ని అనుసరించిననాడు, 'వరకట్నాలు' అడగడానికే అవకాశం ఉండదు. ఎలాగంటే వరుడు కన్యాదాతవద్దకు తనముఖ్యస్నేహితులను కన్యావరణకై పంపుతూ వారిముఖతః తనవివాహలక్ష్యాన్ని-

"ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే"

"గృహస్థాశ్రమధర్మాలను సక్రమంగా నిర్వహించడం ద్వారా సత్సంతానమును పొందడంకోసమే- ఈపవిత్రధ్యేయ సిద్ధికోసమే ప్రస్తుతం నేను (వరుడు) ఈస్త్రీని సంస్కారపూర్వకంగా స్వీకరింపదలచినాను" అని శపథంచేస్తాడు. ఈవివాహధర్మాన్ని పూర్తిగా అనుసరించి ఆచరించిననాడు వరుడు ధర్మాచరణానికి మూలాధారమైన కన్యకనుమాత్రమే



కోరినాడుకాని 'వరకట్న' విషయాన్ని అసలు ఎత్తనైనాలేదు. అప్పటివరునిదృష్టి 'ధర్మాచరణమే' జీవితలక్ష్యంగా కలది. కనుక అప్పటివరునికి ధర్మాచరణకు మూలమైన 'కన్యక'యే పదిలక్షలవిలువ కలదికాని డబ్బుమాత్రం కాదు. కనుక వరుడుకాని, వరవర్గంవారుకాని ఆకాలంలో వరకట్నప్రస్తావనచేసే అవకాశమే లేదు. అసలు ఆప్రస్తావనచేయడం అప్పటివారికి 'తప్పు'గా ఉండేదికూడాను. ఈవిధంగా అప్పుడు 'అధికవరకట్ననిర్ణయం' అనే విషసంబంధంలేనికారణంచేత ధర్మప్రధానమయిన ఆనాటివధూవరుల వైవాహికజీవితం 'నిత్యానంద నిలయం'గాను, శాంతిసౌఖ్యాలకు పుట్టినిల్లుగాను ఉండి, వారి దైనందినజీవితం మూడుపువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధి చెందుతూ, దేవపితౄఋణాలను తీర్చడంద్వారా మోక్షప్రాప్తికి పాత్రంగా ఉండేది.

ఇక నేటివివాహం, విషమకరసమస్యలకు నిలయంగా తయారయింది. ఈతేడాకు ముఖ్యకారణం, నాటి కన్యావరణలో వరకట్నప్రస్తావనే లేకుండడం, నేటి వివాహప్రస్తావం అధికవరకట్నప్రస్తావంతోనే ప్రారంభంకావడం అనేదే ఆ తేడాకు మూలకారణ మనక తప్పదు.

కన్యాదాత, కన్యాదానంవలన కలిగే ఫలితాన్ని గూర్చి "ఓకన్యామణీ! ఈకన్యాదానంవలన, నావంశంలోని పదితరాల ముందువెనుకలపితృదేవతలు నరకంలేనివారై శాశ్వతంగా బ్రహ్మలోకంలో ఉండడంకోసమనీ, నాకు మోక్షప్రాప్తి

కోసమనీ ఈకన్యాదానమనే పవిత్రక్రియను చేస్తున్నాను.” అనే దివ్యసంకల్పంతో ఉండేవాడు. A

ఇట్టి కన్యాదానంవలన నాడు కన్యాదాతకు కలిగే మహితప్రయోజనాలు అనగా అతడి ‘పితరులకు బ్రహ్మలోక ప్రాప్తి, కన్యాదాతకు చతుర్విధపురుషార్థసిద్ధి’ అనేవి రెండూ, నేటి వరకట్నాల దురాచారంవలన దూషితాలయి అంతరించాయి.

ఎట్లనగా, కన్యాదాత నూతనవరుణ్ణి “శ్రీలక్ష్మీనారాయణునిగా భావించి పూజించి అతడికి కన్యాదానం చేసిన పక్షంలోనే మీది రెండు ప్రయోజనాలు కన్యాదాతకు ప్రాప్తిస్తాయి. నేటివిపరీతవరకట్నాలతో కన్యాదాతకు తలతిరిగి ఆపరమేశ్వరభావన లుప్తమై కన్యాదానమూలకమైన అప్పులు గృహభూముల అమ్మకాలవంటి అనర్థపరంపరే మిగులుతూంది. ఇట్టి దుర్భరపరిస్థితిలో, కన్యాదానంవలన ఆదాతకు కలుగవలసిన ఆమహాప్రయోజనాలు నేడు ఎలా ప్రాప్తిస్తాయి? ఇంకా ఈదురాచారంవలన, ఉత్తమవరునికి ముఖ్యలక్షణమయిన ‘ఉత్తమశీలత్వం’పూర్తిగా అంతరించింది. నేడు ఎక్కువమందిలో కలిగిన ఈ ‘శీలపతనం’తో బాటు సమాజానికికూడా పతనం ప్రారంభమయింది. సమాజపతనమంటే దేశపతనమనే అర్థంకదా!

A “... దశ పూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం సర్వేషాం పితౄణాం నరకా దుత్తీర్య శాశ్వతబ్రహ్మలోకే నివాససిద్ధ్యర్థం.... ‘కన్యే మే సర్వతో భూయా స్త్వద్దానా న్మోక్ష మాప్నుయాం ....’ కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే। ప్రయతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థసిద్ధయే....”



దీనిని “దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుజులోయ్” అనే గురజాడవారి గుప్తసూక్తి సుస్పష్టం చేస్తూంది- ఇంతటి అనర్థపరంపరకు ఆదికారణమైన ‘అధికవరకట్నం’ అనే సాంఘికదురాచారాన్ని రూపుమాపి భారతదేశీయ పూర్వప్రతిష్ఠను పునః ప్రతిష్ఠచేయడం అనే మహాకార్యసాధన నేటిభారతీయయువకులకు ముఖ్యకర్తవ్యమై అది వారిమీద ఆధారపడిఉంది.

## భారతదేశీయ పూర్వప్రతిష్ఠ.

భారతదేశంలోకూడా, ‘ఆర్యావర్త’ దేశమనీ, ‘బ్రహ్మర్షిదేశ’మనీ రెండుముఖ్యప్రదేశా లున్నాయి. కురుక్షేత్రం, మత్స్యనదేశం, పాంచాలము, శూరసేనకం అనే దేశాలు కలిసి దేశానికి ‘బ్రహ్మర్షిదేశం’ అని పేరు.

“కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పాంచాలా శ్శూరసేనకాః।
ఏష బ్రహ్మర్షిదేశో వై బ్రహ్మావర్తా దనంతరః॥”

(మను- 2 అధ్యా- 19 శ్లో)

“ఈబ్రహ్మర్షిదేశంలో పుట్టి పెరిగిన అగ్రజాతివారి వలన భూమండలంమొత్తంలోగల మానవులందరు తమతమ ఆచారాలను, ధర్మాలను తెలుసుకొనవలెను” అని ఈక్రింది మనుస్మృతిసూక్తి ఇలా నొక్కివక్కాణిస్తూంది-

“ఏతద్దేశప్రసూతస్య సకాశా దగ్రజన్మనః।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః॥”

(2-20)

ఈసూత్రాన్నిబట్టి- "భారతదేశం ఇతరదేశములవారందరికీ ఆచార్యపీఠంగా ఉండేది." అనే విశిష్టవిషయం విశదమౌతుంది.

దీనినిబట్టి మనమహితపవిత్రసంస్కృతి జగన్మాంగళ్యసంపాదనమునకు మంగళతోరణంగా ప్రకాశిస్తూ, అన్నిమతాలవారికీ అఖిలాభ్యుదయములను అన్నికాలాలలో అమరజేస్తూన్న సంగతి స్పష్టమయింది.

ఇట్టి పవిత్రభారతదేశంలో పుట్టి పెరిగిన మానవుల ప్రవర్తనలలో అన్నివిధాలా అన్నివిషయాల్లో 'భారతీయత' ప్రత్యేకశిరోభూషణంగా భాసించిననాడే అట్టివారే నిజమైన 'భారతీయులు' అనిపించుకొంటారు. కనుక భారతీయులకు 'భారతీయత' 'ప్రాణం'వంటి దని ప్రకటితమౌతూంది. ఇట్టి సన్నివేశంలో భారతదేశంలో పుట్టి పెరిగినవారికి 'భారతీయత' లేదంటే ఏమనాలి? కనుక, ప్రియభారతసోదరసోదరీమణులారా! మీమీధర్మాలను ప్రాణప్రియంగా కాపాడుకొంటూ, మీమీకర్తవ్యాలను సకాలంలో నెరవేర్చుకుంటూ ఆవిధంగా మీమీజన్మలను సార్థకం చేసుకొందురుగాక!

"ధర్మస్య జయోఽస్తు, అధర్మస్య నాశోఽస్తు,
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"
శ్రీనివాసాయ మంగళమ్.

సంపూర్ణం.

—o—

అనుబంధము.

## కృతికర్తయొక్క యితరగ్రంథాలు :

(తియ్యని తెనుగుభాషలో)

1. కాళిదాసహృదయము :-

1966లో రచితమైన యీతొలికృతి ప్రస్తుతం ఔటాఫ్ ప్రింట్. ఈకృతికిచెందిన ఒకపండితాభిప్రాయం ప్రస్తుతగ్రంథంలో 132 పేజీలో చూడనగును.

2. భక్తపోతన - మహాభాగవతరచన :- (ద్వితీయముద్రణ)

తొలికృతివలెనే ఈ కృతికూడ ఆంధ్రవచనవిమర్శగ్రంథము. ఈకృతియు ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీలలో ఓరియంటల్ ఉన్నతపరీక్షలకు పాఠ్యం. ఇందలి పండితాభిప్రాయం ఒకటి ప్రస్తుత గ్రంథం 79 పేజీలో చూడవచ్చును. దీనిపై సుప్రసిద్ధపండితాభిప్రాయాలలో కొన్ని వాక్యా లివి :-

"....నిశిత మగు మీవిమర్శనపటిమకు ఈగ్రంథము మచ్చుతునక నిదర్శనము. పోతనకవితాశిల్పమును ఇంత చక్కగా నిరూపించినగ్రంథమింకొకటి లేదనుట అతిశయోక్తి కాదు."

తెనుగు ప్రొఫెసర్:
కె. వి. ఆర్. నరసింహం M. A. Ph. D.,
ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరు.
20-9-71

"..... ఆంధ్రభాష కలంకారముగానున్న ఒక్కొక్క గ్రంథముపై యీవిధమైన విమర్శవాఙ్మయము బయలుదేరినచో, మనసారస్వత మెంతశోభాయమాన మగునో యని, యీభాగవతవిమర్శను చదివినవారికెల్లరకు ననిపించును."

"ఆర్షవిద్యాభూషణ"
జటావల్లభుల పురుషోత్తం, M. A.,
ప్రిన్సిపాల్, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠం, కొవ్వూర్.
9-9-'71.

"....సరససరళవచనరచనతో మనకు తరణోపాయముగాకూడ నిట్టి గ్రంథము నందించిన శ్రీసూర్యనారాయణశాస్త్రిగారికి ఆంధ్రలోక మెంతయు ఋణపడియున్న దనుట సాహసము కానేరదు."

—'విద్వత్కవిశేఖర' శ్రీపెంపరాలవారు. ఈగ్రంథము వెల : 6-75

ఇది పబ్లిక్‌లైబ్రరీల డైరెక్టర్‌వారిచే అప్రూవ్ చేయబడినది.

దీని పై ఉేషన్‌నెం. 1464/CT IVB/87-R. C. No. IZ-E,72/ Dt. 7-11-72.

టైటిల్- "భక్తపోతన-మహాభాగవతరచన" D. P. L. Govt. of A. P.

ఇంకను ఈగ్రంథముపై- డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ A. P. Pros. L. Dis. No. 5459/CA-Z/71-18-8-72- సీరియల్ నెం. 38, "భక్తపోతన-మహాభాగవతరచన" ఫర్ హైస్కూల్సు.

ఇంకను ఈగ్రంథముపై శ్రీ డిప్యూటీకమీషనర్, ఎండోమెంట్సు- విజయవాడ, హైదరాబాదు, మరియు కర్నూలువారి ఆర్డర్సు కలవు. ఎండోమెంట్సుకమీషనర్, Hyd. L. Dis. No. 57138 / 72-JB/ Dt. 27-11-72 పాఠకులు గమనించగలరు.

3. "కాళిదాసకావ్యసౌరభమ్ :- (సరళ సంస్కృతభాషలో)

ఇది సరళసంస్కృతవచనవిమర్శగ్రంథము. పండితప్రకాండుల అభిప్రాయాలలోని కొన్నివాక్యాలు :-

"వేదభాష్యాలంకార, ఆమ్నాయసరస్వతి" బ్ర. శ్రీ. ఉ. గణపతి శాస్త్రిగారు- ".... పాలకడలిని మందరం మథించినట్లు కాళిదాసకావ్యచయ మనే పాలసముద్రమును శ్రీశాస్త్రి మథించి అందుండి అపూర్వనూతన విషయజాత మనే అమృతమును ఉద్ధరించి సహృదయలోకమునకు సమ ర్పించిన ఈపండితుని పాండిత్యచాతుర్యం అసాధారణమైనది..,..."

(జనవరి - 73)

P. N. పట్టాభిరామశాస్త్రి- "విద్యావాచస్పతి" "శాస్త్రరత్నాకర" మీమాంసాప్రొఫెసర్, సంస్కృతయూనివర్సిటీ, వారణాసి 2. (U. P.)



".......శ్రీశాస్త్రివరేణ్యులచే ఈగ్రంథంలో వివేచనచేయబడిన విశిష్టవిషయాలు, చాలాసార్లు ఈగ్రంథమును పఠించుటకు నన్ను ప్రోత్స హించినవి. .... .... వ్యంజనాకళచేత కవీంద్రుని హృదయకమలమును సముద్ఘాటనచేసి కవిసమ్మతవిషయములను యథాతథంగా శాస్త్రివర్యులు ప్రతిపాదించినందులకు మిక్కిలి ప్రసన్నుడనైతిని. ...కనుక, విద్యాలయ, మహావిద్యాలయ, విశ్వవిద్యాలయములలో పాఠ్యగ్రంథనిర్ణాయకులైన అధి కారులు ఈగ్రంథరత్నమును ఉచితరీతిలో పాఠ్యక్రమంలో ప్రవేశపెట్టి శాస్త్రిమహానుభావుల పరిశ్రమాతిశయమును సఫలంచేయుదురుగాక అని తదధికారుల నర్థించుచున్నాను....." (సంస్కృతమునకు తెనుగుసేత)

(Sd). పట్టాభిరామశాస్త్రి (30-4-73)

ఈసౌరభగ్రంథమునుగూర్చి 27-3-84 తేదీ నాటి హిందూ డైలీ ఇలా అంటూంది.

"........Sree Suryanarayana Sastry, with his deep learning in the Vedas, Srauta and Smrtis has sought to bring out the flavour and fragrance of the literary blossoms of Kalidasa, a new. Interesting is his method coupled with new Interpretation, trying to show how many apparently secular Statements of the master poet have a philosophical import that should not we missed.
.....................

In creative ability Kalidasa surpasses the creator of the universe according to Suryanarayana Sastry (P.56)
....................................................................."

(Sd). P. V. Sivarama Dikshitar.

4. "పండితరాజ జగన్నాథమహాకవిః"

శ్రీశ్రీశృంగేరీపీఠాధిపతుల ఆశీరలంకృతాభిప్రాయం.

"....ఈమహాకవివిషయంలో ఇట్టి ఉత్తమప్రబంధమును ఇంతకు ముందు ఏఒక్కపండితుడును రచించి ఉండలేదు. సరళసంస్కృతంలో

రచితమైన యీప్రామాణికగ్రంథం – "పండితరాజజగన్నాథమహాకవి" యొక్క సత్యచరిత్రను సాంతముగా సంప్రకాశితం చేయగలిగి ఉంది."

Dr. N. S. రామానుజతాతాచార్య, "న్యాయ, వ్యాకరణ, మీమాంసా, వేదాంతశిరోమణి, విద్యావారిధి, తర్కవాచస్పతి, శాస్త్రరత్నాకర" డైరక్టర్, కేంద్రీయసంస్కృతవిద్యాపీఠమ్ – తిరుపతి.

"…. శ్రీశాస్త్రివర్యులు తమపండితరాజీయచరిత్రగ్రంథంలో– ఆజగన్నాథకవిసార్వభౌముడు ఆయామహారాజుల ఆస్థానములలో ఆదరగౌరవసత్కారముల నందుకొనుచు అచ్చట రచించిన నూత్నసిద్ధాంతసమలంకృతశాస్త్రగ్రంథరచనలను, 'ధర్మాధికారి' పదవిలో– ('పండితరాజ' పదవిలో) ఉండి రాజకీయంగా చేసిన 'హైందవధర్మ' సంరక్షణములను, హిందూమహమ్మదీయసఖ్యతాసంపాదనవిధానములను, అపేక్షితముఖ్యవిషయాలను నిదర్శనప్రదర్శనములతో ఇందు నిరూపించారు . . .

ఆఖరిప్రకరణంలో, పండితరాజకీర్తికి మాలిన్యాపాదకమైన అసత్యలవంగీగాథను సప్రమాణంగా ఖండించి, మహాకవి మహనీయకీర్తిని నిర్దోషముగా– నిత్యప్రకాశమానముగా– నిలబెట్టిన శాస్త్రి మహాశయులు హార్దికముగా అందరకు అభినంద్యులు.

'తర్కమౌక్తికమాల', 'వేదాంతాభరణం', 'సారసిద్ధాంతకౌస్తుభమ్' అనే అపూర్వశాస్త్రగ్రంథత్రయం పండితరాజకృతమేనని (కన్నడగ్రంథగతసాక్ష్యలతో) చూపిన శాస్త్రిగారి నిరూపణము విని సంతోషము జనించినది. ఇట్లు నూతన, చారిత్రకవిషయాలను ఆంధ్ర, కన్నడ, మహారాష్ట్ర– జయపుర– చరిత్రలనుండి ప్రమాణీకరిస్తూ సమగ్రసత్యచరిత్రగా నిర్మితమైన యీసరళసంస్కృతగ్రంథం, పండితరాజునుగూర్చి పరిశోధనలు (Research) చేసేవా రందరికి మార్గదర్శకమై సంస్కృతవిద్యార్థులకు అవశ్యపఠనీయముగా అలరారుతూంది." (ఆచార్యమహోదయుల అమరవాణికి తెనుగుసేత) (Sd) N.S. రామానుజతాతాచార్యః.

సంస్కృతము 20వ జాబితాలో 10వ సైటేషన్ నెం.

ఆర్. సి. నెం. 6–ఇ1/84 తేది 5–4–84 ఈగ్రంథం వెల రు 10/–